# సచివోత్తములు



ఇయ్యది

ఆంధ్ర సారస్వత పరిషత్కార్యదర్శులు, ప్రాచీన హిందూ
దేశ రాజ్యాంగ చరిత్ర, కన్నడదేశ చరిత్ర, గుంటూరు
సీమ ప్రతిభ, ప్రాచీన గ్రామ సభల న్యాయ్య
పరిపాలనము, దండనాథులు, దుర్గాధిపతులు,
— లోనగు గ్రంథముల విరచించి
విఖ్యాతిఁ జెందిన


విమర్శక శిరోమణి, సాహిత్యవిశారద,

**బ్రహ్మశ్రీ కోన వేంకటరాయ శర్మగారిచే**


రచియింపఁబడి

వైదన వాస్తవ్యులు, సంపన్న గృహస్థులు నగు

**బ్రహ్మశ్రీ కొప్పరపు వేంకట సుబ్బయ్య పంతులవారికిఁ**

**గృతి యీయఁబడినది.**





మూల్యము
రు 3 లు

# విషయసూచిక

# రాంబోవు గ్రంథములు

## ౧. దుర్గాధిపతులు :

విశేష పరిశ్రమచేసి శాసనాద్యాధారములతో వినికొండ, బెల్లముకొండ, బెజవాడ, కొండపల్లి, రాజుకొండ, ఉదయగిరి, గుత్తి పెనుగొండ, చంద్రగిరి, అద్దంకి, ఆదవని, — లోనగు దుర్గముల కధిపతులై విఖ్యాతి జెందిన ప్రముఖుల చరిత్రలు సమగ్రముగ నిందు వివరింపబడినవి.

## ౨. ప్రాచీన గ్రామసభల న్యాయ పరిపాలనము :

## ౩. కన్నడదేశ చరిత్ర :

బౌద్ధ యుగమునకుం బూర్వమునుండి క్రీ. శ ౧౫ దవ శతాబ్దము వఱకుం గల సమగ్ర చరిత్రను బూసగుచ్చినట్లు వ్రాయంబడినది.

## ౪. గుంటూరుసీమ ప్రతిభ :

ఇందుం గుండుకూరు మొదలుకొని కృష్ణాతీరము వఱకును, అట నుండి వినికొండ వఱకును, — గల భూభాగమునం గ్రీస్తు శకము పదొమ్మిదవ శతాబ్దము వఱకుం గల పండితులు, కవులు, చమూపతులు, శిల్పులు, — లోనగు వారందఱి చరిత్రలు చిత్రింపంబడినవి.

## ౫. ప్రాచీన హిందూదేశ రాజ్యాంగ చరిత్ర :

ఇందు గ్రామ నిర్మాణము, నాగరకత, శాసనసభలు, మంత్రులు, రాజులు, వారి ధర్మములు, ప్రభుత్వ కార్యములు — మొదలగునవి సవిమర్శముగ సోదాహరణముగ నిరూపింపబడినవి. (రెండవ ముద్రణము)

# మున్నుడి

విపశ్చిద్వరులార !

దేశచరిత్ర జ్ఞానము దేశాభివృద్ధికి ముఖ్య సహకారి. ఏయే భూభాగము లెట్టెట్టు లభివృద్ధిఁ జెందెనో ఆ యభివృద్ధికి మంత్రి సత్తము లెట్టు లుపకరించిరో కళలు, ధర్మ సంస్థలు, సప్త సంతానములు,—ఏయే రీతులఁ బోషింపఁ బడి, యుద్ధరింపఁ బడినవో,— తెలిసి యుండుట ముదావహము.

ఇట్టి మన దేశమున కిట్టి స్థితి యేల కలిగినదని గ్రహించుటయు మంచిది. అద్దాని మన పూర్వుల మహోత్తర కార్యముల నుదారాశయములఁ బరికించి నప్పుడును, వారి శౌర్యోచిత కృత్యముల నవగాహ మొనర్చికొని నప్పుడును,— ఒడలు జలదరించి మన యందొక నూతన తేజ ముదయించు ననుట సత్యదూరము గాదు.

ఇట్టి మహాపురుషుల, ప్రథితాయుకుల, సంతతి వారమును హృదయము పొంగి పౌరుల నాత్మశక్తి పట్ల విశ్వాస మంకురించి జాతీయాభివృద్ధి కవకాశ మేర్పడఁ గలదు. ఈ యాత్మ విశ్వాసము (self respect) నకును, దేశాభ్యుదయమునకును,— అవినాభావ సంబంధము కలదు.

కావుననే "చరిత్ర వ్రాయుట పవిత్ర మగు కార్య" మని 'కర్లయిలు' నొడివెను. చరిత్ర పరిజ్ఞానము లేనివాని జీవితము అయస్కాంతము లేని నౌకా యాత్ర వంటిది యని

చెప్పిన మన పూర్వులు ఏయే త్రోవలం ద్రొక్కి అంతింతన రాని యభివృద్ధిం జెంది విలసిల్లిరో యెట్టు లవక్రవిక్రమాటోపము నగపఱచి, ధీశక్తి చూపెట్టి, తమ ప్రాణములం బణముగా నొడ్డి శత్రుధ్వంసము నిలిపికొనిరో తెలిసికొనం జాలక తట్టుముట్టాడుచుందురు

కావ్యన శక్తి గాలేది శాసనాద్యాధారములతో నే నీ కొఱంతం దీర్పనెంచి యీ గ్రంథమును వ్రాసితిని. ప్రయోగ విజ్ఞానమును విద్వాంసులు సరిం జూచి సంతసించు వఱకును సాధు వని తలంప నను

> "ఆపరితోషా ద్విదుషాం న సాధు
> మన్యే ప్రయోగ విజ్ఞానం"—

మ్మను వాక్యము శరణ్యము గదా!

ఈ కృతి సమర్పణమునకును, ముద్రణమునకును, కృతిపతిని, వారి పుత్త్రులను,— ప్రోత్సహించి సాహాయ్యమిడిన బ్రహ్మశ్రీ భట్టిప్రోలు మాణిక్యరావు పంతులు బి ఏ, ఎల్ ఎల్. బి, గారికిం గృతజ్ఞుండను. వారికిం బరమేశ్వరుండు ఆయురారోగ్య భాగ్యముల నొసంగి యనవరతము శుభాశంసనముల నేం గోరుచున్నాండను.

నాగేశ్వరపురము,
బాపట్ల.
వికృతి కార్తీక శు ౧౫
శుక్రవారము

ఇట్లు, విన్నవించు
సాహిత్య విశారద, విమర్శక శిరోమణి,
కోట వేంకటరాయ శర్మ.

# కృతి సమర్పణము

కొండవీటి సీమ యందలి 'వైదన' గ్రామ కాఁపురస్థులు,

సంపద్విభవులు, వదాన్య శేఖరులు, ఆఱువేల నియోగి

భూసురులు, కౌండిన్య గోత్రోద్భవులు,

నగు

బ్రహ్మశ్రీ కొప్పరపు వేంకట సుబ్బయ్య పంతులు గారికి:

ఈ కృతి కన్యక నతిప్రేమతో

సమర్పింపఁ బడినది.

— కృతికర్త.

# కృతిపతి వంశము

పావనమైన కౌండిన్యర్షి గోత్రంబున, నార్వేలనియోగి బ్రాహ్మణవంశంబునఁ, గప్రంపుఁ బురుషోత్తమామాత్య లక్ష్మీదేవమ్మల గర్భ శుక్తి ముక్తాఫలం బన నుదయించిన వాఁడు వేంకట సుబ్బయ్య పంతులుఁగారు. వీరి ధర్మపత్ని వేంకట సుబ్బమ్మగారు. ఇమ్మహనీయ దంపతులకుఁ బురుషోత్తము, సూర్యనారాయణ, వేంకటేశ్వరరావు అను కొమాళ్లును, మహాలక్ష్మమ్మ యను కొమార్తయుఁ – గలిగిరి.

కాని దైవ దుర్విపాకమునఁ బురుషోత్తముఁడను జ్యేష్ఠ కొమారుఁడును ఆతని యర్ధాంగి నాగరత్నమ్మయు నకాల మరణము పాలయ్యె నని వినుటకుఁ జింతింపక తప్పదు.

ఇఁక సూర్యనారాయణ, వేంకటేశ్వరరావు అను వారలు సుగుణ సంపద్విభవులై, పూజ్యులగు తలిదండ్రుల కన్ని విధముల విధేయులై, ప్రజ్ఞానిధులై, కప్రంపు వంగడమున కెనలేని తేజస్సొదఁగూర్చుచున్నారు. సూర్యనారాయణగారి ధర్మపత్ని వేంకట సుబ్బమ్మయు, వేంకటేశ్వరరావు ధర్మపత్ని సీతామహాలక్ష్మమ్మయు, – నిరంతర పతిపూజారతులై యతిథి యభ్యాగతుల నాదరించుచు 'గృహిణీ గృహ ముచ్యతే' — యను నుడిని సార్థకతఁ జెందించుచున్నారు.

ఇఁక వీరి సోదరి మహాలక్ష్మమ్మ బాపట్ల కాఁపురస్థులు శ్రీ బాపట్ల సంజీవరావుగారిని సుముహూర్తంబునఁ బరిణయం బొడి గృహిణీధర్మము నిర్వర్తించుచుఁ, బుట్టినింటికిని మెట్టినింటికిని, – అపార యశం బొడఁ గూర్చుచున్నది.

ఇప్పావన వంశ మాచంద్రార్కస్థాయి నంది విలసిల్లుఁగావుత!

# విమలాదిత్యుని ప్రధానమంత్రి

# రావులవజ్జియ ప్రెగ్గడ

(క్రీ. శ. ౧౦ వ శతాబ్దము)

---

చతుష్షష్టికలాభిజ్ఞుఁ డగు దానార్ణవునకు నార్యామహాదేవియందు శక్తివర్మ, విమలాదిత్యుఁడు, — నను కొమాళ్లుదయించిరి. శక్తివర్మకుఁ జాళుక్యనారాయణుఁ డనియుఁ, జాళుక్యచంద్రుం డనియు, — నన్వర్థనామములు కలవు. దానార్ణవునిం బలె నితఁడు సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజాధిరా జను పేరితో నభిషిక్తుఁ డయి పండ్రెండేఁడు లేల్బడి సాఁగించిన వాఁడు.

ఇతఁడు చిన్ననాఁటనే ద్రవిడులైన చోడులకు సాహాయ్యమొనర్చుటకయి యేఁగి పోరాడిన యొక మహాహవమున శౌర్య, ధైర్య, ప్రభావంబుల నగపఱచిన సాహస విక్రమార్కుఁడు. దాని, ధీనిధి. పోయిన పైతృకసామ్రాజ్యమును మరల నార్జించుట కుద్యుక్తుఁడు గాఁగా, జటాచోడ భీముఁడు చారులఁ బెక్కుర నంపి తద్వృత్తాంత మెఱింగి విఫలమనోరథు నొనర్చెను.

కాని శక్తివర్మ క్రమక్రమముగ బలదర్పముల సేకరించుటను దెలిసికొని జటాచోడుఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యెను.

ఆనాటి యాహవమున శక్తివర్మకుఁ దోడ్పాటుఁగాఁ జోళచక్రవర్తి రాజకేసరివర్మ రాజరాజసైన్య మంపెను. జటాచోడుఁడు దైవబలము లేకుండుటచే బలవంతుఁ డయ్యును జేయునది లేక యోడిపోయెను. కాఁగా, వేంగీసామ్రాజ్యము శక్తివర్మ యధీన మైనది. దానార్ణవునిసంతతి వేంగీసామ్రాజ్యమునఁ బునఃప్రతిష్ఠిత మైనది మొదలు చోళ - పాశ్చాత్య చాళుక్య సామ్రాజ్యములకు స్పర్ధ దినదినప్రవర్ధమానమగుచు వచ్చెను. చోళచక్రవర్తి మొదటి రాజరాజు దానార్ణవుని కొమాళ్ళకుఁ దోడ్పడుట కేవలము వాత్సల్యముచేఁగాదు; రాజ్యతృష్ణయాతని కధికము.

వేంగీరాజవంశమునకు సాహాయ్యమొనర్చి వారి రాజ్యమును వారి కిప్పించినయెడల వారు తనకు విధేయులై వర్తింతురని తలంచి, విమలాదిత్యునకుఁ దన కొమార్తె 'కుందవమహాదేవి' నిచ్చి, పెండ్లిఁజేసి, తనదగ్గఱ నుంచికొనియెను.

ఇవ్విధముగ వేంగిరాజ్యము చోళుల హస్తగతమయ్యెను. ఇది కళ్యాణి, చాళుక్యులకుఁ గన్నుకుట్టినట్టు లయ్యెను గాని యా సమయముననే రాష్ట్రకూటవంశమును గూలఁద్రోచి కర్ణాటకసామ్రాజ్యము నాక్రమించుకొనుచుండుటచేత వేంగిసామ్రాజ్యలక్ష్మినిఁ జోళుల హస్తగతము గానీక ఆఁపునంతటి మనోధర్మము, బలదర్పములు, - వారికి లేక పోయినవి.

ఆహవరంగమున దానార్ణవుఁడు సనిపోవునప్పటికి శక్తివర్మకు నాల్గేఁడుల వయసును, విమలాదిత్యునకు నాలుగై

దేఁడుల వయసును, – నుండిన కారణమున నధికశౌర్యధనుం
డగు జటాచోడభీమునిఁ బ్రతిఘటించి యెదురొడ్డి పైతృక
రాజ్యమును బడయఁజాల రయిరి. మంత్రివర్గమునకుఁగాని,
యాప్తవర్గమునకుఁగాని, – దానార్ణవుని జ్యేష్ఠపుత్త్రుని వేంగీ
సామ్రాజ్య భద్రపీఠిపైఁ గూర్చుండఁబెట్టజాలకపోయిరి. అప్రతి
మాన ప్రతిభాఢ్యుఁ డగు జటాచోడభీముఁడు తెలుఁగు చోడ
వంశ సంజాతుఁడు. ఇతని వంశప్రశస్తియు, శౌర్యోచిత కృత్య
ములును, – 'కంచి' యందలి విజయస్తంభముమీఁదఁ జెక్క-
బడి యున్నవి. ఇతని పూర్వులు రాజ చలుక్యవంశమునకుఁ
సామంతులు, బంధువులు, నై యుండిరి. వారు శేవాటికిఁ
బ్రభువులు. వారందఱు తటాకారామ శివాలయాదులఁ
గట్టించి "యశః కాయేన జీవన"మ్మను నుడి సార్థకమొనర్చు
కొనినవారు. సంగ్రామవిజయ, అరసరాభరణ, సుకవిచింతా
మణి, కీర్తిదిలీప, సత్యావతార, సమరైకవీర, రణరంగమల్ల,
విక్రమధనంజ యేత్యాదులీ జటాచోడభీముని బిరుదములు.

ఇతని తోఁబుట్టువు వేంగీచాలుక్యులలోఁ జిష్ణకోవకుఁ
జెందిన బాదపుని ధర్మపత్నియౌటను, యుద్ధమల్లుని కొమారుఁ
డగు బాదపునకుఁగూడ వేంగీమహాసామ్రాజ్యము పైతృక
దాయమై యుండుటను, – బాదపుని నభిషిక్తుఁ నొనర్ప
యత్నించెనని చెప్పనగును. కావున బాదపుఁడు ఇమ్మడి అమ్మ
రాజు నోడించి 'సమస్త భువనాశ్రయ శ్రీ విజయాదిత్య' యను
పేరితో వేంగిమహాసామ్రాజ్యమున కభిషిక్తుఁ డయ్యెను.

బాదపుఁడు సంతానము లేనివాఁ డౌటచే నాతని భార్యకు
సంక్రమించిన వేంగీసామ్రాజ్యమును జటాచోడభీముఁడు

'స్వభగినీ పదమంధ్రిమండల'మ్మని తెలుపుచుఁ బరిపాలించినాఁడు. ఈ సందర్భముననే దానార్ణవ, నృపకామాల నిద్దఱను రణరంగమున నోటమిఁబుచ్చి, సర్వము హరించి, — చంపెను.

ఈ పనితోఁ దన్నెదిరించి మొగ్గరమున నిలువఁగలాఁడు లేక జటాచోడభీముఁడు వక్రపరాక్రమముతో సహా రైకపీఠుఁడై కీర్తిదిలీపుఁడై, విక్రమధనంజయుఁడై — తేజరిల్లెను.

శక్తివర్మ వేంగీమహాసామ్రాజ్యముం గైకొనుటకు జేయుచుండిన ప్రయత్నముల నన్నిఁటిని జటాచోడభీముఁడు తుత్తునియల నొనర్చినను లక్ష్యముసేయక ధైర్య, స్థైర్య, గాంభీర్యాది సల్లక్షణోపేతుండు గావున నిరుత్సాహమందక ప్రతిక్రియల నొనర్చుచుండుటచేఁ గాబోలు కవియొకరుఁడు "మృగాధిపసతిం మాయాం హరేః పౌరుష"మ్మని శక్తివర్మను వినుతించినాఁడు. ఇరువదియేఁడేఁడు లతఁడు విసువక, క్రుంగక పోరుసల్పి తుదకు విజయలక్ష్మినిఁ గైవస మొనర్చికొనియెను.

ఇమ్మడి తైలపుఁడు చనిపోవుటతో జటాచోడఁడేకాకి యాటయు, ముదుసలి యాటయు, జీవితమంతయు సంక్షోభములతో సంగ్రామములతోఁగడచన్నను ఇటివ బెడంగ సత్యాశ్రయునకు దోడ్పడుటకుఁగాఁ గర్ణాటదేశమునకుఁ దరలసాఁగెను. అది నూచి శక్తివర్మ నష్టసామ్రాజ్యముం గొనుట కుద్యుక్తుఁడు గాఁగాఁ గర్ణాటక రాష్ట్రమున కేఁగుచున్న జటాచోడ భీముఁడు వీని ప్రయత్నమును విని మరలివచ్చి శక్తివర్మతోఁ దలఁపడి యోడిపోయెను.

శక్తివర్మ యంతతోఁ దనిపోక జటాచోడుని బంధు మిత్త్రాప్తుల నెల్లఱ మడియించి కూకటి[వేళులతోఁ జెట్టును గొట్టినట్టు లతని వంశము నిర్వంశ మొనర్చెను. ఆవలఁ గళింగముపైకిం జని జటాచోడభీముని [ప్రతినిధినిఁ జంపి యా రాజ్యము నిమ్మడి వ[జహస్తున కొసఁగి పూర్వ మైత్రిని నిలువం బెట్టెను. ఇప్పని క్రీ. శ. ౯౯౯–౧౦౦౦ కు సరియగు వికారి సంవత్సరమున జరగినట్టు లవగతమగుచున్నది.

ఇవ్విధముగఁ బైతృకరాజ్యమును దీక్షతో జయించుకొన్న విక్రమాదిత్యుఁడే శక్తివర్మ. అనాయక మైయున్న వేంగీసామ్రాజ్యలక్ష్మినిఁ బరిగ్రహించి చలుక్యనారాయణుం డయ్యెను. ఇట్టి సమయమున నాతని చెలిమియు బంధుత్వమును సమాదరణీయము లని చోళరాజు తలఁచి యౌవరాజ్యాభిషిక్తుం డగు విమలాదిత్యునకుఁ దన కూఁతును క్రీ. శ. ౧౦౦౨–౦౩ శుభకృత్సంవత్సర ప్రాంతమున నిచ్చెను. చోళరాజ్యాభివృద్ధికి బంధుత్వము దోహద మయ్యెను. శక్తివర్మ పైతృకదాయ మగు వేంగీసింహాసనా భద్రపీఠ మధివసించిన తరువాత దేశమున శాంతి భద్రత లేర్పడియెను. వెంటనే యతఁడు వరాహ లాంఛనముగఁ గల సువర్ణ గద్యాణముల ముద్రించెను.

శక్తివర్మ క్రీ. శ. ౧౦౧౧ వ సంవత్సరమునఁ (Ep. Indica, Vol, IV, p. 349) జనిపోయిన తర్వాత నతని తమ్ముఁడు విమలాదిత్యుఁడు వేంగీసామ్రాజ్యమునకుఁ బట్టము గట్టికొనియె నని 'కోరుమిల్లి' శాసన మవగత మొనర్చుచున్నది. ఇతఁడు శ ౯౩౩ (క్రీ. శ. ౧౦౧౧ వ సంవత్సరము

మెయి నెల ౧౦ దవ తేది) జ్యేష్ఠ శుక్ల పంచమీ గురువారము పుష్యమీ నక్షత్ర సింహాలగ్నమున బట్టాభిషిక్తుఁ డయినట్టు "రణస్థిపూండి" శాసనము విదితము సేయుచున్నది.

"అనలానల రంధ్రగతే శకవర్షే
వృషభమాసి సితపక్షే,
య షష్ఠ్యాం గురు పుష్యే సింహే
లగ్నే ప్రసిద్ధ మభిషిక్తః"—(౧౩)

అను 'రణస్థపూండి' శాసనము. (Ep. Indica; Vol 6, P. 247.)

ముమ్మడి భీముఁడు, బిరుదాంక భీముఁడు, త్రిభువనాంకుశుఁడు,—అను బిరుదములు గలవాఁడు విమలాదిత్యుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౦౧౮ వ సంవత్సరమున 'దిరువయ్యార్' నందలి 'పంచనాథేశ్వరస్వామి' కి ద్రవ్యదానము సేసి శాసనము వ్రాయించినది రాజరాజ కేసరివర్మకొమార్తెయగు 'కుందవ్వ'ను వివాహముఁ జేసికొన్న బంధుత్వముచేతనే గాని వేఱు కారణమునఁ గాదు. ఇతఁడు జైనమతావలంబి యయ్యును బరమతసహిష్ణుఁ డౌటచేఁ బంచనాథేశ్వరునకు దానము సేయఁగల్గెను. ఇతనికిఁ గుందవాదేవి, మేడమాదేవి,—యను నిద్దఱు భార్య లుండిరి. కుందవ్వకు జనించిన వాఁడు రాజరాజును, మేడమకుఁ బుట్టిన యతఁడు విజయాదిత్యుఁడును,—నై యుండిరి. రాజరాజును దండ్రివంక వారు విష్ణువర్ధనుం డనియుఁ దల్లివంకవారు రాజరా జనియుఁ,—బిలుచు చుండిరి.

విమలాదిత్యుని పరిపాలనా కాలమున మహామాత్యుం డగు వజ్జియప్రెగడ అగపఱచిన రాజనీతి కచ్చెరువంది 'గుద్రవాడి' విషయ మందలి 'పాఱువళము' నను గ్రామముతోఁ గూడ 'రణస్థిపూండి' గ్రామము (ఇప్పు డీ గ్రామము 'బెచిగురాకు' గ్రామముగా నగపడు చున్నది.) నగ్రహారముగాఁ జేసి దానముసేసెను.

ఏనాఁడు కుబ్జవిష్ణువు 'వేంగీసామ్రాజ్యస్థాత' యయ్యెనో యానాఁటినుండి వేంగీ చలుక్యసామ్రాజ్యభద్రపీఠమును బరమ మాహేశ్వరుం డగు సుక్షత్రియ కులావతంసుఁడే యధిష్ఠింపవలె నను నొక సంప్రదాయ మేర్పడినది. అది రాజచలుక్యవంశ మర్యాద. అది వేంగీచాళుక్యుల రాజనీతి వేతృత్వము. వేంగీచాళుక్యుల కులదైవతము దక్ష వాటి భీమేశ్వర దేవుఁడు. ఇ య్యనూచానము, ఈ మర్యాద,— సుస్థిరమై పోయినది.

'త్రికాలయోగి సిద్ధాంత దేవముని' యను నొక జైన యతి మూలసంఘ మందలి 'కొండకుందాన్వయము' నకుఁ జెందిన నందిగణము వాఁడు. దిగంబర జైనసంప్రదాయము వాఁడు. గొల్లాచార్యుని శిష్యుఁడు,— తెలుఁగు దేశమునకు వచ్చెను. ఇతఁడు నూత్న చందిల కులజుఁడు. ఏ హేతువుననో యతఁడు జినధర్మము స్వీకరించి యతియయ్యెను. కాఁగా, మహామహిమాన్వితుం డయి దేశిగణమున కుపదేశికుం డయ్యెను. వీని సమకాలికుం డైన ప్రభాచంద్రుఁడు—ధారా నగరాధిపతియైన భోజనిచే గౌరవసత్కృతుల నంది యుండెను.

ఈ ధారా నగరాధిపతి విమలాదిత్యుని మిత్రుఁడగుటచే జినమునులు జీవన్ముక్తు లయిన దివ్యస్థళ మని చెప్పఁబడు సిద్ధక్షేత్రమే రామతీర్థము నాఁబడునది. విమలాదిత్యుని కాలమునఁ గళింగము వేంగిమహాసామ్రాజ్యములోని దేశము గనుండెను. కాఁగాఁ, త్రికాలయోగి రామతీర్థమున కేఁగి యచ్చట నివాస మేర్పఱచికొని యుండి జినధర్మోపదేశముల వేంగిసమ్రాట్టు నకు వినుపించుటయు, నతఁడు త్రికాలయోగి మహనీయ గుణసంపదను, శక్తిని,—విలోకించి వెఱఁగంది శ్రావకుఁడై యంతేవాసి యగుటయుఁ,—దటస్థించెను.

నాఁడు నాటికి జినధర్మము హృదయాంగత శల్యాగతములు గాఁగా విమలాదిత్యుఁడు పరమ మాహేశ్వరాచారమును విడనాడి విరక్తుఁడై సామ్రాజ్యమునుగూడఁ గాలదన్న సునిశ్చితుఁ డయ్యెను. కాని 'రణస్థిపూండి' శాసనకాలము నాఁటికి నాతఁ డింకను బరమ మహేశ్వరుఁడే!

'కలిదిండి శాసనము'న బేతనభట్టు వివరించినట్టు లభి షిక్తుఁడుగాని రాజప్రతినిధి యగు రాజరాజు, సచివోత్తముఁ డగు వజ్జామాత్యుఁడు, త్యాగియగు విమలాదిత్యుఁడు,—కల ప్రతినిధివర్గమును మనుమార్గప్రవర్తకుం జేాట నియమించి సామ్రాజ్యసంరక్షణము సేయుచుండెను. విమలాదిత్యుఁడు జినధర్మప్రవర్తకుఁడై, విరక్తుఁడై, యైహికానందముల, లౌకిక భోగములఁ, ద్యజించి మూఁడేఁడులు కడచన్న పిదప శ.౯౩౮ (క్రీ.శ.౧౦౧౬) జన్మించి శ.౯౪౪ (క్రీ.శ.౧౦౨౨)న సింహాసనాభద్రపీఠిని రాజరాజును బ్రతిష్ఠించి తాను రాజ్య

భారమును దించికొనియెను. అనఁగా రాజరాజు త్యాగరాజ సింహాసనాసీనుఁ డయ్యెను. విమలాదిత్యుఁడు రాజ ప్రతినిధి వర్గము నేర్పఱచి సింహాసనమును బరిత్యజించుట సాహసకార్య మనకతప్పదు. కాని కార్యఖడ్గదక్షుఁ డైన వజ్జియప్రెగడను జూచికొనియే యా సాహసకార్యమునకుఁ దలఁపడి యుండును. ఇది జరగిన సంవత్సరమునకే యతఁడు సనిపోయి యుండును.

రాజరాజు వేంగీసామ్రాజ్యమున కభిషిక్తు డయిన పిదపఁ దన సవతి తమ్ముఁ డగు వీర విజయాదిత్యుని యౌవరాజ్యమున కభిషిక్తు నొనర్చెను.

ఇ య్యదనునఁ గళింగరాజ్యాధిపతి యగు మధుకామార్ణవుఁడు రాజరాజునకు శత్రు వయ్యెను. 'జ్ఞాతిశ్చే దన లేన కిం' మ్మను నుడి ననుసరించి దాయాదులను, విరోధులను, గెలుపొందినఁ గాని రాజరా జభిషిక్తుఁడు గాలేదు. అభిషిక్తుఁ డయినతర్వాతనే రాజరాజు అమ్మంగదేవిని వివాహమాడెను. ఆమె మధురాంతక దేవుఁ డను నన్వర్థనామము గల రాజేంద్ర చోళదేవుని కొమార్త. రాజరాజు దాయాది లోనగుఁ శత్రుల పీఁచమడఁచి వేంగీమహాసామ్రాజ్యభద్రసింహాసనాసీనుఁ డయ్యె నని వినుకలి యై యాతనికిఁ గల యున్నతవంశ, వినయ త్యాగ, అభిమాన, ప్రజ్ఞా, ప్రాభవ, కీర్తులను, సత్య, శౌచ, సహనాది సల్లక్షణములను,— గమనించి ప్రహృష్టుం డయి నెయ్యముతో మధురాంతక దేవుఁడు చలుక్యాభరణుం డయిన రాజరాజునకుఁ దన కొమార్తె నిచ్చి యుద్వాహ మొనర్చి

యథాగ్రహప్రతిష్ఠఁ జేసెనని బేతనభట్టు 'కోనుమిల్లి' శాసనమున నుట్టంకించెను. ఇ విగ్రహము ప్రతిష్ఠితుం డయిన కొలఁది దినములకే అనఁగా శ. ౯౪౪ సం॥ర మాఘ ఫాల్గునములలోఁ (క్రీస్తుశకము ౧౦౨౩ ఫిబ్రవరిలో) రాజమహేంద్రవరమున జరిగెనని తలంపనగును. ఘన నజ్జు ప్రెగడ సలహా సాహాయ్యములు, ఆదరాభిమానములు, ఆశీఃపరంపరలు,—
ఇ పుణ్యకార్యమునకుఁ దోడ్పడినవి,

సిద్ధార్థి (౧౦౧౯ జులయి) సంవత్సరము నాఁటి 'రణస్థిపూండి' శాసనమునఁ గల

"ఆద్యోయః స్వయముద్బభూవ
పరమబ్రహ్మ నిమృజ్యాన్వహో,
వీర్యాన్ స్వవ సృష్ట మణ్డ మభవ
ద్ధైమ మ్మహాతేన యత్,
తస్మా ల్లోకపితామహా విధి రభూ
త్తస్మా న్మరీచ్యాదయః
పుత్త్రాయే దశ జజ్ఞిరే క్షితిమయా
వర్చస్వినో మానసాః; ౨౧
"తేషాం శ్రేష్ఠతమో వసిష్ఠ ఇతి
యస్మారుంధతీకో ముని
స్తస్మా త్కుండిన ఇత్యవభూ దధిచా
త తౌండిన్యగోత్రే క్రమాత్
యో విద్యా నుదితోదిత ద్విజవరో
ద్రోణః ప్రమాణీభవ

ద్వ్యాత్తః స్తుత్యాయ మతి
రిన్హత్యోదయ స్సత్యవాక్. ౨౨

"దత్తాభిధాన సచివో హారదత్త
వర ప్రసాద ఇవ తస్య సుతః,
శుభకృ త్ప్రభావ మహితః ప్రభుమం
త్రోత్సాహ శక్తి సంయుక్తః. ౨౩

"తస్య చ సద్గుణధామ్నః పతి
వ్రతాయాశ్చ చీడమాంబాయాః,
వజ్రాభిధాన ఇతి య స్సూను
స్సూనృతవచా స్సుమేధా స్సుమనాః. ౨౪

"బిత్యాకర్ణనయా శశ్వ
ద్వటుభిః పటుభి ర్గృహే
వేదశాస్త్రాణి య ద్ధామ్ని
పఠంతి శుక శారికాః. ౨౫

"భీమేశ్వరసమో దేవో
వేంగీశ్వర సమో నృపః
వజ్రామాత్య సమో౽మాత్యో
నభూతో న భవిష్యతి. ౨౬

"నాగేంద్రై ర్దిగిభైశ్చ షోడశ నృ
పై రాద్యై ర్ధృతాం క్ష్మాధురాం
వీరై రప్యతి శూద్రకప్రభృతిభి
శ్చా జేర్ధురం దుస్సహాం

బిభద్వ్యః ప్రథితం క్రమాన్వయ
జలా ద్భవో జలా ప్రాప్తవాన్
సాహోఖ్యం బిరుదంక ఫీయ స్పృహతే
కార్త్స్యేన ఖడ్గేన చ.

"గోత్రచ్ఛేత్తు రరిషుమహీధర కులో
ద్భేదా న్మహేంద్రాత్ క్షమః,
శ్రీమాన్ భూపమహేంద్ర ఏవ నితరాం
గోత్రైక నిస్తారకః,
త ద్వజ్రా దతిరిచ్యతే లఘుతరా
ద్వజ్రాభిధేయం గురుః.
య న్నామ్నో౽పి చ య ద్భటశ్చ విబు
ధవ్రాతై రితి స్తూయతే॥

"యత్ప్రేధానల ధూమ్రధూమ ఘటితై
రభ్రై ర్విజేషో హిత,
క్షోణీభృ త్పురదాహ ధూమ జనితాం
భోభృ త్సహాస్రై స్సమం,
వ్యాప్తం వ్యోమ తదీయ శత్రు లలనా
దృక్పాథ సామా క్షమా,
సిక్తా య త్పరిపావనాతిథి పద
పశౌలనా చ్చాంభసా."

"యః శ్రీ వజ్రామాత్యో ధన సం
తర్పిత జగజ్జన స్తుత్యః.

భూసురవంశాదిత్య శ్చ్యచిరతి
చతురో వచో నిరత్యా య సత్యః॥" ౩౧

"బుధ వ్రజ ప్రాకారో గృహా నియమి
తారి సైనికచక్రః,
చక్ర భృదుద్వ శ్రీకః శ్రీకణ్ఠ
పదారవింద షట్చరణః॥" ౩౧

"సదా స్వవాచా మనసా చ కర్మణా
న్వ్యకారి యే నాథ గుణేన కుండినః,
ప్రవృత్త వైతా నివ ధర్మసంగతి ర్ద్విజనాథో
య ముదారతా నిధిః॥" ౩౨

"చాలుక్యచూడామణి పాదభక్తో
భక్తైకచూడామణి రీశమూర్తిః,
కీర్త్యన్వితోమాత్యశిఖామణిః
శ్రీ సౌజన్య రత్నాకర నామధేయః॥" ౩౩

"సప్తాంగకే నృపపదే ప్రభృతా ప్రధానా
తాదృశ్యమాత్యపదవీ ఖలు తత్ ద్వితీయా
శ్రీ ద్వారపింఛ కరకాతపవారణాది
స్తస్యాం విశేషమహిమా మదలాభియేన॥" ౩౪

"తస్మై మద్భక్తాయ కృతక్లేశాయ 'కారమచేడు' వాస్తవ్యాయ కౌండిన్యగోత్రియామాత్యశిఖామణ్యే బుధవ్రజప్రాకారాయ సౌజన్య రత్నాకరాయ వజ్జియప్రెగ్గడ ఇతి ప్రసిద్ధాభిధానాయ భవద్విషయో 'పాఱువటి' నామ గ్రామేణ

స్తార్థం 'రణస్థిపూండి' నామ గ్రామోఽగ్రహారీకృత్య మత్సం
వర్థిత్వా నిమిత్తే మయూదత్త ఇతి విదిత మస్తువః"

"అష్టమవర్ష వర్షనే సింహ
మాసే దత్తస్యాస్య
శాసనస్య శ్రీ దణ్డనాయక
ఇతి ద్విజాధినాయకః,
ఆజ్ఞప్తి గ్తు ప్రకామో రాచియ పెద్దరి
తనయ భీమనభట్టః,
కర్త్రేషాం కావ్యానా మథ శాసనలేఖ
కశ్చ బొంతాచార్యః." 32

—అను వాక్యములవలన నితఁడు కౌండిన్యగోత్రుఁడు, ద్రోణమంత్రి పౌత్రుఁడు, హరిదత్తవరప్రసాదుఁడైన దత్తామాత్యుని కొమారుఁడు; శుభకృత్ప్రభావమహితుఁడు, ప్రభుమంత్రోత్సాహ శక్తిసంయుక్తుఁడు, నగు దత్తమంత్రికి సద్గుణనికురుంబయుఁ, బతివ్రతయు నగు చీడమాంబ ధర్మపత్ని. ఈ పుణ్యదంపతులకు జనించిన యతఁడు వజ్జియప్రెగ్గడ. ఇతనినే వజ్రిమాత్యుఁడని యందురని తెలియనగు చున్నది.

కమ్మరాష్ట్రములోని "కారమచేడు" (బాపట్లతాలూకాలోనిది) వాస్తవ్యుఁడు వజ్జియ. ఇతఁడు బుద్ధిమదగ్రగణ్యుఁడు. సుహృద్వత్సలుఁడు. అవిరళజపహోమతత్పరుఁడు. సకలవేదార్థనిష్ణాతుఁడు. శుచి. దాని. చతుర సత్యవచో నిరతుఁడు. బుధవప్రాకారుఁడు. శ్రీకంఠపదారవిందషట్పదుఁడు. సౌజన్యరత్నాకరుఁడు. స్వామికార్యనిర్వాహణదక్షుఁడు. త్రికరణములఁ

పావనచరితుం డగు కౌండిన్యర్షి వంటివాఁడు. శివభక్తుఁడు, యజ్ఞయాగాదిక్రతువులఁ బెక్కింటి నొనర్చిన కర్మిష్ఠి. విప్రకుల భాస్కరుఁడు. స్వయముగ నగ్నిష్టోమాతిరాత్రము లోనగు క్రతువుల ననేకములఁ జేయుచుఁ, బ్రత్యహ మరుదెంచు నతిథి యభ్యాగతులకు వలయు భోజనమజ్జనాదుల నొసంగుచు, వారి నిత్యనైమిత్తిక కర్మలకుం దగు విశ్రాంతి, యవకాశములు, ఆశ్రయము, లభింపఁజేయు చుండెడి వాఁడు.

పురోడాశపవిత్రవక్త్రుఁడు, విద్వాంసుల, వేదవిధిజ్ఞుల, సోమయాజుల, నధిక ధనరాసులతో సత్కరించెడివాఁడు. బౌద్ధ శ్రమణులు, దిగంబరజైనులు,—వీరు వారననేల నర్థు లందఱును వజ్జియప్రెగ్గడచే నాదరింపఁబడుచునే యుండిరి. ఇతఁడు మహాదాని యనాట నత్యధికముగఁ బ్రశంసింపఁబడు చుండెడివాఁడు.

ఇమ్మహామాత్యుఁడు రాజకార్యములఁ దన ధర్మ హర్మ్యము నందె సాఁగించు చుండెడివాఁడు. ఆ ధర్మహర్మ్య మున కొక ప్రక్క మనోహర మైన లీలోద్యానమును, దాని నడుమ నొక వాపికయు, నింకొకవంకఁ జారుతరం బగు గోష్ఠ మును,—గలవు. ఆ గోష్ఠమునఁ గపిలధేను వొకటి నయనా నందకరం బై, లోకమోహనకరం బై,—యుండి గోష్ఠమున కంతకుఁ దేజస్సొడఁగూర్చుచు నుండుట వలన దానిక్షీరములు హవ్యకవ్యము లకు వజ్జియ వినియోగించు చుండెడివాఁడు.

వజ్జియ ప్రత్యూషముననే మేల్కొని యా ధేనువును సందర్శించుచుండుటయు, నితని ధర్మపత్ని దాని పోషణమున శ్రద్ధ వహించుచుఁ బాలుఁ దీయుచుండుటయు, జరగుచుండెడిది.

ఆ గోష్ఠములోని తక్కుటి యూలపాలు నాల్గుకులములవారికి నాదరాభిమానములతోఁ బంచిపెట్టుటయేగాక వ్యాధిగ్రస్తులకును, బసిబిడ్డల తల్లులకు వజ్జయప్రెగడ ధర్మపత్ని యుచితముగ స్వయముగ నొసంగుచుండెడిది.

అక్కటతన రోగులు నిరోగు లగుచుండుటయు, బసిపిల్లలు పుష్టిగలవారయి యుండుటను, జూచి తల్లులు తమ పిల్ల లారోగ్యముగ నున్నారని పరితృప్తు లగుచుండుటయు,—జరుగుచుం డెడిది. ఇందువలననే యతని గృహము పుణ్యగృహమని ప్రసిద్ధిఁ జెందెను. మేధావు లయిన బ్రాహ్మణ వటువుల హరహము వేదాధ్యయన మొనరించుచుండుటచే నా గృహ మొక ప్రసిద్ధ గురుకులముగాఁ బరిగణింపఁ బడినది. అందు శుక శారికలు సైతము నిరంతర వేదాధ్యయన శ్రవణమున వేద ఋక్కులఁ బల్కుచుండును. 'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్త్ర' మ్మను సూక్తికి లక్ష్యభూతుం డౌట నాతనిఁ బోలిన మంత్రి సత్తముఁడుగాని, విమలాదిత్యునివంటి నృపాలుఁడుగాని, దక్షవాటి భీమేశ్వరునివంటి దేవుఁడుగాని,— యంతకుఁ 'బూర్వముగాని, యిఁక ముందుగాని,—యుదయింప రని భీమనభట్టు' వ్రాసినాఁడు.

ఇతఁడు కార్యఖడ్గ ధౌరంధర్యమున బిరుదాంక భూపాలున కనవరతము తోడ్పడుచుండెడువాఁడు. ఆ స్తభృత్యుఁడై విమలాదిత్య భూరమణునిం గొలిచి ప్రధానామాత్యుఁడు కాఁగలెను. కావుననే విమలాదిత్యుఁడు తన యభ్యుదయాభివృద్ధికయి యగ్రహారము నొసంగి శ్రీ ద్వారపింఛకర ఛాతప వారణాది నృపచిహ్నముల నిచ్చి వజ్జయను సమ్మానించెను.

కాకతీయాంధ్ర చక్రవర్తి యగు రెండవ ప్రోలరాజు నొద్ద

## మహామాత్యుఁడుగా నున్న

# చెల్లకి గంగాధరమంత్రి

( క్రీ. శ. ౧౨ వ శతాబ్దము )

ఇతఁడు మహామండలేశ్వరుం డగు రెండవ ప్రోలరాజు నొద్ద మహామాత్యుఁడుగాఁ దేజరిల్లినవాఁడు. 'వేఁగి' దేశ మందలి 'చెల్లకి' పురవాస్తవ్యుఁడు. ఆత్రేయగోత్రుఁడు. ఆర్వేల నియోగి బ్రాహ్మణుఁడు. ఇమ్మనీషినిఁ బ్రోలరాజు మహామాత్యునిఁగా నియమించి, 'యనుకొండ'లో నివాసమేర్పఱచె నని,

"వెలయంగ వేఁగిదేశం
బు లోన నాత్రేయ గోత్రపుంగవులు మహా
త్ములు 'చెల్లకిపురంబు'న
బలవంతులు పుట్టి, పెరిఁగి, పాలించి రనన్.

"భూధరధైర్యు నత్యధిక
పుణ్యచరిత్రుఁ డపారకీర్తి ల
క్ష్మీధరమూర్తి శిష్టజన
మిత్త్రుఁడు గోత్రపవిత్రుఁ డచ్యుతా
రాధన తత్పరుండు సుర
రాజగురుండు మతిప్రభాతి 'గం

గాధరుఁ డీ ధరిత్రి నరుఁ
గా నుదయించి శుభోదయంబునకా,
మాతా పితృవర్గము సం
ప్రీతిం జదివించి, మన్చి, పెన్చి, లస ద్వి
ద్యాతిశయ కుశలుఁజేసి వి
భూతిం బరిణయముచేసి పోషింపంగన్.

"సకల కలావిధిజ్ఞుఁ డనఁ
జాలి సమస్త జనాలి సద్గుణ
ప్రకరము నెప్పుడు న్బుధ స
భ న్బరిణుతింపఁగ నున్నయట్టి స
న్ప్రకటితకీర్తి ప్రోలజన
పాలుఁడు ఘోరతరాజిలోలుఁ డ
త్యకుటిల చిత్తుఁ డీతఁ డని
యాదరిక న్బిలిపించి పంపఁగన్.
"చనువుమెయి 'నగరి'లోఁ దగు
పను లెల్లను బెంపుమెఱసి పరికించుచు నే
ర్పును భక్తి యుక్తి నతి ముద
మునఁ జేయుచుఁ దత్పరోక్షమున మతియుఁ బ్రభన్"

—అను 'కరీంనగర' శాసనపద్యము లవగత మొనర్చు చున్నవి.

దీనిం బట్టి గంగాధరమంత్రి సకలకలా విధిజ్ఞుఁ డనఁ జాలి సమస్తజనాలి సద్గుణప్రకరమును నిరంతరము బుధసభను బరిణుతింపఁగ నున్న యకుటిలచిత్తుఁ డని స్పష్ట మగుచున్నది.

ఈ వంశపు మూలపురుషుఁడు కొమ్మన యనువాఁడు. ఆతఁడు ప్రభవించి మిపుల వైభవోపేతుం డయి 'చెల్లకి' పురమ్మునఁ బ్రభతోఁ గాఁపురం బుండఁగా, నతనికి బంధు చింతామణియు, శ్రీయుతుఁడును, – నగు నారాయణుం డను వాఁడు జనియించెను. ఇతని భార్య అయితమాంబ. ఈ పుణ్య దంపతులకు 'గోవిందుఁ'డను నాతఁడు పుట్టి నిర్మలప్రథిత విజ్ఞానముతోఁ దేజరిల్లుచుఁ, దురకమాంబ వలన గంగాధర మంత్రినిఁ గనియెను.

'వ్యోజదండనాథుఁడు' కదనరంగంబునం దోడి దాని యందుఁ జనిపోవుటచే నా మహామాత్యపదవి నీతఁడు వడసి ప్రోలరాజు నాఁటను, రుద్రదేవుకాలమునను, – గూడ నమాత్యపదవి యందె యుండి యత్యధి కాదరాభిమానముల తోడ సమ్మానముల, గౌరవసత్కారములఁ బొందినట్లు 'కరీము నగర' శాసనము విదిత మొనర్చుచున్నది.

"వెలయ నమాత్య సంపదయు
విస్ఫురితమైన నియోగవృత్తు లం
దలము సితాతపత్త్రము ల
తర్క్య విభూషణ తేపరాంబరం
బులుఁ దగు వృత్తులం బడసి
భూసురవర్గముఁ బ్రోచి దేవతా
నిలయము లొప్పఁ బెక్కొనర
నిల్పుచుఁ బూజలుఁ బ్రీతిఁ జల్పుచున్"

—అని చెప్పికొనుటవలన నందలము, శ్వేతాతపత్త్రము,—లోనగు గౌరవార్హ చిహ్నంబులతో నొప్పు సగ్గలియోగ వృత్తుల వయి స్వాధికారముం గల యమాత్యపదవి నందఁజేసి భద్రపీఠంబునఁ బ్రతాపరుద్రుఁడు కూర్చుండఁ బెట్టినట్లు లగపడు చున్నది.

ఇమ్మహామాత్య పదవి కాకతి బేతభూపాలు క్రమాగత తదీయ రాజ్యభర నిరూపిత మహామాత్యపదవీ విరాజమానోన్నత ప్రభుమంత్రోత్సాహ శక్తిత్రయ సంపన్నుఁడు, మహోత్తరయశోవిరాజితుఁడు, అగణిత శౌర్యసంపద్విభవుఁడు,-నయి బేతిరాజ కరుణాకటాక్షవీక్షణమున 'సబ్బిసాయిర' మండలమును సర్వజనరంజకముగాఁ బరిపాలింపఁజేసినది వైజనాథ మంత్రిపురందరునిచే నని (Ep. Ind; Vol. 9; P. 256) తెలుపు చున్నది. ఈ వైజననాథ మంత్రికి యాకమాంబిక యందు జనించిన బేతనప్రెగడ రెండవ ప్రోలరాజునొద్ద మంత్రిగా నుండెనఁట! ఈ బేతనప్రెగడయు నితని ధర్మపత్నియు జినధర్మావలంబులఁట! ఈ రెండవ ప్రోలరాజు పరిపాలనా కాలము క్రీ. శ. ౧౧౦౮ మొదలు క్రీ. శ. ౧౧౫౮ దవ సంవత్సరమువఱకు ననఁగా నేఁబదిసంవత్సరము లని చరిత్రకారుల యభిప్రాయము.

'ఓరుగల్లు' పురనిర్మాణ మీ ప్రోలరాజుచే నారంభింపఁబడిన దని వినుకలి. తాను గెలుపొందిన దేశప్రజలు కాఁపురంబుండుట కయి ప్రోలరాజ నగరమును గట్టించెనఁట! ఒక సమయమున నీ యోరుగంటి ప్రజలకు విక్రయించుటకై యాహార పదార్థములఁ దెచ్చిన బండి యొక్క ఱాతికిందగిలి తల్లక్రిందులుఁ

గాఁగా, ఆ బండి యినుపపట్టా బంగారుమయమయ్యెనఁట!
ప్రోలరాజున కీ వృత్తాంతముదెలిసి వచ్చి యా ఱాయి స్పర్శ
వేది యగు నొక 'శివలింగ' మని గ్రహియించి స్వయంభూమిగ
దాని నచ్చటనే ప్రతిష్ఠించి,యాలయమొకండు వినిర్మించి, యా
నగరమును గ్రమక్రమము గా నభివృద్ధిఁగావించె నని యందురు.
ఇతని తరువాతి ప్రభువు లా ప్రదేశమున బలవత్తము మైన, శత్రు
దుర్నిరీక్ష్య మైన వప్రమును నిర్మించిరి.

గంగాధరమంత్రి కీ యమాత్యపదవి వచ్చిన తర్వాత
న య్యనుమకొండ పురమ్మును (Anumakonda) నగరముగా
(city)ఁ గావించె నని విదితమగు చున్నది. ఏ దెసఁ దిలకించినను
దేవప్రతిష్ఠలు, వానిముందుఁ గోనేరులు, అచ్చటచ్చటఁ జెఱు
వులు, ఆరామములు,— వేయునేల?

"తన పెంచిన సన్మానముఁ
దన సంతానమ్ముఁ గృతియుఁ దన నల్లిల్లు
న్వనమును జెఱువును గుడియుం
జనవినుతము లైన సప్త సంతానంబుల్."

అనినట్లు సప్తసంతాన ప్రతిష్ఠలనొనర్చి, జనవంద్యుఁడై,
సామ్రాజ్యమందంతను దన యశోలతలఁ బ్రాకించినాఁడు.
అంతతోఁ దనియక ప్రభుని యనుగ్రహముఁబడసి విద్వజ్జనం
బులఁ బెక్కుర రావించి, వారలచేఁ గ్రతువులఁజేయించి,
య ప్పండితశౌండులకు "డొండొండు" అను నగ్రహారము ఒక
దాని నొసంగి పౌరసత్వ (citizen—ship) ననుగ్రహించి
నాఁడు.

"పురుషనిధి పురుషరత్నము
పురుషోత్తమమూర్తి యనుచుఁ బొగడఁగ జను లు
త్కరుషమతి వెలయఁగాం గ్రైస్తె
పురుషులఁ జేసితిఁ బ్రతిష్ఠ పూజార్హముగాన."

—అని చెప్పికొనియుండుట వలనఁ ద్రిమూర్తుల ప్రతిష్ఠను నయ్యగ్రహారము (దొందడొంకు అగ్రహారము) నఁ గావించెనని స్పష్టమగు చున్నది. సాత్త్వికభావము లేకుండ

"పరమేశుఁడు హరి బుద్ధ
స్వరూపుఁడై యుద్భవరుల నచించు నన్నో
హరి యనెడు పట్టశాలం
జిరముగ బుద్ధప్రతిష్ఠఁ జేసితి భక్తిన్"

—అనునట్టు 'బుద్ధాలయ' మొకండు నిర్మించుకొనియెను. ప్రోలభూనాథుని పరిపాలనాకాలమున నీ మహామాత్యుండు సప్తసప్తాంగములఁ బొందిన ప్రభుమంత్రోత్సాహ శక్తిమంతుండగు కాకతీయాంధ్ర మహాసామ్రాజ్యము చిరస్థాయి నందుటకుఁ గారణభూతుండయ్యెను. ఇతఁడు చేసిన దానధర్మములు 'నగునూరు' నందగపడు చున్నవి. సామ్రాజ్యాభ్యుదయ పరంపరాభివృద్ధికి నీతఁడొనర్చిన యేర్పాటుల గమనించినచో నానాఁడొక దివ్యతేజస్సు నొడఁగూర్చె నని తెలియకపోదు.

ప్రోలరాజు ననంతర మాతని కుమారుఁడు రుద్రదేవుఁడు తన తండ్రికాలమున నణఁగి మణఁగియున్న శత్రుతండంబును బీఁచమడంచి 'యనుమకొండ' (anumakonda) రాజధానిగాఁ జేసికొని యుండుట యనుచితమని యెంచి యోరు

గంటికిఁ దన రాజధానిం దరలించికొని నట్లు 'శివయోగసార' మందలి

"అనుమకొండపురంబుఁ గా దని
యా విభుం డిల నోరుఁగ
ల్లను పురంబు ఘటించి యచ్చటి
కచ్చుగా నరుదెంచి య
మ్మనుజనాథుఁడు నాయకత్వము
మల్లమంత్రికిఁ బిన్న మ
ల్లనకు ధారుణి పెద్ద సంప్రతి
నాతతంబుఁగ నిచ్చెనకా."

అను పద్యము రూఢిపఱచు చున్నది. కాఁబట్టి ప్రోల రాజునొద్ద నితఁడు మంత్రిగా నున్నయపుడు రాజధాని 'యనుమకొండ' యనియు, రుద్రదేవునొద్ద సచివోత్తముఁడుగా నున్నయపుడు రాజధాని "యోరుగ"ల్లనియు, విదితమగు చున్నది గదా!

శా. శ. ౧౦౯౨ నకు సరియగు క్రీ. శ. ౧౧౭౦ దవ సంవత్సరమునాఁటి దగు 'నగునూరు' శాసనమునఁ గాకతీయ రుద్రుఁడు

"శ్రీకాంతాకాంతుచే నాశ్రిత విబుధ జనాభి స్థిరప్రాజ్యరాజ్య,
శ్రీకాంతాకాంతుచే విస్తృత నిజభుజ నిస్త్రింశ నీతాన్యరాజ,
శ్రీకాంతాకాంతుచే దిక్పతి గగన సమాశ్లిష్ట విస్పష్ట కీర్తి,
శ్రీకాంతాకాంతుచే నూర్జిత రిపు మృగరాజీ మృగారాతిచేతన్"

"పర నరపాల మౌళిమణి
భాస్వర దీప్తి లతా నితాన్త వి
స్ఫురిత పదాబ్జుచే సహిత
భూతలనాథ వరూధినీ సరో
వర మధన ప్రభూత మద
వ ద్విరదాధిపుచే విరోధి భూ
ధర శిఖర ప్రభిన్న విది
త త్రిదశేంద్ర నిశాతహేతిచేన్"

"సుర కరిపతి మృగపతి హరి
సురసతి ధవల సరసిరుహ శక్తిరుహ సదృక్
సురుచిర విశద యశో భా
సుర నిధిచే సుకవి తరణి సురనిధి చేతన్"

అని యభివర్ణింపఁ బడియెను. ఈ శాసనమును దిక్క-కవిబ్రహ్మ రచించినాఁడు. నిరర్గళ కవితాధారకు వరవడి బంతిగా నీ శాసనపద్యము లున్నవనుట కే సందియము లేదు.

మింపులఁ బ్రతాపశాలియు, దానియు, నల్దిక్కుల విజయకంబముల నాటిన దిట్టయుఁ, దెలుఁగు కబ్బములఁ జెక్కించి టినిఁ గృతినందినవాఁడును, సప్తసంతానములఁ బడసిన ధన్యుడును,— నగు గంగాధర మంత్రి తాఁజేసిన కృత్యముల దెలుపు శాసన మొకటి చెక్కించి యాంధ్రజాతికి నెంతయేని మహోపకార మొనర్చి నాఁ డనుట విస్మరింప రానిది.

రుద్రదేవుని క్రీ. శ. ౧౧౬౨ వ. సంవత్సరము నాఁటి 'యనుమకొండ' వేయి స్తంభముల గుడిశాసనము నందలి

"రాజ్యం ప్రాచ్యాం లవణ జలధే
స్తీర పర్యన్త మస్య,
శ్రీ శైలాన్తాం ప్రచరతి సదా
దక్షిణాశాం సమగ్రాం,
ప్రతీచ్యాన్తా కటక నికట
స్థాయినీ రాజ్యలక్ష్మీః,
కౌబేర్యాశా తట విలసితే
మాల్యవన్తం ప్రదేశే॥"

—అని యానాఁటి కాకతీయ రాజ్య సరిహద్దులు వివరింప బడి యున్నవి. అనఁగాఁ దూర్పున బంగాళాఖాతము, దక్షిణ మున శ్రీ శైలము, పడమరను కటకము (కళ్యాణి), ఉత్తర మున మాల్యవంతము — ఈ సరిహద్దులలోఁ గల దేశమం తయు రుద్రదేవుని రాజ్యమే యని యర్థము.

ఈ విశాల సామ్రాజ్యభారమును భుజస్కంధముల వైచికొని నిర్వక్ర పరాక్రమముతో నేలుచుండఁగా, న య్యో ల్బణకి సర్వవిధముల మెఱుఁగుఁ బెట్టినవాఁడు గంగాధరమంత్రి ఇతఁడు ధర్మచిత్తుఁడు; మహాభక్తుఁడు. హిడంబాశ్రమము, నగనూరు, అనుమకొండ,— లోనగు ప్రదేశములఁ బెక్కు దేవాలయములను, బుష్పవాటికలను,— నిర్మించెను.

రుద్రదేవుఁడు సకలశాస్త్రపారఁగుఁడైన రామేశ్వర దీక్షితు నొద్ద విద్యల నన్నింటిని నేర్చి, రాజనీతి వేతృత్వము నలవఱిచికొని, కవిత్వముఁ జెప్ప శక్తి గడించి,— విఖ్యాతి

నందెను. కావుననే కాంబోలు ప్రమాదూత సంవత్సర కార్తీక బ ౧౫ ఆదిత్యవారము నాఁటి దాన శాసనమున 'విన్నకొండ' సీమలోని 'శివపురము' అను గ్రామమును మొట్టమొదట రామేశ్వర పండితునకు దానమిచ్చినవాఁడు రెండవ బేతరాజనియు, దానకాలమునకుఁ బిమ్మట దాదాపు ఎన్మిదేండ్ల తర్వాతి 'ఖాజీపేట' శాసన స్తంభమును వేయించి రనియు,— (E. I., Vol. V. VI. P... ...) దెలియు చున్నది. కాఁబట్టి యీ రుద్రదేవుఁడు గంగాధర మంత్రిశేఖరుని దోర్దండ ప్రతాపాతిశయం బతిశయంబుగాఁ గొని, రాజ్యేందిరను వరించి, ప్రతిపక్ష బృందమును బీఁచ మడంచి, లలితకళలకుఁ జేయూఁత నిచ్చి, సోమనాథ కవి లోనగు కవితల్లజులచేఁ గవిత్వమున కుత్సాహ ప్రోత్సాహములు గావింపఁబడి, యచిరకాలమున శారదా విలాసమున కాలవాల మయ్యెను.

మాధవవర్మ మొదలగు రాజచంద్రు లెందఱో 'అనుమకొండ'ను రాజధానిగాఁ జేసికొని యేల్బడి సాఁగించినను బ్రోలరా జంతటి స్వాతంత్ర్య పిపాసి, స్వేచ్ఛా వాయువులఁ బీల్చిన మొనగాఁడు,— మున్నెన్నఁడుఁ లభించలేదు.

చాళుక్య సామ్రాజ్యము సన్నఁగిలఁగనే యాంధ్ర సామ్రాజ్యము నెలకొలిపి, యాంధ్రవ్యక్తిత్వము (individuality) నిలువంబెట్టిన మహోపకారి యని పేరందెను. తత్ప్రాపి జాతియందు నివురుఁగప్పిన నిప్పువలె డాఁగియున్న రాజనీతి, సమయజ్ఞత, ధైర్య, స్థైర్య, గాంభీ, ర్యౌదార్య, శౌర్యములు,

తత్తదుపజ్ఞ,— ఇవి యెల్ల సామ్రాజ్యమును ప్రతిష్ఠించుట యందును, సుస్థిరత వహించుట యందును,— అ[illegible]చెను.

దీని కంతకును బుద్ధిమదగ్రగణ్యుఁ డగు గంగాధర మంత్రి తోడ్పాటు, ఉపజ్ఞ,— లేకుండినచో నెటులఁ బరిణమించునో యెవరి కెఱుక!

---

## రెండవ ప్రతాపరుద్రుని కడ

## "విద్యాంగమంత్రి"

# అగస్త్య మహాకవి

(క్రీ. శ. ౧౪ వ శతాబ్దము.)

---

ఆంధ్రదేశేతిహాసమునఁ గాకతీయుల కాల మత్యంత గణనీయ మైనది. సర్వ విజ్ఞాన తేజ స్సమన్వితమైన కాకతీయాస్థానమునఁ బ్రసిద్ధిఁ జెందినవాఁడు విద్యానాథుఁడు. అగస్త్య కవియె విద్యానాథుఁడు. ఇతఁ డుపనీతుఁ డైనది మొదలు బ్రహ్మచర్య మవలంబించి, వేదము నభ్యసించి, యుపనీతుఁ డైన కొలఁదికాలముననే తటస్థించిన దాయాదుల వివాదలో భూములు, ద్రవ్యముఁ, గోల్పోయి, సక్రమ గురుకులవాస మొనర్చి, శాస్త్రములఁ బఠించినాఁడు. ఇట్టి స్థితిలో వివాహ మగుటయుఁ, గొమార్తె కలుగుటయు, నామె వివాహ వయస్క యగుచుండుటయు,—సంభవించి తన కొమార్తకు వివాహము డగ్గఱించు చుండుటను గనిపట్టి, చేతఁగాసైనను లేకుండుటను గమనించి, 'నీచాశ్రయో నకర్తవ్యః, కర్తవ్యో మహదాశ్రయః'—అను సూక్తిని సంస్మరించుచుఁ, గాకతీయాంధ్ర చక్రవర్తియగు ప్రతాపరుద్రుఁడే తగినవాఁ డని నిర్ధారించికొని యతని యాస్థానమున కేఁగి, "ప్రతాపరుద్ర యశోభూషణ"

మను గ్రంథమును విరచించి, జగన్నుతి నందిన యగస్త్య మహాకవి 'కొండివీటి' కాఁపురస్థుఁడు. ఇతని కవిత లాలిత్యము గలది యగుటచే నీతని 'బాలభారత' కావ్యమునకు సాళువ తిమ్మ సచివాగ్రణి వ్యాఖ్య రచించినాఁడు.

"అస్త్యత్రినేత్ర ప్రభవః కలాత్మా,
శశీతి నక్షత్ర గణస్య నాథః;
యం వారిజ శ్రీహరమాత్తవాచో,
వామం హరే ర్లోచన మామనన్తి. (౧ శ్లో.)

"సాలజ్జితైక వననాశన కైరవాదీ,
న్నాహం జితాస్మి కితవై ర్న తు మే స్తి దాస్యమ్,
య త్పూర్వ మేవ విజితః పరతంత్ర వృత్తిః,
క్షోణీపతిస్తు పణకర్మణి మామకార్షీత్." (౭ వ సర్గము)

—ఈ కావ్యరచనమున నితఁడు నన్నియభట్టారక మహోపాధ్యాయు నాంధ్రభారతము నక్కడక్కడ ననుసరించి నట్టు లగపడుచున్నది.

"ఆయాంత మేన మవలోక్య భయాకులాక్షీ
దుద్రావ వల్గిత కుచం ద్రుపదస్య పుత్రీ
తాం రాజసూయ సవనావభృథాప్లుతేషు
కేశేషు సోఽపితర సానుపత న్నగృహ్ణాత్."—

(౭ వ సర్గము)

—ఇందలి 'ఆయాంత మేన మవలోక్య భయాకులాక్షీ"—అను పదమునకును నన్నియ భట్టారకుని 'భారత' మందలి

"ఆవనజాననం గుణకులాపదేశుండు గడంగి రాజసూ
యావభృథంబు నందు వసుధాసుర మాత్ర పవిత్ర వారి ధా
రావళిఁ జేసి పావనము లైన శిరోజముల గ్రహించి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు విస్మయ మంది
చూడఁగన్."

—అను పద్యమునకును,—గల పోల్కిని గమనింతురు గాక!

బాలభారత మిఱువది సర్గములు గలది. పాండవుల స్వర్గారోహణముతో నిర్వదవ సర్గము ముగిసినది. ఇతని 'ప్రతాపరుద్ర యశోభూషణము' నను అలంకార శాస్త్ర గ్రంథమున నాయక, కావ్య, నాటక, రస, దోష, గుణ, శబ్దాలంకా, రార్థాలంకార, మిశ్రాలంకార, నామములు గల తొమ్మిది ప్రకరణములతో నున్నది. నాటక ప్రకరణమున నాటకోదాహరణముగాఁ బ్రతాపరుద్ర ప్రశస్తియే యుగ్గడింపఁబడినది. అలంకార గ్రంథముల యం దిది యుత్తమ మైన దిగాఁ బ్రసిద్ధిఁ గాంచినది. ఇతని యీ గ్రంథము వెలువడిన తర్వాత భామహుఁడు, దండి,—లోనగు వారి గ్రంథములకుఁ బ్రాచుర్యము కొఱవడినది. ఇతఁ డీ గ్రంథమున నలంకారాదులకు లక్ష్యముల స్వయముగ రచించి యగపఱచెనే గాని యితర గ్రంథముల నుండి గైకొన లేదు. ప్రతాపరుద్రీయ మలంకార శాస్త్ర మయ్యును రసబంధుర మైన కవితా వస్తువు గలది. నృత్యా నృత్తముల నెడ నెడ సమానార్థకము లయిన

పర్యాయపదములుగనే వాడినను నాటక ప్రకరణారంభమున దశరూపకమం బట్టి వానిని స్వేర్వేఱుగా నిర్వచించి యుండెను.

"నాట్యం రసాశ్రయం
భావాశ్రయం తు నృత్యం
స్యాన్నృత్తం తాల లయాన్వితః"

మ్మని రసాశ్రయమైనది నాట్యమనియు, భావాశ్రయమైనది నృత్యమనియుఁ, దాల లయాన్వితమైనది నృత్తమనియు,— వ్రాసిచ్చి యుండెను. దీనికిఁ గుమారస్వామి రసవిషయమును సాత్త్వికబహుళమునైనది నాట్యమనియు, భావ విషయము ఆంగిక బహుళమును మార్గాపర పర్యాయమును నైనది నృత్యమనియుఁ,— దాల లయాన్వితమును దేశ్యపర పర్యాయమును స్వకల్పిత విరహితమును నైనది నృత్తమనియుఁ,—

"అన్యద్భావాశ్రయం నృత్యం
నృత్తం తాల లయాశ్రయం,
ఆద్యం పదార్థాభినయో
మార్గో దేశీ తథాపరమ్"

—అని 'రత్నాపణము'న వ్యాఖ్యాన మొనర్చెను. ఇవ్విషయము నితఁడు ధనంజయు నతి సన్నిహితముగా ననుసరించి యుంటచే మార్గదేశీ పదముల విషయమున నీతఁ డిచ్చిన భిన్న వివరణ మేమియు లేదు. కాఁగా, నుదాత్తమైన నాట్యపద్ధతి దేశి యని యితఁ డభిప్రాయపడి యుండె నని చెప్ప నగును. మార్గదేశీ పదములు నాట్యమునను సంగీతమునను

వాడఁబడిన సందర్భములను బట్టి యేకరూప మై సంస్కృతైక వేద్య మై యథార్థ మైన పద్ధతి మార్గ మనియు, వివిధ దేశము లలో వివిధ గతుల నుండి సుకర మగుటచే సర్వజన వేద్య మైన పద్ధతి దేశి యనియుఁ, – దెలియు చున్నది.

ఇంతియ కాక ఈ గ్రంథమున నాంధ్ర సామ్రాజ్య వైభవమును

"లోకాలోక గిరీంద్ర కందర తమ స్సందోహ దర్పాపహం,
త్వత్తేజః పటలం కియ న్తి భువనా న్యాక్రమ్య సంక్రీడతే,
ఇత్యాలోకన కౌతుకీవ శిథిల స్వీయాధికార క్రమో,
భాస్వా నేష సమగ్రదీప్తి రధునా వ్యోమాగ్ర మారోహతి"

"యై ర్దేశస్త్రిభి రేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలిఙ్గాఖ్యయా,
యేషాం కాకతిరాజకీర్తి విభవైః కైలాసశైలాః కృతాః,
తే దేవాః ప్రసర త్ప్రసాద మధురా శ్శ్రీశైల కాళేశ్వర,
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు"

—అని విస్పష్ట మొనర్చి యున్నాఁడు. గ్రంథాది యందలి 'విద్యా కైరవ కౌముదీం' – అను చోట 'విద్యా' శబ్ద మీతని శ్రీ చక్రోపాసకతను సూచించు చున్నది. 'కాకతి' యనునది 'దుర్గా' నామ మనియుఁ, గాకతీయులు శాక్తేయు లనియుఁ,– ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత విదిత మొనర్చు చున్నాఁడు. ఆంధ్ర దేశ మందలి భూతవైద్య మంత్ర ప్రక్రియలలోఁ బ్రతాప రుద్రుని మోరుగంటి పేళ్ళు విశ్రుత మగు చున్నవి. మంత్ర శాస్త్ర పరిసక్తిని,—

"ఏషా కాకతి వీరరుద్ర ఇతి కిం వా శ్రావి సప్తాక్షరీ,
ప్రక్షుభ్యత్ప్రతిపక్ష పార్థివ మహాభూత గ్రహోచ్చాటనీ"

—అని యగస్త్య మహాకవి తెచ్చినాఁడు. నీన నితఁడు మంత్రశాస్త్ర ప్రవీణుఁ డనియు, లోకోత్తర గుణోత్తరుఁ డైన మహాపురుషుని వర్ణనము వలనఁ గృతికి నుత్కర్ష కలుగు ననియు, నట్టి కృతులు లోకవృద్ధిదములు క్షేమంకరములు ననియుఁ, - దన రచనా మార్గము నగస్త్యమహాకవి సమర్థించి కొని నాఁడు.

ఢిల్లీఫాదుషా జీవగ్రాహముగాఁ బ్రతాపరుద్రునిఁ బట్టి కొని పోఁగా, మోచితుఁడై మూఁడేఁడులకు మగుడ నిజరాజ ధానికి న్వచ్చి విరక్తిచే రాజ్యమును దన సోదరుఁ డయిన యన్నమదేవున కొప్పగించెను విద్యానాథుని కుటుంబభార నిర్వాహణక్లేశమును గావ్యాలంకార సంగ్రహమును, - మదిం దలఁచి ప్రతాపరుద్రుఁ డగస్త్య మహాకవికిఁ దన ముద్రాంగు ళీయ మీయఁగా నతఁ డభీష్టద్రవ్యమును బడసినాఁడు. అన్నమ దేవుఁడు నెలకొల్పిన విద్యాశాఖల కధిపతి యై రాజదత్త ధనాదికముతోఁ జరమ దశ నంతను గడపినట్లు లవగత మగు చున్నది.

ఇతఁడు 'ప్రతాపరుద్ర యశోభూషణము' నను నలం కార శాస్త్రకావ్య ప్రకరణము, ౭౧ వ శ్లోకమున,

"ఔన్నత్యం యది వర్ణ్యతే శిఖరిణః
కృధ్యంతి నీచైః కృతాః,

గాంభీర్యం యది కీర్త్యతే జలధయః
క్షుభ్యంతి గాధీకృతాః,
ఔన్నత్యం వర్ణయితుం విభేమి యది సా
జాతోఽద్య స్మర్త్యగ స్తన స్థితిః,
త్వత్తారేశ్వర గుణరత్న రోహణగిరే
శ్రీ వీరరుద్ర ప్రభో" —

— అని చెప్పికొనుట వలనఁ బ్రతాపరుద్రుని యౌన్నత్యము పర్వతముల నధిగమించిన దనియు, నాతని గాంభీర్యము సముద్రముల కంటె లోఁతైన దనియు, నగస్త్యుఁడ నైన తా నాతని యొద్దనే యుండితి ననియు, – తాత్పర్య మగు చున్నది.

విద్యానాథుఁ డను ప్రశస్తి ప్రతాపరుద్రుని కడ 'విద్యాంగ మంత్రి' (Minister for Education) యగుట చేతనే కలిగెను. ఇతనిం బలె శ్రీనాథ మహాకవియుఁ గ్రీస్తు శకము ౧౪౦౦–౨౦ సంవత్సర ప్రాంతములఁ గొండవీటి సామ్రాజ్యాధినేత యగు కోమటి వేమారెడ్డి కడ విద్యాంగ మంత్రిగా (Minister for Education) దేజరిల్లి నట్టు లనేక నిదర్శనములు గలవు.

అగస్త్య మహాకవి డెబ్బది నాల్గు గ్రంథముల రచించి నట్టు వీరకంపరాయల భార్య గంగాదేవి రచించిన,

"చతుస్సప్తతి కావ్యోక్తి
వ్యక్త వైదుష్య సంపదే
అగస్త్యాయ జగత్యస్మిన్
స్పృహయేతో న కోవిదః"

—అను 'మధురా విజయము' (౧ సర్గము, ౧౭ వ శ్లోకము) వలనఁ దెలియ నగు చున్నది. ఈ గంగాంబ క్రీ.శ. ౧౩౬౭ వ సంవత్సర ప్రాంతమునఁ గాంచీపురము (Conjeevaram) నేలిన 'కంపరాయలు'కుఁ బట్టపుదేవి. ఈమె తన కావ్యమున

"చిరం స విజయీ భూయాత్
విశ్వనాథ కవీశ్వరః,
యస్య ప్రసాదా త్సార్వజ్ఞం
సమిన్ధే మాదృశే ష్వపి"

(మధురా విజయమ్, ప్రథమ స్సర్గే, శ్లో. ౧౬) అని చెప్పుటను బట్టి యగస్త్యకవి మేనయల్లుఁడును, 'సౌగంధికాపహరణ' రచయితయు, రెండవ ప్రతాపరుద్రు నాశ్రితుఁడును, — అగు విశ్వనాథ మహాకవికి శిష్యురా లని యవగత మగు చున్నది.

ఇతఁడు తన 'సౌగంధికాపహరణ' నాటకమున,

"వాచ స్తస్య కవే రుదార మధురా
ఇత్యాత్త చిత్రం కిము
ప్రఖ్యాత స్సకలాసు దిక్షు గుణేషు
శ్రీమా నగస్త్య స్సుధీః
వేద శ్చంద్రముఖీ కరాబ్జాళీ దళా
సజ్జ క్వణ ద్వల్లకీ
వాచో యుక్తి సహోక్తి దర్శిత సుధా
జన్మాఽఽస యన్మాతులః"

—అని తెలుపుట వలన నగస్త్యకవికి మేనల్లుఁ డని విదితము కాఁగలదు. ఇతఁ డసామాన్యుఁడు. అగస్త్యకవి కాలమునఁ

ప్రాప్తవయఃపరిపాకమున నున్న విశ్వనాథకవి యోరుగంటి సామ్రాజ్యము మహమ్మదీయాధీన మైన తర్వాతఁ 'గంచి'కిఁ జని యట నేలికఁగా నున్న కంపరాయల నాశ్రయించి పండితుఁడై తత్రాపి పట్టమహిషి యగు గంగాంబను గురు వయి నట్టు లగపడు చున్నది. 'సౌగంధికాపహరణ' నాటక ప్రస్తావన యందలి,

> "సూత్రధారిణః — అద్యఖలు నిఖిల రాజలోక మౌళి మాణిక్య మంజరీ పుంజ కింజల్కిత చరణారవిందేన రాజ్ఞా ప్రతాపరుద్రేణ సంభావితై రశేషవిద్యా విశేష సార సార్వజ్ఞ ధౌరేయ మతిభిః సభా సద్భిరా హూయ సబహుమాన మాదిష్టోఽస్మి."—

అను వచనమును బట్టి విశ్వనాథకవి ప్రతాపరుద్రుని యొద్ద నున్నాఁ డనుట సునిశ్చిత మగు చున్నది. ఇతని తమ్ముఁడు నరసింహ కవి యనియుఁ, దండ్రి గంగాధర కవి యనియుఁ, బితామహుఁడు సిద్ధనాథుం డనియు, వీరి వంశము పండిత వంశ మనియుఁ, 'గాదంబరీ నాటక' మందలి

> "జానాత్యే వహి యద్భవాన్ కవికులం
> సద్భైర్య దభ్యర్హితం,
> నిత్యం సన్ని దదాతి సా భగవతీ
> యస్మిన్ గిరాం దేవతా,
> తత్రాసీత్ కిల సిద్ధనాథ తనయో
> గంగాధరః పండితో

బాహు శ్రుత్య విశేష విశ్రుత యశా
స్సాహిత్య సాహిత్య భూః"

"తస్యైవ మధ్యమః పుత్రో నరసింహ ఇతీరితః,
విశ్రుత స్సతు కర్తాస్య కృతే రిత్యవధారయ"

పారిపార్శ్వకః— భావసానేఖలు,

"అయం దశే సురూపకే ష్వపి
నిరూఢిమా ఢౌకితుం
పరం ప్రభవతీతి నో మనసి
మైవ భూ దద్భుతమ్
సుధారస తరంగిణీ సురభి
సూక్తి రస్యాగ్రిణీః
క్షితౌ సహృదయాగ్రణీ
ర్జయతి విశ్వనాథః కవిః."

అను శ్లోకముల వలనఁ దెలియుచున్నది. నరసింహకవి 'కాదంబరీ నాటకము'ను విరచించెను. పెదకోమటి వేమన తన 'సాహిత్య చిన్తామణి' యందీ కాదంబరీ నాటకము లోని శ్లోకములఁ బెక్కింటిని నుదాహరించెను. వీరి తండ్రి గంగాధర కవి 'భారత కథ'ను నాటకరూపమున విరచించి విఖ్యాతిఁ జెందెను. గంగాధర కవి తండ్రి సిద్ధనాథుఁ డను వాఁడు గంగాంబకు గురువు.

అగస్త్య కవి 'విద్యానాథ' బిరుదాభిరాముఁడు. ఇతఁడు తన "నలకీర్తి కౌముది"లో 'ఇది శ్రీ నలకీర్తి కౌముద్యాఖ్యే

లక్ష్మీపద లాంఛనే అగస్త్య కృతౌ మహాకావ్యే ద్వితీయ స్సర్గః"

అని ద్వితీయ చతుర్థ సర్గల యంత్య గద్యలో నుట్టంకించి యున్నాఁడు. శ్రీహర్షుఁడు, మాఘుఁడు, భారవి లోనగు వారు గూడఁ దమ గ్రంథములలో వేర్వేఱు లాంఛనములఁ జేర్చిరి. ఇతని కవితాలహరి యమృత లహరి వంటిది. అనేక తావులఁ గాళిదాసాదుల నెట్టు లనుకరించెనో

"అవా కిరన్ వయో వృద్ధా
స్తం లాజైః పౌరయోషితః,
పృషతై ర్మందరో ద్ధూతైః
క్షీరోర్మయ ఇవా చ్యుతం"

—(రఘు వంశే చతుర్థ సర్గే)

"పౌరాః పురంధ్ర్యోఽథ నలం సలాజై
రవా కిరన్ హర్మ్య గతాః ప్రసూనైః
బిందూత్కరై ర్విష్ణు మివా ర్మయోఽద్రి
మంథాన సంక్షోభిత దుగ్ధ సింధోః"

—(నలకీర్తి కౌముది, ౪ సర్గ)

అను నిత్యాదులఁ బరికించినఁ దెలియఁ గలదు. ఇట్టివి యనేకములు.

కాళిదాస మహాకవి శివుని పెండ్లికి అజమహారాజు వెడలు సమయమునఁ బురసుందరీ మణుల చేష్టితముల హృదయంగమముగ నభివర్ణించి నాఁడు. 'పద్మ చూడామణీ, మహా

కావ్యమున దీని నళ్యఘోషుఁడు చక్కఁగా వర్ణించి యున్నాఁడు.

అగస్త్య మహాకవి కాళిదాస మహాకవి ననుకరించి రమణీయముగ వన్నెచిన్నెలు గుల్కునట్లుఁగా నలుఁడు దమయంతితో స్వనగరమునఁ బ్రవేశించు పట్లు నభివర్ణించి నిర్దుష్టముగాఁ గలిదోష వినాశకం బగు న౦చరిత్రను 'నలకీర్తి కౌముది' అను నుత్తమ కావ్యముగా రచించె నని తోఁచెడిని, 'నలకీర్తి కౌముది' యందలి

"భృంగానవాప్తి ప్రతిపన్న ఖేదా
కృత్వా వనే గంధఫలీ తపోఽలమ్
తన్నాసికాఽభూ దనుభూత గంధా
స్స పార్శ్వనేతీ కృతభంగ సేవ్యా"

—అను (ద్వితీయ సర్గ, సప్తశ్లోకమ్) దానిం బట్టియె. దెలుఁగునఁ గల

"నానా సూన వితాన వాసనల నా
నందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బ
ల్కానం దపం బంది యో
షా నాసాకృతిఁ బూని సర్వ సుమన
స్సౌరభ్య సంవాసి యై
పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ
పుంజంబు లిర్వంకలన్."

అను పద్య మేర్పడినదని తెలియనగుచున్నది. ఇది దమయంతి నాసికా వర్ణనము. దీనిం జూచియే గిరికా నాసిక అభివర్ణితమైనది. అగస్త్యకవి 'బాలభారతము' నకు శ్రీకృష్ణ దేవరాయల శిరఃప్రధాని 'తిమ్మ సచివేంద్రుఁడు' "మనోహర" వ్యాఖ్యను విరచించి యశఃకాంతను జేబట్టెను. ఇమ్మహా మాత్యుని వ్యాఖ్యాన గద్యలో 'ఇతి శ్రీ మద్రాజరాజేశ్వర కర్ణాటేశ్వర శ్రీకృష్ణరాయ శిరఃప్రధాన సకలాగమ పారావార పారీణ సాళ్వ తిమ్మయ్య దండనాథ విరచితాయాం బాలభారత వ్యాఖ్యాయాం మనోహరాఖ్యాయాం—సర్గ ౧ అని యుండుటవలన నితని (అగస్త్యకవి) గ్రంథ ప్రాశస్త్య మెఱుకపడుచున్నది, (దీని వ్రాఁతప్రతి చెన్నపురి ప్రాచ్య లిఖిత గ్రంథాలయమునఁ గలదు.)

ఇఁక శ్రీకృష్ణచరితము (గద్యకావ్యము), లక్ష్మీస్తోత్రము, శివస్తవము, శివ సంహిత, సకలాధికారము, మణి పరీక్ష, అగస్త్య నిఘంటువు,—అను గ్రంథము లగస్త్య మహాకవి విరచితములే యని తెలియు చున్నది. భవతు.

అగస్త్యకవికి విశ్వనాథకవి, నరసింహకవి,—మేన యల్లుండ్రు. వీరందఱును 'గొండవీటి' నగర వాస్తవ్యులు. 'పెసరవాయి' నియోగి బ్రాహ్మణులు. అగస్త్యకవి ప్రతిభను రాజచూడామణి దీక్షితుఁడు.

"జడాశయానాం హృదయం జగత్యాం
యస్యోదయా ద్యాతి తమాం ప్రసాదం,

స ఏవ సారస్వత మర్మవేదీ
విభాతి మాళౌ విదుషా మగస్త్యః"—

అని వినుతించెను. ఇ య్యగస్త్య మహాకవి నమకాలికుఁడే వారణాసి ధర్మసూరి. క్రీ. శ. ౧౪౧౪—౧౪౩౦ నడుమ ధర్మసూరి యుండనోపు నని యభిజ్ఞుల యభిప్రాయము. ధర్మసూరి 'వెల్లటూరు' వాస్తవ్యుఁడు. ఈయన పెదతండ్రి నారాయణ సూరి పదక్రమ జటలు, ఆరోహణావరోహణలు, అక్రమ విషమ క్రమములు, — మొదలగు విధానముల వేదావధానమున నిరంకుశ విహారమొనర్చి 'వేదావధానచక్రవర్తి' బిరుదము నేగాక 'బ్రహ్మరథ' మను నుత్కృష్ట గౌరవము నందెను. వేదచర్చా గోష్ఠి యందు నారాయణ సూరి రామావధాని యను వానిం బండిత మండలీ సమక్షమున నోడించి తన యవధాన కౌశలమును బండిత పరిషత్తు శ్లాఘించుచుండ ధర్మభూపాలుఁడను ప్రభువు వల్ల "అవధానీశ్వర శరభఘుటా గండభేరుండ" బిరుదమునే కాక ఛత్ర చామర శిబికాది సమ్మానముల నందె నని "సాహిత్య రత్నాకర" మందలి

"౧. పృధ్వీః పదక్రమ జటాక్షర
క్రమ పదక్రమారోహణా
వరోహ విషమ క్రమా
క్రమ ముఖావధానా ధ్వని,
పరిక్రమణ చక్ర వ
ర్త్యభిధయాప్త దిగ్గాఢ యా

చ చార బహుశః క్షితౌ
ద్విజ రథేన నారాయణః." (౧;౨౦-౨౧)

"౨. స్రగ్ధర: జిత్వా రామావధాని ప్రవరమురు మరు
ద్వేగ వ ద్వేదచర్చా
గోష్ఠ్యాం నారాయణార్య స్సదసి
బుధ శతైః శ్లాఘ్య మానావధానః,
సమస్తా ద్ధర్మ భూపా దలభత శిబికాం
చామర చ్ఛత్ర పూర్వాం
గర్వా ఖర్వావధానీశ్వర శరభ ఘటా
గండభేరుండ చిహ్నమ్."—

(౧; ౨౦-౨౧.) అను వాక్యములు సువిదిత మొనర్చు చున్నవి.

ఇట్టి వేదావధాన చక్రవర్తులు, పండిత శేఖరులు,— ప్రబలిన కాలములో మన యగస్త్య మహాకవియు. నతని మేనయల్లుండు నైను,— అశేష శేముషీ విభవము నగపఱచి శత్రుద్యశస్సు నార్జించుట కయి దూర మని యెంచక కాకతీయాంధ్ర సామ్రాజ్యము నకుం జని విద్యాంగ మంత్రిగా నగస్త్యుండును, బండిత శేఖరులుగా వారును,— దేజరిల్లిరి.

---

కాకతీయ గణపతి దేవునొద్ద

"సచివాగ్రణి" యగు

# గోపరాజు రామ ప్రధాని

(క్రీ. శ. ౧౩ వ శతాబ్దము)

ఇమ్మంత్రి శిరోమణి కాకతీయ గణపతిదేవు నొద్ద సచివాగ్రణిగా నుండి యఘటన ఘటనా సమర్థుం డని ప్రసిద్ధి వడసెను. గణపతి దేవుండు క్రీ. శ. ౧౧౯౯–౧౨౬౦ సంవత్సరముల నడుమనున్న వాం డగుటచే నితని మంత్రిశేఖరుం డగు రామప్రధానియు నా కాలముననే యుండె ననుటకు సందియము లేదు.

గణపతిదేవ చక్రవర్తి 'ధరణికోట'ను రాజధానిగాం జేసికొని పరిపాలించె నని యగపడుచున్నది. వెలంనాటి ముఖ్య పట్టన మగు 'ధనదుపురము'ను జయించె నని 'చరిత్ర చతురానన' బిరుదాంచితు లగు శ్రీచిలుకూరు వీరభద్రరావుపంతులవారు వ్రాయుచున్నారు. ఇతండు శా. శ. ౧౧౬౩ వ సంవత్సరమునం బరిపాలనమునకు వచ్చె నని 'యాంధ్రకవుల చరిత్ర' వాకొను చున్నది. 'సోమదేవ రాజీయము' శా. శ. ౧౧౯౯–౧౨౪౭ వఱకు నీతని కాల మని సూచించు చున్నది.

"షష్ట్యధి కైకాదశీ శతసంఖ్యే
క్రోధి నామ్ని శకవర్షే
మోటుపల్ల్యభిధాన సోఽయం
కొండపట్టణే మహారాజశ్రీ
గజపతి రాజేంద్ర స్థాపిత శాసన"—మ్మని

మోటుపల్లి శాసనము విదిత మొనర్చుట వలన శా. శ. ౧౧౬౦ దవ సంవత్సరమున శాసనము వేయించె నని తెలియు చున్నది. ఇతని శా. శ. ౧౧౭౫ దవ సంవత్సరము నాటి 'కొప్పరము' శాసనమును, శా. శ. ౧౧౨౯ (ప్రభవ సంవత్సర పుష్య బ ౫) నాటి వేదాద్రి నృసింహస్వామి యాలయము నొద్దనున్న 'ధర్మశాసనమును, శా.శ. ౧౧౪౨ వ సంవత్సరము నాటి 'త్రిపురాంతక' శాసనమును, — అగపడు చున్నవి. త్రిపురాంతక శాసనముం బట్టి యితని రాజ్యపరిపాలనా సంవత్సరము ఇరువది రెండవ యేఁడని తెలియుచున్నది. కావున శా.శ, ౧౧౨౦ శక మీా గణపతి దేవుని రాజ్యారంభ కాల మని చెప్పవచ్చును. ఈ గణపతి దేవుఁడు రాజధానీ నగరమును 'ధరణికోట' నుండి కొన్నాళ్లకు నోరుగల్లునకు మార్చుకొని యచట రమ్యహర్మ్యములు గట్టించి తన పేరఁ జెఱువులును, శివాలయములును, గ్రామములఁ బెక్కింటిని,— నేర్పఱచెను. కాఁబట్టి యీ గణపతి దేవుని మంత్రి పురందరుఁ డగు గోపరాజు రామనయు నీ కాలముననే తేజరిల్లె నని చెప్పుటయం దతిశయోక్తి లేదు గదా!

## గోపరాజు రామప్రధాని

కొండవీటి దండకవిలె యందలి

"గోత్ర శాస్త్రాంబరేందూనాం
సంఖ్యాబ్దే శాలివాహనే
గ్రామ స్థావర వృత్తీనాం
ప్రథమో గణికాగ్రణీః
శ్రీమాన్ గణపతి ర్ఖ్యాతో
గజప త్యాన్వయోద్భవః
అస్తి భూమండలే తస్య
బహవ స్సంతి మంత్రిణః.

"తేషాం శ్రేష్ఠత మామాత్యో
యాజ్ఞవల్క్యోత్తమో ద్విజః
గోపరాజాన్వయోత్పన్నో
రామాఖ్యో గణకాగ్రణీః

"రక్తాక్ష్యబ్దే మాసి భాద్రపదే
బహుళే పక్షకే
దర్శేర్క గ్రహణే పుణ్యే
కాలేంగారక వాసరే
గణికానాం హితార్థాయ
సద్వ్యవస్థాపనాయ చ
తిష్ఠిత శ్శశిమూర్తాంశ
యావత్తావచ్చ వర్ధతాం.

"తేషాం రాజా గృహీత్వాణాం
కృష్ణవేణీ తటే తథా

గ్రామస్థావర వృత్తీనాం
సాక్షిణా స్సర్వదేవతాః.
తస్మాద్ధర్మ మిదం సత్యం
నిర్మితం యో దురాత్మనాం
కరోతిచే దన్యథా సో
జాయతే ఖరయోనిషు.

"ఆపస్తంబస్య సూత్రస్య
శాఖాభేదః ప్రఉచ్యతే
యాజ్ఞవల్క్యేతి విఖ్యాతో
గోత్రం కాశ్యప ఇత్యథా
విప్రాణాం శాప ముద్వేవం
వేదబాహ్యాశ్చ కారయత్,
తచ్ఛ శాపవిముక్తిత్వం
భాను శక్త్యా ద్వ్యపండితః,
మాఘమాసే సితేపక్షే
విజయే వత్సరే తథా
పంచమ్యాం రవివారే చ
యాజ్ఞవల్క్యోద్భవో భవత్."

—అను శ్లోకములఁ బట్టి యితఁడు శా. శ. ౧౦౬౭ (రక్తాక్షిసంవత్సర భాద్రపద బ ౩౦ మంగళవారమునఁ గృష్ణా నదీ తటంబున సూర్యగ్రహణ కాలమ్మున నృపు ననుగ్రహమ్మునఁ గరిణీకముల బ్రాహ్మణుల కొసంగె నని తెలియుచున్నది.

ఇ య్యమాత్య శిరోమణి తిరుపతికిఁ జని మగిడి తన రాజధానికి వచ్చుచున్నయపుడు శా. శ. ౧౦౬౬ లో సత్తెన పల్లెకు దాఁపున నున్న 'మాదల' యం దొక విప్రు నింట విడిసి తాఁ బెట్ట వలసిన యాబ్దికమునకు విధ్యుక్తముగఁ దొలి నాఁడే భోక్తల నిమంత్రణ మొనర్చెను. నిమంత్రణమునకుఁ జెప్పిన బ్రాహ్మణులలో నొకఁ డీయు వలసిన పన్నుఁ జెల్లింప నందున నా యూరి (కమసాలి) కరణ. మీ బ్రాహ్మణునిఁ బిలువం బనిచి 'బందకొయ్య' వేయించెను.

అ క్కారణమున నిమంత్రణమునకు రావలసిన యా బ్రాహ్మణుఁ డెంతసేపటికి రాకుండుట వలన నాతని వృత్తాంత మంతయుఁ దెలిసికొని, పితృకార్యార్థ మా బ్రాహ్మణుఁడు నిమంత్రణమునకు రావలసి యున్నదనియుఁ, బంపినచోఁ గార్యానంతర మాతని నిర్బంధింపవచ్చు ననియు,—నెంతఁ జెప్పి పంపినను ఆ కమసాలి కరణము విన నందున న మ్మంత్రి శిరోమణి స్వయముగ నాతని కడకుం జని సందర్భముల నన్నిఁటిని వినిచినను వృథయగుట వలన సచివోత్తముం డగు రామ ప్రధాని క్రోధోద్దిక్త మానసుం డయి యా పితృకార్య మెట్టులో నెఱవేర్చికొని రాజధానికి వచ్చి సమయ మెప్పుడు వచ్చునా ? యని ప్రతీక్షించు చుండెను.

ఇట్టు లుండ సూర్యగ్రహణము దటస్థించి యా పర్వ సమయమునఁ బురోహితు లెవ్వరును రాఁ గూడ దని కట్టడిఁ జేసి తా నొక్కరుఁడే ప్రభూత్తంసుని వెంట నరిగి కృష్ణవేణీ జలమ్ములఁ గ్రుంకులాడి సంకల్పము సెప్పుటకు బ్రాహ్మణు

లెవ్వరును లేరే! యని చింతించు గణపతిదేవు పాలికిం జని "ప్రభూ! బ్రాహ్మణు లెవ్వరును రాలేదు. నేను గూడ బ్రాహ్మణుఁడనే! పురోహిత కృత్యముల నేఁ జేయుదు"

—నని ప్రభువుతోఁ జెప్పి, యాతని నంగీకరింపఁ జేసి, సంకల్పముఁ జెప్పి గణపతిదేవుని వలన నేఁడు గణియల సేపు ముద్రాధికారముఁ బడసి చేతిలో నుదకము విడిపించి కొనియెను.

ఆవలఁ గొన్నాళ్ళకుఁ గరిణీకముల నన్నిఁటినిఁ బరిశీలించి కమసాలులను దొలఁగించి యా పదవుల యందు బ్రాహ్మణులను ౫౧౩౫ గ్రామములకు నియమించె నని 'కొండ వీఁటి దండకవిలె' సాటుచున్నది. ఇ వ్విధముగ నైతిహ్యము (Tradition) విదితము సేయు చున్నది. కాఁబట్టియే యితఁడు 'కరిణీకోద్ధారకుఁ' డని ప్రసిద్ధిఁ జెందుట సంభవించినది.

కొండవీఁటి చరిత్రను శా. శ. ౧౨౫౦ నల సంవత్సరమున జయనాగదేవ భట్టరను నతఁడును, ఆవలఁ బోలమరాజు, కోనప్ప, అన్నమరాజు,— నను మూవురును,— అంతకు ముందు జరగిన చరిత్రాంశముల నేర్చి కూర్చి 'దండకవిలె' గా వ్రాసి యుంచిరి. ఇప్పటి కిదియ యాధారము.

కృష్ణవేణీ తటంబున గణపతిదేవునకును, అతని సచివాగ్రణియగు రామప్రధానికిని,— జరగిన సంభాషణ మిట్టు లుండెనని యొక చాటువు స్పష్టము సేయు చున్నది. గణపతి దేవుఁడు

"అవగత శబ్దశాస్త్రచయు
లైన మహాత్ములు పండితోత్తముల్
భువన తలంబు నం దధిక
పూజ్యులు వా రటులుండఁ గూటికై
నవనవ కల్పనా విధి చ
ణత్వము తోడి సబద్ధమాడు నీ
కవులఁట! దానపాత్రు లఁట!
గౌరవ మందుటఁ జూవె చిత్రముల్."

—— అని యనఁగా, మంత్రి తిలకుం డగు రామప్రధాని

"మానఘనుండు, బ్రహ్మకుల
మండనమూర్తి, పరోపకారి, దు
ర్దాన దురాన్నము ల్గొనఁడు,
తప్పఁడు స్వామిహితైకకార్యముల్,
దీనులఁ బ్రోచు, బాంధవ వి
ధేయుఁడు, డస్సియు వేఁడఁబూనఁ డిం
పూనిన భక్తితోడుత 'ని
యోగి' కొసంగిన దాన మల్పమే!

"వ్రాయుట దోసమా? వికృతి
వైదికమా? సుతదార రక్షణో
పాయము కై 'నియోగి' నయి
పార్థివ సేవ నొనర్చు నంతనే
పాయునె వంశ శీలములు
బాగుగ మున్నుల చిత్రగుప్తులుꟷ

వ్రాయరె యెల్ల లోకముల
వారలు సేసిన పుణ్యపాపముల్.

"కవి కమలాసనుండు, త్రిజ
గత్పతి యైన పినాకపాణియుం
గవియె, తలంపఁగాఁ గవులు
గారె పరాశర బాదరాయణుల్
కవికృత పుస్తక గ్రహణ
కర్తలు లబ్ధులు పూజనొందఁగాఁ
గవు లఁట! దానపాత్రములు
గారఁట! యిట్టివి పో, విచిత్రముల్"—

—అని చెప్పినట్లు 'ద్వావింశన్మంత్రి చరిత్రము' నఁ గలదు. ఇంతియ కాక

"గణక నిర్వాహంబుఁ గల్పించె నూరూరఁ
మహి గోపరాజు రామప్రధాని"—

—అనియు,

"ధర గోపరాజు రామన
కరణీకము లుద్ధరించు కాలముఁ దలఁపన్
గిరి ఋతు గగన శశాంకులు
గర మొప్పెడు శకమునాఁటి కాలం బయ్యెన్,"

—అనియుఁ,— చాటువులు దెలుపుచున్నవి. ఇతఁడు శాసన మొకదానిం జెక్కించినాఁడు. ఆ శాసనభావము తెలుఁగున

"శ్రీ గజపతి వంశసింధు సుధాకరుఁ
డనఁదగు గణపతి జననరుండు
చతురబ్ధివలయిత క్ష్మాతలం బాత్మ మం
త్రుల సమ్మదమున నుజ్వలము గాఁగ
నేలు కాలమున మహీతలమున గోప
రాజాన్వయుం డైన రామమంత్రి
గణికుల కెల్లను గడుహితంబుఁగఁ గృష్ణ
వేణీతటంబున వింశభాగ

కలన నూరూర వృద్ధి వృత్తులు గ్రహించె
నవని రక్తాక్షి భాద్రిప దార్కవార
గ్రహణ మందున గోత్ర శాస్త్ర వియదిందు
హాయనము లయిన శాలివాహన శకమున." —

—అని యున్నది. ప్రభు వొసంగిన గడవు కడచనపి
పిదప రామప్రధాని గణపతి కడకుం జని "ప్రభూ! భవదీ
యానుగ్రహమ్మున మ దభీష్ట మీడేర్చి కొంటెని.

"ఘనమా తావక రాజ్య మందు సకల
గ్రామాధికారంబు లం
జనితానంద 'నియోగి' భూసురులకుఁ
సాఁగించి తత్తద్వ్రాలే
ఖనము ల్సేయుచుఁ గొల్వ నేర్పఱచి ర
క్షా దృష్టి తాంబూల చం
దన హేమాంబర రత్నయుక్తముగ భూ
దానంబులం జేసి శా

సనము ల్గూర్చితి నీ యశంబు నిలుచు
నజ్ఞంద్రార్క సంస్థాయిగన్."—

—అని వచియించెనట! గణపతి చక్రవర్తియుఁ దన సచివోత్తముఁ డొనర్చిన యమ్మహాత్కార్యమున కెంతయు నలరి రామప్రధానిం గొనియాడఁ గ్రుచ్చికొనియెను. ఊరె వీరభద్రకవి రచియించిన "కరిణీకోద్ధారిణి" యను గ్రంథమున

"శాలివాహాఖ్య శకవత్సరము లద్రిరస
పుష్కరేందుల (౧౦౬౭) నెసఁగు చుండ
రక్తాక్షి వర్ష భాద్రపద కృష్ణామా ప్ర
యు క్కుజవార సూర్యోపరాగ
సమయంబునఁ గళింగ జన నాయకా
గ్రణి గజపతివంశ ప్రకాశకుండు
గణపతిరాజ శాఖా సూత్ర గోత్ర సం
పన్నుఁడ వౌ నీకు నిన్ని యూళ్ళ
ననదృశం బైన గ్రామణిత్వాధికార
మున కొసంగెను ననుభవింపుము రవీందు
తారకంబులు గల్గు నందాఁక ననుచు
వేలువేలుఁగ నుంచి; వినియె నృపుఁడు.

"ధీనిధి గోపరాజ కుల
దీపకుఁ డై తగు రామమంత్రి పం
చాణుల యందు నిశ్చలత
నానిన యీ కరిణీక ధర్మముల్

పూనికఁజేసి తీసి ద్విజ
పుంగవులం బిలిపించి యిచ్చె 'నా
నా' నని సంతసించిరి ని
రంతర సౌఖ్యము నొంది రందఱున్."—

—అని కలదు. అట్టి సంఘటన మీతనిచే జరఁగఁబడి నది. కావుననే యితఁడు 'కరణీకోద్ధారకుఁ' డని విఖ్యాతుఁ డయ్యెను.

ప్రభు నానతి నితనికి లభించిన యీ స్వల్పకాలములో నవఁగా నేఁడు గడియలలో 'వినికొండ' సీమలో ౨౨౪ గ్రామములు, కొండవీటి హావేలిలో ౪౮౩ గ్రామములు, తక్కిన సీమల గ్రామములకుఁ బెత్తనపుఁ గరణికములు ౯,౦౦, —ఇచ్చినట్లు లవగత మగుచున్నది. ఇదియునుగాక అనుమకొండ (Anumakonda) నుండి వచ్చిన యాజ్ఞవల్క్య నియోగులలో నూరింట్ల పేళ్ళవారికిఁ గరణీకము లిప్పించినట్లు లగపడుచున్నది. ఇతఁ డిచ్చిన కరణీకములలోఁ దన సంతతి వారి కిద్దఱకు మాత్రమే కొలకలూరు (తెనాలి తాలూకా), తంగెళ్ళమూఁడి (గుంటూరు తాలూకా), గ్రామములకు మిరాశీ లీఁ బడినట్లు విదిత మగు చున్నది.

ఇమ్మంత్రిపురందరుండు గుంటూరు తాలూకా, 'తంగెళ్ళమూఁడి' కాఁపురస్థుఁడు, యాజ్ఞవల్క్యనియోగి బ్రాహ్మణుఁడు, కాశ్యపగోత్ర కలితాపస్తంబ సూత్రుఁడు. రవి చంద్రులుండు నందాఁక ఇమ్మహానీయుని యభీష్టము నెఱవేఱుచుండు నని వేఱ వచింపఁ బని లేదు గదా!

# శ్రీకృష్ణ క్షితిపాల మౌళి సచివుం డగు

# సాళువ తిమ్మరుసు మంత్రి :

( క్రీ. శ. ౧౬ - వ శతాబ్దము. )

---

శాలివాహన శకము ౧౪౪౨ విక్రమ శక వైశాఖ శు ౧౫ నాంటి నాదిండ్ల గోపమంత్రి శాసన మందలి

"శ్రీ కృష్ణక్షితిప స్సభాతి విజయ
స్తంభః కళింగాంగణే
మహా ప్రధాన శ్రీ సాళ్వ
తిమ్మ స్సచివ శేఖరః,
శ్రీకృష్ణరాయ నృపతే
స్సామ్రాజ్య మధి తిష్ఠతి,
శ్రీ సాళ్వ తిమ్మ సచివః
కౌండిన్య కుల శేఖరః,
వేమయామాత్య సత్పౌత్రః
రాచయామాత్య నందనః."

—అను వాక్యములం బట్టి తిమ్మరుసు మంత్రి కౌండిన్య గోత్ర కలి తాపస్తంబసూత్రుం డనియు, నాఱువేల నియోగి బ్రాహ్మణుం డనియుం, 'గొండవీఁడు' వాస్తవ్యుం డనియు, రాచిరాజు కొమారుం డనియు, వేమరాజు మనుమం డనియు,

శ్రీకృష్ణదేవరాయ మహాప్రధాన సచివశేఖరుం డనియు,— విదిత మగు చున్నది.

'సాళువ' రాజన్యుల యొద్ద వీరి పూర్వులెల్లఱును మంత్రిశేఖరులుగను, చమూపతులుగను,— నుండి పేర్గాంచుచు ననూచానముగ రాజసేవా పరాయణు లగుటచే 'సాళువ' వా రనియె వీరిం బిలుచు చుండిరి రాచిరాజు కాలమున స్వస్థల మగు 'కొండవీటి' సామ్రాజ్యము గజపతి చక్రవర్తు లచే గెలుపొందఁ బడుటం జేసి 'సాళువ' రాజన్యులు 'చంద్రగిరి'కి వలసపోయి నూతనముగ రాజ్యమును నెలకొల్పుట వలన రాచిరాజు సైత మిచటఁ దన సర్వస్వము గోల్పోయి నిఱుపేద వై బ్రదుకుఁ దెఱువున కయి 'చంద్రగిరి' కేఁ బోయెను. బ్రదుకుఁ దెఱువున కయి రాచిరాజు 'చంద్రగిరి'కేఁ బోయిన తర్వాతనే తిమ్మ సచివాగ్రణియు, గోవిందరాయలును, గృష్ణమాంబయుఁ,— గలిగిరి. ఈ బిడ్డలు గలిగిన పిదప రాచిరాజు తన భార్యను గోల్పోయెను.

కాఁగా, రాచిరాజు తన కొమార్తె యగు కృష్ణమాంబను 'చంద్రగిరి' రా జగు సాళువ నరసింహరాయని మహామాత్యుం డగు నాదిండ్ల చిట్టిగంగన యన్న మనుమఁ డగు తిమ్మరాజున కొసఁగి మహావైభవముగఁ బెండ్లిఁ గావించెను. ఇట్టి సంబంధ బాంధవ్యము లున్నను బేదరికము దాఁపురించిన తర్వాతఁ గూడఁ దిమ్మమంత్రి మహామాత్యుం డగు చిట్టిగంగన సాహాయ్య మర్థించలేదు.

తిమ్మమంత్రి సంస్కృతాంధ్ర కర్ణాటాది భాషలలోఁ

జక్కని పాండితీగరిమ కలవాఁ డయ్యును గొనాని యోడను, శౌర్యసంపన్నుఁడు, ప్రజ్ఞా ప్రాభవ సంపన్నుఁడు,—నని చంద్రగిరి, గుత్తి, పెనుగొండ, నారాయణ వనము,— లోనగు ప్రదేశ ములఁ బేర్వాసెను.

అన్ని విషయముల గోవిందరాయలును దిమ్మమంత్రి వంటివాఁడే యని ప్రజల రసనాగ్రముల మెలంగు చుండెను. 'చంద్రగిరి' సామ్రాజ్యమునకు రాజధాని యగు 'నారాయణ వనము' నం దీ యన్నదమ్ముల శక్తి సామర్థ్యములు, ప్రజ్ఞా ప్రాభవములు,— అతిశయించి తుదకుఁ జిట్టి గంగన శ్రవణ పుటంబుల సైతము సోఁకి గోవిందరాయ తిమ్మ సచివాగ్రణుల రావించి, రాజనీతి విద్యా రహస్యముల సమగ్రముగ నెఱిం గించి, యున్నతస్థితికి రాఁ దోడ్పడియెను. ఆ కారణమునఁ దిమ్మ మంత్రికి గంగనామాత్యు నెడ నశేషభక్తి పుంభావము గుదిరి య మ్మహామాత్యుని సందర్శించుటయు, సేవించుటయు,— నొక విశేష మని తలంచు చుండెను, ఇట్టి భావ శబలత కలవా రిలోఁ దిమ్మమంత్రి మొదటి వాఁడు.

ఆ నాఁటి యార్థిక శాస్త్రజ్ఞులలో, సచివోత్తములలోఁ, బరిపాలనా దక్షులలో, రణనీతి కోవిదులలోఁ, జిట్టి గంగన యెన్నఁదగిన సప్తతి తమ వర్షప్రాయుఁడయ్యును బహునాత్రే డుల వయస్కాముని బలె దేహ మనోబుద్ధులు గల వాఁడయి రాజ్యచక్రము నవలీలఁ ద్రిప్పు చుండిన చతురుఁడు. ఇమ్మహా నీయుని భయము వలననే గజపతులు వెనుకంజ వైచిరి. ఇవ్వి

చక్షణా దక్షుని పరిశీలనము వలననే బహామనీ సులతాను లీ
కర్ణాటక సామ్రాజ్యమును దాఁకుటకు వెఱచిరి.

గొప్ప మేధావి యగు తిమ్మమంత్రి చిట్టి గంగనామా
త్యుని శుశ్రూష వలన రాజనీతి వేతృత్వము, శాస్త్ర పరి
జ్ఞానము, లోకానుభవము,— గడించి మహామాత్యున కుండఁ
దగు సర్వలక్షణముల నలవఱచికొని యుండుటను గనిపట్టి
యొకనాఁడు చిట్టి గంగన తిమ్మసచివుని దగ్గఱకుఁ బిలచి
'కుమారా! నీ భవిష్య ద్దశాలక్షణములు నీ ముఖము సాటు
చున్నది. నా యనంతర మీ యాంధ్ర మహాసామ్రాజ్యము
నకు మహామాత్యుఁడవు నీవ యగుదువు. ఈ భారము నీ
యంద నిక్షిప్తమయి యున్నది. విస్మరింప వలదు. ఒక దెస
నుత్కళరాజులు, మఱియొక వంక బహామనీ సులతానులు,—
మన సామ్రాజ్యమును గబళించి వైప నువ్విళులూరుచున్నారు.
వయసు చెల్లిన వాఁడను. ఎంత కాలమో బ్రదుకఁజాలను. ఈ
శాత్రవయోధుల నిప్పుడే నిర్జింపఁ దగు బలము మనకు లేదు.
అదియునుం గాక విజయనగర సామ్రాజ్యము సరియైన స్థితిలో
లేదు. నా తర్వాత నీ సామ్రాజ్యమునకు నీవ మహామంత్రి
వై నా యభీష్టముల నీడేర్చి "ఆంధ్ర సామ్రాజ్య స్థాపనా
చార్య" బిరుద మందుము. ఇందులకుఁ దప్ప నని లోకసాక్షి
యగు కర్మసాక్షి యెదుటఁ బ్రమాణము సేయు" మని నొడివి
నంతనే తిమ్మరుసు బ్రహ్మానంద మంది "తమ కోర్కె నెఱ
వేర్పఁ బ్రయత్నించెద" నని ప్రమాణ మొనర్పఁగా, గంగనా
మాత్యుఁడు సంతోషసాగరమునఁ దొప్పఁదోఁగి తిమ్మమంత్రిని

బిగ్గఁ గౌఁగిలించికొని "నాయనా! నన్నెఱిఁగితివే! సందియము లే"దని నోటిపై దాఁపున నుండి యీ దృశ్యమునంతను దిలకించుచున్న గోవిందరాయల నవలోకించి "బాబూ! అన్నగారికి నన్నివిధముల నీవైన నీ యభిప్రాయమేమి?" యని పృచ్ఛింప నొసలు జలదరించి కన్నుల వెంట నశ్రుకణముల రాల్చుచున్న గోవిందరాయలు "ప్రభూ! మా యన్నగారికి బాసటగా నుండి యన్ని విధముల మీ యభీష్టము నెఱవేర్చి మీకుఁ దృప్తిఁ గలిగించెద"నని చేతులు ముకుళించఁగనే చిట్టి గంగన మహామాత్యుఁ డాతనిఁ జేరఁదీసి మూర్ధ్నాడి 'భవతు' అనియెను.

ఇది జరగిన కొన్నాళ్లకు గంగనామాత్యుఁ డసువులఁ బాసెను. అతఁడు బ్రదికి యుండఁగనే తుళువ నరసరాజునకుఁ దిమ్మయ ప్రధాని యయ్యెను. ఈ నరసరాజు 'చంద్రగిరి' ప్రభు వగు సాళువ నరసింహరాయని కడఁ జమూపతిగానుండి 'గుత్తి' దుర్గమున కధిపతి యై పరిపాలనము సాఁగించిన వాఁడు. ఈశ్వరరాజు కొమారుఁడే యీ నరసరాజు. ఈశ్వరరాజు సైతము నరసింహరాయల యొద్ద సైన్యాధ్యక్షుఁడుగానుండి నిరుపమాన విక్రమాటోపమును గనంబఱచి దుర్గములఁ బెక్కింటిని జయించి 'చంద్రగిరి' సామ్రాజ్య విస్తృతమునకు దోడ్పడి

"ఉదయాద్రి భేదించె హలుత్తర నిర్జించె
గండికోటపురంబుఁ గదలఁ ద్రివ్వెఁ
బెనుగొండ సాధించె బెగ్గలూరు హరించెఁ
గోవెల నెల్లూరు గుంటపఱిచెఁ

గుండాళి విదలించె గొడుగు చింత జయించె
బాగూరు పంచము పాడుసేసె
నరుగొండఁ బెకలించె నామూరు మర్దించె
శ్రీరంగపురమునుబాటి పమరె
రాయచే హత్తి మల్ల ధరా వరాహా
మోహన మురారి బర్బర బాహు సాళ్వ
నారసింహ ప్రతాప సన్నహనుఁ డగుచు
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు."

—ఇట్టి విజయలక్ష్మీ కరగ్రహణుం డయిన యీశ్వర రాజునకు నరసరాయలు తగిన కొమారుఁడు. శౌర్యధనుం డగు నీతని నాయకత్వమునఁ 'జంద్రగిరి' సామ్రాజ్యము సర్వతో భద్ర మయ్యెను. కాఁగా, నరసరాయ లిప్పుడు శత్రు దుర్నిరీక్ష్యుఁ డయ్యెను. గజపతి చక్రవర్తులు, బహుమనీ సులతానులు, - నరసరాయ లనిన గజగజ వణఁక సాఁగిరి. ఆ సందర్భమునసే తిమ్మరుసు పేరెల్లకడల నెల్లవారి నాలుకలలోని నాల్కాయయ్యెను. ఇఁక గోవిందరాయల మాటఁ జెప్పనేల ?

ఈ సంక్లిష్ట సమయమునఁ గర్ణాట సామ్రాజ్యమునఁ గలఁత లభివృద్ధి నొంది తత్ప్రభు వగు విరూపాక్షరాయల దుష్ప్రవర్తనము, స్త్రీ లోలత, - రాజ్యాంగ వ్యవహారముల విస్మరింపఁజేసి తత్రాపి దండనాథులు, సచివులు, - స్వైర విహారు లై నడచుటకుఁ ద్రోవ యేర్పడినది. కాఁగా, సామంత నృపాలురు స్వేచ్ఛా స్వాతంత్ర్యములఁ బ్రకటించి, సుంకములఁ జెల్లింప మాని, యుపేక్షితు లై యుండుటను దిరస్కరించిరి. ఆ

కొంగణమునఁ బ్రజల యందంతఃకలహము లంకురించి పన్నుల నిరాకరణము, ఆదాయము సన్నగిలుట, — యేర్పడి బహామనీ సులతానులు సామ్రాజ్యమును గబళించి సైన్య సన్నాహతతోఁ బ్రయత్నములఁ జాఁగించుటను దిమ్మరుసు మంత్రి గ్రహించి నాదిండ్ల చిట్టిగంగన మహామాత్యునకుఁ దాఁ జేసిన వాగ్దానమును స్మృతిపథంబునకుఁ దెచ్చికొని, సామ్రాజ్య సంరక్షణ భారమును వహింప నిశ్చయించి,—నరసింహరాయలకు సర్వము వినుకలి యగునట్లొనర్చె. యాతని యానతిపైఁ బ్రబల సేనాసమేతుఁడై నరసింహరాయలతోఁ గూడ విజయనగరమును దండెత్తఁగా దత్ప్రజలును నరసరాయలకు స్వాగతమిచ్చి రంగరంగ వైభవములతోఁ గొనిపోయిరి.

అంతఃపురమున స్త్రీ లోలుపుఁడై ప్రొద్దు పుచ్చుచున్న విరూపాక్షరాయలు నగరమును శత్రు మూఁక ముట్టడించిన దని చెప్పిన వార్తాహరులఁ జావమోఁది పనిచెనే గాని తన యునికికే భంగపాటొదవుచున్న దని గ్రహింపఁ డయ్యెను. కతిపయ ఘటికలలో నరసరాయలు అంతఃపురమునఁ బ్రవేశింపఁగఁ జూచి స్వప్రాణ రక్షణార్థమై వేఱు త్రోవను బడి పిక్కబలము సూపెను. అశ్రమముగ నరసరాయలు విజయనగరమును బట్టికొని తన ప్రభు వగు సాళువ నరసింహరాయలకుఁ దెలుపఁగా, నతఁడు మహావైభవముగ విజయనగరమునకుం జని రాజ్యారూఢుఁ డయ్యెను.

నాఁడు మొదలు విజయనగర, చంద్రగిరి రాజ్యము లైక్య మంది యాంధ్ర మహాసామ్రాజ్య మయ్యెను. కాఁగాఁ,

దిమ్మరుసు మంత్రి 'మహామాత్య' పద మధిష్ఠించి సామ్రాజ్య
భర్మ హర్మ్యమునకు మూలకంబము నా నొప్పెను. నరసింహ
రాయ ధరణీపుఁడును సామ్రాజ్య రక్షణ భార మంతయు
నరసరాయ తిమ్మ సచివాగ్రణుల పయి నునిచి నిశ్చింతతో
సుఖంబుండు చుండెను.

నాదిండ్ల చిటి గంగన చరమ పవిత్రవాక్యములు స్మృతి
పథంబున మెలంగుచుండుట వలనఁ దిమ్మమంత్రి రాజ్యమునఁ
గలఁతలు, శత్రుభయము, — లేకుండఁ జూచుచు బరిసర
దుర్గముల బలిము మొనర్చి, స్వాతంత్ర్యము నభిలషించి కప్ప
ములఁ గట్టుటను మానివైచిన సామంత మాండలికుల మరల
లోఁగొని, విశ్వాస్యు లగు సేనానుల నియమించెను. సర్వ
సైన్యాధిపతిగా నరసరాయ లుండినను గర్ణాటక సర్వసైన్యాధి
పతిగాఁ దన తమ్ముఁడైన గోవిందరాయల నియమించి నగర
సంరక్షణ భార మంతయు నాతని యందుంచెను.

నరసింహరాయలు పేరునకు రాజే గాని తిమ్మరుసు
మంత్రియే నిజమునకు రా జనిపించి కొనియెను. ఇట్టిఁ డయ్యును
దిమ్మరుసు తన సుఖమును గాంక్షింప లేదు. ఆంధ్ర మహా
సామ్రాజ్య భద్రపీఠ మధిష్ఠించిన తర్వాతఁ గొన్నాళ్ల లోనే
క్రీ. శ. ౧౪౯౦ వ సంవత్సరమున నరసింహరాయలు పరమ
పదించెను. అపల నతని జ్యేష్ఠకుమారుఁ డైన తిమ్మరాయలు
రాజ్యారూఢుఁ డయ్యెను గాని యతఁడు చిఱుత తనంబున
నుంటచే నరసరాయ లితనికి సంరక్షకుఁడుఁగా నుండి పరిపాల
నము సాఁగింపఁ జొచ్చెను. శౌర్యధనుం డగు నరసరాజు,

మహామేధావి యగు తిమ్మరుసు మహామాత్యుండును, సహస్రాక్షుం డగు గోవిందరాయలు, — కంటికి ఱెప్ప వగిదిఁ గాపాడుచుండ నాంధ్ర మహాసామ్రాజ్యము రామరాజ్య మయ్యెను.

ఇట్లాంధ్రపుర సామ్రాజ్య పర్యవేక్షణమున శాత్రవ తతి భయకంపితులై యెప్పటికేనిఁ దమకు ముప్పు వీరి వలనఁ దప్ప దని చింతింపఁ దొడంగిరి. ఇట్టి తఱుణమున నరసరాయలకు నదిపడని యుద్యోగి యొకరుండు దిమ్మరాయలకు విష ప్రయోగము సేసి, చంపి, రాజ్యాపహారణమున కై నరస రాజే తిమ్మరాజును జంపించె నను వార్తను బ్రపంచెను. మహామాత్యుండును, దూర దార్శనిక పరిజ్ఞాతయు, మహామేధావియు, — నగు తిమ్మరుసు చక్కఁగా యోజించి సాళ్వ నరసింహరాయల ద్వితీయ పుత్త్రుఁ డగున ఇమ్మడి నరసింహ రాయలను సింహాసనాధిష్ఠితు నొనర్చి నరసరాజునకు న్యూనత లేకుండఁ జేసెను.

కాని యిమ్మడి నరసింహరాయలు చిఱుతప్రాయుఁ డగుట వలనఁ బరిపాలనా వ్యవహారములఁ గొనసాఁగించుటకుఁ జాల కుండి తనయన్నకు విషప్రయోగము సేసి మడియించిన ద్రోహితో నెయ్యము నెఱపి నరసరాయల కెగ్గొనరింపఁ బ్రయత్నించెను. అప్పుడు తిమ్మరుసు చేయునది లేక బలిమిమై రాజాజ్ఞం బడసి విషప్రయోగ మొనర్చిన వానిఁ గంఠ ముత్తరింపించి యాతశోఁ దనివోక అప్రాప్త వ్యవహార దశ (Mynority) యందున్న యిమ్మడి నరసింహరాయలను రాజ్యమునకుఁ దగఁ డని వేఱొక చోటి కంపి యతని పేరుతో రాజ్యము నడప

వలసిన దని నరసరాజును నియోజించెను. దీన 'సాళువ వంశ' ము తరించి 'తుళువ' వంశమే యధికారము నొందసిన దని స్పష్టమగు చున్నది.

ఇ విధముగాఁ దుళువ నరసరాజు రాజ్యము సేయ నారంభింపఁగనే శత్రుమూఁక కకావికలై విభ్రమ పరీత చేతస్కులయిరి. కాఁగాఁ దిమ్మరుసు సాళ్వవంశాభిమానుల నెల్లను వెడల నడపించి, నరసింగరాయల రాజ్యాధికార బలదర్పములు సుస్థిర మొనర్చెను. నరసరాయలు శౌర్య ధనుఁడయ్యును స్వాతంత్రించక పరిపాలనా భార మంతను దిమ్మ సచివాగ్రణి పయిం బెట్టి, తన కుటుంబ భారమును గూడ మహామాత్యుని హస్తముల యందె యునిచి, యు బుద్ధిమదగ్రగణ్యు నుపదేశము ననుసరించి వర్తించు చుండెను. ఇ విషయమున మహామాత్య శిరోమణి యగు నాదిండ్ల చిట్టి గంగనయు నిమ్మంత్రిపురందరునకుఁ జాలఁ డనియె నరసరాయల విశ్వాసము. పట్టమహిషి మొదలుకొని పరిచారిక వఱకును, ప్రభువు నుండి భటుని దాఁకను,—దిమ్మ రుసు మంత్రి యనిన భయకంపితు లగు చుండిరి.

రాజ్యాంగమున నాతఁ డొనర్చిన కట్టుబాటుల ననుస రించి యెట్టిఁ డైనను మహామాత్యునకుఁ దెలియకుండఁగనే యలతి కర్జ మైనను జేయఁ జాల కుండెను.

నరసరాయలకుఁ దిప్పాంబ, నాగాంబ, ఓబాంబ,— లను మూవురు భార్య లుండిరి. తిప్పాంబవలన వీర నరసింహ రాయలు, నాగాంబ వలనఁ గృష్ణదేవరాయలు, ఓబాంబ వలన

నచ్యుతదేవరాయలు, రంగరాయలు నను కొమాళ్ళను బడసెను. నాగాంబ యనిన నరసనాయకునకుం బ్రేమ మధికము. “వీరనరసింహ రాయల” శాసనములలోఁ గృష్ణదేవరాయలు

“తిప్పాజీ నాగలాదేవ్యోః
కౌసల్యా శ్రీ సుమిత్రయోః
దేవ్యోగివ నృసింహేంద్ర
త్తస్మా త్పంక్తిరథా దివ”
“వీరా వినయినౌ రామ
లక్ష్మణా వివ నందనౌ
జాతౌ వీరనృసింహేంద్రః
కృష్ణరాయ మహీపతీ॥”

—(కంచి కామకోటి పీఠాధిపతుల దగ్గఱ నుండు తామ్రశాసనములు, సంఖ్య ౨, పుట ౨౨.)

“తస్మా న్నరస రాజేంద్రా
త్తిప్పాజీ నాగమాంబయోః
క్రమా ద్వీర నృసింహేంద్ర
కృష్ణరాయౌ బభూవతుః.
“అన్యోన్యోపమయో స్సర్వ
సద్గుణౌఘ సముద్రయోః
తయో ర్వీర నృసింహేంద్రః
పిత్ర్యం సింహాసనం శ్రితః.—
(గోరి)

(Ep. Carnatica, Vol. 11; P. 77,) అని యభి
వర్ణింపఁబడుటను బట్టి కులసతి యగు నాగమాంబా సుతుఁడే
శ్రీకృష్ణదేవరాయ లని విదితము కాఁగలదు. ఇ ప్పరామర్శ
ముం బట్టి శ్రీకృష్ణదేవరాయలు జన్మించిన తుళువ వంశము
క్షత్రియ వంశమనియుఁ, దొలుత న వ్వంశ్యులు తుళుదేశ
స్థులే యనియు. నాతని జనని నరసనాయని కులవధూ రత్న
మనియుఁ— దేఁటపడు చున్నది. తుళువ రాజవంశమునకు
మూలపురుషుఁడును, గృష్ణదేవరాయల ముత్తాతయు, నైన
తిమ్మరాజు 'తుళు' దేశస్థుఁ డని 'వరాహ పురాణము' నఁ
జెప్పఁబడి యున్నది. కాని యా తిమ్మరాజు జన్మస్థళమును,
జన్మదేశమును, బరిత్యజించి దక్షిణాంధ్ర దేశమునకు వచ్చి
'చంద్రగిరి' యందు సాళువ రాజన్యుల నాశ్రయించి యచటనే
నిలిచిపోయిరి. కాఁగా; వారి కాంధ్రదేశము జన్మదేశ మయ్యెను.

వీర నరసింహరాయలు ప్రోలుగంటి చెన్నకవిని అగ్ర
హారముల, వివిధార్థముల, నిచ్చి, గౌరవించెను. ఇ క్కవి
శిరోమణి (ద్విపద) నారసింహ పురాణము, (వచన) బాల
భారతము, సౌభరి చరిత్ర, జక్కుల కథ,— మొదలగు గ్రంథముల
రచించినవాఁడు. ప్రోలుగంటి రంగనకుఁ బినతాత కుమారుఁడే
యితఁడు. నరసరాజు వరాహపురాణము, వరలక్ష్మీ కళ్యాణము
నరసింహ విజయము, నను కావ్యములఁ గృతి నందెను.

తిప్పాంబ తన కొమారునకు నరసరాజు పట్టము గట్టఁ
డేమో యని యోజనాపరంపరలకుం జిక్కి యెట్టకేలకుఁ దన
సవతి బిడ్డఁడగు శ్రీకృష్ణదేవరాయలఁ జంపిన-చోఁ దన పని

గ్రహింపు-నని తెలంచి త త్ప్రియశిష్యుల నియోగ్న యయ్యెను. ఈ సుప్రియశిష్యను నేగలనో గ్రహించి మహామాత్యుడు దన లిమ్మ్నగు నోపించుసాయలతో యోజించి విద్యకెప్పుడు నని వ్యాజమునఁ గృష్ణదేవరాయలను దన యింటికిఁ జేర్చి యొగులకఁ దెలియకుండఁ సంరక్షణ మొనర్చెను. అందుల కయియే మహామాత్యుని గృష్ణరాయలు 'అప్పాజీ' యని నోరారఁ బిలుచును విద్యల నన్నిటి నాతని ప్రేమాల నేర్చుకొను చుండెను. మహామాత్యులు రాజ్య సంరక్షకులును, రాజప్రాణ దాతలును,——నయిరి.

ఇట్టులఁ గొన్నాళ్ళు కడచన్న పిదప నరసరాయలకు శరీరస్వాస్థ్యముఁ దప్పి నాఁడునాఁటికిఁ గృశింపఁ జొచ్చెను. కాఁగాఁ, ప్రాణోత్క్రమణ స్థితిఁ దటస్థించి మహామాత్యుల వారిం బిలువం బనిచి "రాజ్యప్రదాతా! రాజ్యసంరక్షకా! మీ రాజనీతివేత్తృత్వమున సాళ్వ నరసింహరాజు కర్ణాట కాంధ్ర సామ్రాజ్యమున కధినేత యయ్యె. మీ ప్రజ్ఞాతిశయ మునఁ దుళువ వంశస్థుఁడ నగు నేను నీ సామ్రాజ్యమున కధిపతి నయితిని. నీ నేర్పు ననుసరించి నా యనంతర మెవ్వఁ డీ మహాసామ్రాజ్యమునకు నభిషిక్తుఁ డగునో! మహామాత్యా! నా కొమారులు వీరు. వీరిని సంరక్షించు భారము మీ యది. సాళ్వ వంశజుల వలన నెట్టి ముప్పును రాకుండఁ జూచి యీ మహా సామ్రాజ్యాధిపత్యము నా కొమాళ్లకుఁ జెందించి మహామాత్యు లగు నాదిండ్ల చిట్టిగంగన భావ పరంపరలు గొనసాఁగునటులఁ జూడ వలసిన విధి మీ యది."—— అని

వేఁడికొని కొమాళ్ళ నాతని కొప్పగించి నిశ్చింతఁగాఁ గ్రీస్తు శకము ౧౫౦౩ వ సంవత్సరమునఁ జనిపోయెను.

కాఁగా, భర్తృ మరణబాధ కంటెఁ దన కొమారుఁడైన వీరనరసింహరాయుని యభిషేక విచార బాధయె తిప్పాంబను బాధింపఁ జొఁగెను. మహామాత్యుం డగు తిమ్మరుసు దూర మాలోచించి వీరనరసింహరాయునికే పట్టము గట్టెను. ఇప్పని సాళ్వ వంశజులకుఁ, ద దభిమానులకుఁ, గష్టముగా నున్నను మహామాత్యునిఁ బ్రచ్ఛింపఁ గల మొనగాఁడు, మగవాఁడు,— లే కుండుటచేఁ దూష్ణీంభావము వహించి మించిరి.

నగరాధ్యక్షుఁ డయిన గోవిందరాయలు సాళ్వవంశాభిమానులఁ గనిపట్టి, తగినట్టు శిక్షించి, కట్టుదిట్టము లొనర్చెను. ఈ కట్టుదిట్టములతోఁ, అదుపాజ్ఞలతోఁ,— దుళువ రాజవంశాధికారము కుదుట పడియెను. ఆవలఁ దిమ్మరుసు మహామాత్యుని యోజనానుకూలముగ వీరనరసింహరాయలు తీర్థయాత్రా వ్యాజమున బహుళ సైన్య నివహంబులతోఁ గదలి, సామ్రాజ్య మం దంతను సంచరించి, యెదుర్కొనిన సామంత నృపాలుర నదిమి పట్టి, కప్పములఁ గొని, శాంతి నెలకొలుపుటయే గాక 'భుజబల వీరనరసింహరాయ' లని ప్రసిద్ధిఁ గాంచెను.

ఆ సమయముననే శ్రీ కృష్ణదేవరాయలు దక్షిణ కర్ణాట రాష్ట్రములపై దండెత్తి యుమ్మత్తూరు, శివసముద్రము,— లోనగు దుర్గముల లోఁబఱచికొని యా రాజ్యమున కంతకును "శ్రీరంగపట్టనము" రాజధానీ నగరముగా నేర్పాటు సేసి

యానతిం దన ధ్వజమును బ్రతిష్ఠించె నని (పారిజాతాపహరణము, ద్వి. ఆ; ౧౦౫ ప.) లో

"సమ్మర్ద క్షమ ధీ నిబంధన విధా
సంక్రందనాచార్య తా
రమ్మన్యాచల వజ్రపాత జగతీ
రక్షాంబుజాతేశ్వర
ధ్యమ్మాత్సర్య దశాస్య రాజ్య సమ స
హ్యా ప్రోద్భవాభీర ధా
గుమ్మత్తూరు శివం సముద్రపుర వ
ప్రోన్మూలనాడంబరా!"

—అను పద్యము దెలుపు చున్నది, 'కావేరీ' తటమును బరిపాలించు చుండిన యుమ్మత్తూరు, శివసముద్ర, శ్రీరంగ పట్టన పాళెగాండ్రు కేంద్రప్రభుత్వమును లక్ష్యము సేయక స్వాచ్ఛంద మార్గమున సంచరించు చుండుటచేతను, విజయ నగర చక్రవర్తుల యధికార బలదర్పములకు లోఁగి వారికిఁ గప్పము సెల్లింపవలసిన యవసరము లేదని స్పష్టీకరించుట చేతను,— బహుకాలము నీలగిరి ప్రాంతమును ఉమ్మత్తూరు ప్రభువు లేలించి రని నిదర్శన (Ep. Carnatica, Vol; 3. preface P. 27) ముండుట చేతను,— వీరి బల మంతయు నీ జలదుర్గ త్రితయముపై నాధారింపఁబడి యుండుటచేతను —, కృష్ణదేవరాయలు వీరితోఁ బోరాడవలసి వచ్చినది.

కావున సాళువ నరసింహరాయల కాలముననే యుమ్మత్తూరు ప్రభువులతో యుద్ధ మారంభ మయ్యె నని తెలియు

నగుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు దక్షిణ కర్ణాట రాష్ట్రముల పై నండెత్తి దుర్గత్రితయమును బట్టికొని 'శ్రీరంగ పట్టనము' రాజధానిగాఁ జేసి యందు విజయ ధ్వజమును నెలకొల్పిన సమయముననే యచ్యుతదేవరాయలు, శ్రీరంగదేవరాయలు—, 'కొంకణము' మీఁదికిఁ జని, యా నృపాలురఁ గెలిచి, యందలి పాళెగాండ్రను లోఁబఱచికొని, తమ ప్రభుత్వమును నెలకొల్పిరి. ఇవ్విజయ పరంపరల నన్నింట శ్రీకృష్ణదేవరాయల విజయశ్రీలే యతిశయము లగుటచే సామ్రాజ్యమం దంతట నాతని పేరే యతిశయించి యుండెను. ఈ రీతి సామ్రాజ్యము కుదుట పడిన తర్వాతఁ దిమ్మ సచివాగ్రణి బహమనీ సులతానుల, గజపతి చక్రవర్తుల,— గెలుపొందుటకుఁ దగు ప్రయత్నములు సాఁగింప నారంభించెను.

ఇట్టి యుద్యమములు ప్రయత్నములు సాఁగుచున్న యపుడు వీరనరసింహరాయలకు 'నంజు' వ్యాధి పొడమి, ప్రబలమై, యౌషధము సేవించుట వలని యుపయోగ మగపడక మరణ మాసన్న మైన దని తోఁచి, మహామాత్యుఁడును సామ్రాజ్యభార వహుఁడును నగు తిమ్మరుసును రావించి "మంత్రిపురందరా! గజపతులను, బహమనీ సులతానులను— గెలుపొందుసత్తి నాకు లేదు. నా తర్వాతఁ గృష్ణదేవరాయలకే పట్టము గట్టుదు వని నాకుఁ దెలియక పోలేదు. అయినను గృష్ణరాయల కంటె నా కొమారుఁడే మీకు వలంతుఁడు. కాబట్టి నా యందు విశ్వాసము గలవాఁడవు గాన నా యనంతర మీ మహాసామ్రాజ్య భద్రపీఠమున నా కొమారునే నిలుప వలసిన

దని నా కడసారి వేఁడికోలు. వల్లె యనినను విశ్వసింపను. కృష్ణరాయలు బ్రదికి యుండఁగనే వాని కన్నులఁ దీయించి నాకుఁ జూపిన నిశ్చింతఁగాఁ బ్రాణముల విడచెద" నని చెప్పఁగా దిమ్మ సచివశేఖరుఁ డాతని దుశ్చింతకు మిపుల నొచ్చుకొని 'స్వామిరాజ్య రక్షామర్యాదలఁ బాటింపు' మను చిట్టిగంగన మహామాత్యుని యుపదేశ రహస్యము శ్రవణ పుటంబులకు సోఁకి వీరనరసింహరాయల సంతృప్తి కయి మేఁక కన్నులఁ బెఱికించి, తెప్పించి, చూపఁగా, వీర నరసింహరాయలు నిజముగాఁ దన సోదరుఁడే సనిపోయినాఁ డని విశ్వసించి క్రి శ. ౧౫౦౯ దవ సంవత్సరమున నిశ్చింతతోఁ బ్రాణముల విడచెను.

ఆవలఁ గ్రీస్తు శకము ౧౫౦౯ దవ సంవత్సరము ఫిబ్రవరి ౪ వ తేదీనఁ గృష్ణరాయలకుఁ దిమ్మసచివు ననుగ్రహ విశేషమున రాజ్యోపలబ్ధి గలిగెను. అనంతపుర మండలస్థ 'తాడిపత్రి' లోని శాసన మొకదానియందు శా. శ. ౧౪౩౧ యైన పిదప శుక్లనామ సంవత్సరము మే ౪ వ తేది నాఁడు వీర నరసింహరాయలు విజయనగరమునఁ బరిపాలించు చున్నయట్లు లుట్టంకింపఁబడి యుండుట చేతను, దక్షిణార్కాడు మండల మందలి 'విక్రవాండి' గ్రామ మందలి యొక శాసనమున శా. స. ౧౪౩౧ శుక్లనామ సంవత్సర కర్కాటక శు ౫ శుక్రవారము హస్త (క్రీ. శ. ౧౫౦౯ దవ సంవత్సరము జులయి ౨౨ వ తేది) నాఁడు వీర నరసింహ రాయలు విజయనగరమునఁ బరిపాలనము సేయుచుండినట్లు లుండుట చేతను,— క్రీస్తుశకము ౧౪౦౯ జులయి ౨౨ వ

తేది వఱకును వీర నరసింహరాయలు రాజ్యము చేయుచుండె ననియు, నంతవఱకును కృష్ణరాయల పరిపాలన మారంభము కాలేదనియుఁ,— దెల్లమగుచున్నది. కాని 'బలారి' మండలములోని 'గుళ్యము' నందలి యొక శాసనమున శా. శ. ౧౪౩౧ శుక్ల సంవత్సర శ్రావణ శు ౧౦ బృహస్పతివారము (క్రీ. శ. ౧౫౦౯ దవ సంవత్సరము జులయి ౨౬ వ తేది) నాఁడు శ్రీకృష్ణదేవరాయలు విజయనగర రత్న సింహాసనస్థుఁడై యేల్బడి సేయుచుండినట్లు లుండుట చేతను, కడప మండలములోని 'పులివెందల' యందొక శాసనమున శా. శ. ౧౪౩౧ శుక్ల సంవత్సర కార్తిక మాసమునఁ (క్రీస్తుశకము ౧౫౦౯ దవ సంవత్సరము ఆగష్టు — సెప్టెంబరు మాసములు) కృష్ణరాయలు విజయనగరముఁ బరిపాలనము సేయుచుండినట్లు లుండుట వలనను,— క్రీ. శ. ౧౫౦౯ దవ సంవత్సరము జులయి ౨౨ — ౨౬ వ తేదీల నడుమ నొక సుముహూర్తమున రాజ్యాధిపత్యము వహించె నని యవగత మగుచున్నది. కాని శా. శ, ౧౪౩౧ శుక్ల సంవత్సర మాఘ శు ౧౪ లకు సరియగు క్రీ.శ. ౧౫౧౦ దవ సంవత్సరము జనవరి ౨౪ వ తేదీనాఁడు నిలిపిన 'హంపి' శాసనమునఁ గృష్ణదేవరాయలు దన పట్టాభిషేక మహోత్సవ కాలమునఁ బంపా విరూపాక్షస్వామి యాలయమునకు గోపుర రంగమండపముల వినిర్మించె నని చెప్పఁబడి యుండుట వలన రాజ్యాధిపత్యము నందిన తర్వాత నాఱుమాసముల దాఁకఁ బట్టాభిషేకము జరగలే దని తెలియనగుచున్నది.

ఈ పరామర్శముం బట్టి యతఁడు క్రీ. శ, ౧౫౦౯ వ సంవత్సరము జులయి ౨౨ వ తేది తరువాత రాజ్యభారము వహించినను బట్టాభిషేకము మాత్రము క్రీ. శ. ౧౫౦౯ వ సంవత్సరము ఆగష్టు నెల ౭ వ తేది మంగళవారము నాఁడు జరిగె నని చెప్ప వచ్చును.

భద్రా సింహాసనమునఁ గూరుచుండఁబెట్టి పట్టము గట్టుటకుఁ బూర్వము రాయల నవలకుం బిలచి మహామాత్యుం డగు తిమ్మరుసు రాయల చెంప 'ఫెళ్' అనిపించెను. ఆ దెబ్బతో రాయల చెంప అరుణరేఖ యై గుడ్లు కన్నీటి కణములతో నింపఁబడఁగా, మహామాత్యుఁ డాతనిఁ జేరఁదీసి, యనునయించి, 'బిడ్డా! ఇంతవఱకు విద్యల నెన్నింటినో యభ్యసించితివి గాని దండపారుష్యము నెఱుంగ వైతివి. దానిం దెలియుటకే ని న్నీపనిఁ జేసితిని. అన్యథా తలంచవలదు. దండించు పట్ల న్యాయాన్యాయముల, సత్యాసత్యముల — నెఱింగి ప్రజలఁ గన్నబిడ్డల పోల్కి నేలుము. బిడ్డల కష్టసుఖములకుఁ దలిదండ్రు లెటుల బాధ్యులో యట్లు నీవును బ్రజలకు బాధ్యుఁడవు. నీ బాధ్యతను నీ వెఱింగి రాజ్యసుఖ మనుభవింపు" మని హితవొనర్చిన తర్వాత సామంత మాండలికులు గానుకలఁ దెచ్చి యర్పింపఁగా నందికొని దర్శనీయ మైన యమ్మహోత్సవమును దర్శించుచుండెను. శా. శ. ౧౪౩౧ శుక్ల సంవత్సర మాఘ బ ౧౪ లు నాఁడు జరిగిన దర్శనీయమైన యిమ్మహోత్సవమును గుమార ధూర్జటి మహాకవి యెట్లు వర్ణించెనో పరికింపుఁడు.

"ప్రణుతింప నాఁడు తోరణగట్టు పరసీమ
లను రీతి నూత్న తోరణము లెసఁగ
రిపుల ఖండించి సత్కృపఁ దత్సుతుల నిల్పు
నట్ల ద్వారము లందు నటన లలర
విలిఖించు నతఁడు దిక్కుల జయస్తంభాళి
నను మాడ్కిఁ జిత్రగృహార్య లలర
వెలయు నిట్లతని కీర్తులు దిక్తటుల నన్న
సరణి ముత్తెపు ముగ్గు జగ్గు లమర
నభినవాలంకృతి స్ఫూర్తి నతిశయించె
న ప్పురీ రత్న మపుడు మహోద్భుతముగఁ
బ్రకట మహిమల శ్రీకృష్ణరాయ నృపతి
శ్రీ కరం బైన పట్టాభిషేక వేళ."—

ఆవలఁ గొన్నాళులకు దిగ్విజయ యాత్ర సాఁగింప వలసిన దని రాయలను మహామాత్యుం డగు తిమ్మసచివేంద్రుఁడు ప్రోత్సహింపఁగా, నతఁడు పూర్వ దిగ్విజయ యాత్రకు బయల్దేఱి గజపతుల యధీన మందున్న పూర్వాంధ్ర సామ్రాజ్యమును జయింప నిశ్చయించి ముమ్మొందుఁగ 'నుదయగిరి' దుర్గమును బట్టికొని యావల శత్రు దుర్భేద్య మనఁదగు 'కొండవీఁటి' దుర్గమును క్రీస్తుశకము ౧౫౧౫ వ సంవత్సరము మార్చి నెలలోఁ దిమ్మరుసు ముట్టడి ప్రారంభించి క్రీ. శ. ౧౫౧౫ వ సంవత్సరము జూన్ ౨౩ వ తేదీన అనఁగా శా. శ. ౧౪౩౭ ఆషాఢ శు ౧౧ మందవాసరమున స్వాధీనముఁ జేసికొని నట్లు (Ep. Indica; Vol. VI, P. 117-133; Ep. Collections,

Nos. 53 and 55 of 1915) కొండవీటి దుర్గము మీఁదఁ గల శాసన మవగత మొనర్చు చున్నది. ఈ విజయానంతరము పితృ సమానుఁడును మహామాత్యుఁడును, నగు తిమ్మరుసున కీ దుర్గమును జాగీరుగా రాయ లొసంగఁగా, నతఁడు దానికిఁ దన మేనయల్లుఁ డగు నాదిండ్ల అప్పయామాత్యుని ప్రతినిధిగా నుంచెను. రాయలు దిగ్విజయయాత్ర కేఁగిన సమయమున మహామాత్యుం డగు తిమ్మమంత్రి ప్రభుత్వము యొక్క సివిల్ మిలిటరీ పనుల నన్నిఁటిని జూచు చుండెడి వాఁ డని (Madras Ep. Coll. Nos. 18 and 64 of 1915.) తెలుపు చున్నవి. 'ఆముక్త మాల్యద' యం దీ విషయ మెట్లు లభివర్ణింపఁబడి యెనో చూడుఁడు.

> "ఇది భూమండన కొండవీడు ధరణీ
> భృద్దుర్గ పూర్వాద్రి భా
> స్వ దిభేశాత్మజ వీరభద్ర జన జీ
> వ గ్రావా రాహూయ మా
> ణ దృఢాంచ ద్భుజ కృష్ణరాయ మహిభృ
> న్నామా స్మ దాముక్త మా
> ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీ
> యం బై మహిం బొల్పగుఁ."

— కొండవీటి దుర్గమును రాజ్యమును కైవసము లయిన తర్వాతఁ గృష్ణదేవరాయలు చిన్నమదేవి, తిరుమలదేవి,— సహితముగ నమరేశ్వరుని సేవింప నమరావతికి నేఁగి, యా దేవునిఁ బూజించి, కానుక లర్పించి, దాన ధర్మముల నొనర్చి

యచటి నుండి శ్రీశైలము మీఁదుగ విజయనగరమునకుం బోయెను. సాళువ నరసింగరాయుల తుది సందేశమును బుర స్కరించికొని రాయచూరు, ఉదయగిరి, కొండవీఁడు దుర్గముల మూఁడింటిని వశపఱచికొని సపాదుని జయించి కృష్ణా తుంగ భద్రల యంతర్వేదినిఁ గొని యుమ్మత్తూరు నాయకులఁ బడఁ ద్రోఁచి కావేరీ తీర కన్నడదేశమును దన యేల్బడి క్రిందికిఁ దెచ్చికొనియెను. గజపతిని నిర్జించి యుదయగిరి, కొండవీఁడు దుర్గముల గెలుపొంది దక్షిణాంధ్ర తీర భూమి పై యథాతథ ముగ రాయల యధికారము నెలకొలిపెను.

కాని మహామాత్యునకు అసంతృప్తిగనే యున్నది. వీరభద్ర గజపతి పరిపాలనమున నున్న యద్దంకి, వినికొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము,— లోనగు దుర్గములఁ గొనె నను విషయ మెఱిఁగి రాజమహేంద్రవరమును బరిపా లించు చున్న ప్రతాపరుద్ర గజపతి కొమారుఁ డెంత ప్రతిఘ టించినను బ్రయోజనము లేకయ యవలీలఁ గైకొనఁబడియెను. 'మనుచరిత్ర' యందు

"సైన్యస్తోమోత్థ రజో వ్రజస్థగిత కృ
ష్ణా గౌతమీ మధ్య భూ
మ్యస్తో కోత్కల రా ట్పురీ హరణ.
... ... ... ..."

—అని పెద్దనామాత్యుఁడు కృష్ణదేవరాయల సంబోధించి యుండుట వలన నతఁడు వేఁగిదేశమును జయించె నని చెప్ప వచ్చును. అంతతోఁ దనివోక తెలుఁగు రాజ్యమునకుఁ జెందిన

దుర్గములను - అనంతగిరి, ఉండ్రకొండ, ఉర్లగొండ, అరువ పల్లి, జల్లిపల్లి, కందికొండ, నల్లగొండ, రాజుకొండ, దేవర కొండ, కంభముమెట్టు, కనకగిరి, శంకరగిరి — మొదలగు వానిని సాధించినట్టు రాయుల శాసనములలోను సమకాలి కాంధ్ర ప్రబంధము లందును, - గలదు. పిదప జమ్మిలోయను జొచ్చి సింహాద్రి, పొట్టునూరులను జయించి యట జయస్తంభ మును బాతి నట్టు లీ క్రింది —

"ఇది సింహాచల దంభకేసరి పదా
భీష్టార్చనా పుణ్య ల
బ్ధ దురుట్టంకణ పొట్టునూరి విజయ
స్తంభోప లోట్టంకితాం
క దృఢేష్టాక్షర కృష్ణరాయ నృప సం
జ్ఞా స్మృత్యామ్యుక్త మా
ల్యద నాశ్వాసవరంబు నాల్గవది హృ
ద్యంబై మహిం బొల్పగున్."

—అను నాముక్తమాల్యద పద్యము దెలుపు చున్నది.

చివఱకుఁ గటకమును ముట్టడించి తిమ్మసచివాగ్రణి బుద్ధికుశలత వలనఁ గృష్ణరాయలు కటకము వఱకుఁ గల దేశము జయించి నట్టు క్రీ. శ. ౧౫౧౭ వ సంవత్సరము నాఁటి యొక శిలా శాసనమునఁ జెప్పి యున్నది. కృష్ణరాయల సమకాలికుఁడైన 'న్యూనిజ్' చరిత్రకారుఁడు విజయనగరమునఁ జెఱయుం దున్న గజపతి కొమారుఁ డాత్మహత్యను జేసికొనె ననియు, నాతనితోపాటు చెఱసాల యుం దున్న తన రాణికిఁ

గూడ విషయ్యము పుట్టెల్ల నమ్మ నని భయంపడి గజపతి తిమ్మరుసయ్యకు రాయలతో సంధి యొప్పు లొనగూడునో తెలుప వలసిన దని లేఖ వ్రాసె ననియు, రాయలకు రుచీదేవి నిచ్చి యుద్వాహ మొనర్చి కొనుటయె సంధి సేకూరుటకు న్యాయమే యని తిమ్మరుసయ్య ప్రత్యుత్తరించె ననియు, నిది విని గజపతి తన కొమార్తెను రాయలకిచ్చ కంపె ననియుఁ,—గాఁగా;నా మెను గాంచి, సంతోషించి, రాయలు వివాహము సేసికొనె ననియు నద్దాన వారిర్వురకును సంధి కుదిరిన దనియు,— వ్రాసి నాఁడు. ఇతని వ్రాఁత విశ్వసింపఁ దగినదే యని తోఁచెడిని. 'పగిలెఁ గటకంబు'— అని యొక చాటువు నందును, మను చరిత్ర యందుఁ 'గటకపురిఁ గాల్చె' ననియుఁ,— గలదు.

ఇది జరగిన తర్వాత 'ముదిగల్లు' దుర్గమును గూడఁ క్రీ. శ. ౧౫౧౬ వ సంవత్సరమున ముట్టడించి విజయపతాక నెగురవైచెను. దీన "సాంధ్ర సామ్రాజ్య స్థాపనాచార్య" బిరుదు మహామాత్యుఁ డగు తిమ్మరుసయ్యకు లభియించెను. దానఁ బుట్టె గంగనామాత్యుని కోర్కియు ఫలించెను. ఈ కోర్కి నెఱవేఱుట కన్నివిధముల నన్నయగు తిమ్మరుసయ్యకుఁ దోడ్పడిన వాఁడు గోవిందరాయలు.

ఇవ్విధముగఁ దిమ్మ సచివేంద్రుఁడు నలుబదేండులు మహామాత్యాది బిరుద చిహ్నములతో రంగరంగ వైభోగము లతో విద్వాంసుఁడై, శౌర్యధనుఁడై, యజరామర మగు కీర్తి నార్జించిన వాఁడు. ఇతని తమ్ముఁడును బ్రచండ దళవాయి యై

నగర సంరక్షకుఁడై కొండవీటి నగర ప్రతిష్ఠ నిలిపి నల్దెసల యశోలతలఁ బ్రాఁకించి నాఁడు.

శ్రీ కృష్ణదేవరాయల నాఁటి మంగళగిరి నృసింహస్వామి యాలయ స్తంభశాసనము సప్త సంతానములు తిమ్మ సచివుఁడు సేసినట్టు లవగత మొనర్చు చున్నది.

"పుత్త్రారామ తటాక దేవసదన
బ్రహ్మప్రతిష్ఠా నిధి
కావ్యం చేహ పరత్ర సౌఖ్య జనకా
స్సంతాన కా స్సప్తతాః
ఆ వృత్తా న్గణ నాతివర్త కృతవా
నాసేతు శీతాచలం
శ్రీకృష్ణ క్షితిపాల మౌళి సచివః
శ్రీ సాళ్వ తిమ్మ ప్రభుః".

(Ep. End. Vol; P. 119)

‘చంద్రగిరి’ రాజధానిగా నేలిన

**వీర వేంకట పతిరాయల ప్రధాన మంత్రి**

# తరిగొప్పుల దత్తన

(క్రీ. శ. ౧౬ వ శతాబ్దము)

---

విజయ నగర చక్రవర్తు లగు వీర వేంకటపతి రాయల యొద్ద దత్తన కార్య కర్త (ప్రధానామాత్యుఁడు, Prime Minister) గా నియుక్తుఁ డయి నట్టు ‘చంద్రభాను చరిత్ర’ మందలి

“... ... వెలయు
దత్తన మంత్రి మహా విపక్ష దు
ర్మద బల మర్మ దాభరణ ధు
రంధర సంగర చాతురీ విశా
రదుఁ డగు వేంకటక్షితి పు
రందరు నప్రతిమాన రాజ్య సం
పదలు భరింప నాకు లిడు
భవ్యగతి శ్రితపారిజాత మై.”

—అను (ప్ర. ఆ; ౩౮ ప.) పద్య మవగత మొనర్చు చున్నది. క్రీ. శ. ౧౫౮౬ వ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. ౧౬౧౪ వ సంవత్సరము వఱకు వేంకటపతి రాయలు

రాజ్యము సేసినాఁడు. గావున నాతని ప్రధానామాత్యుఁ డగు దత్తన మంత్రియు నా కాల మందె తేజరిల్లె ననుట యుక్తము.

'వసుచరిత్ర' కృతినాథుం డగు తిరుమలరాయల కొమాళ్ళలో నాల్గవ వాఁడే యీ వేంకటపతి రాయలు. అళియ రామరాయల సోదరుఁడు తిరుమల రాయలు. క్రీ. శ. ౧౫౬౫ దవ సంవత్సరమునఁ బ్రవర్తిల్లిన 'తాళికోట' యుద్ధములో రామరాజు సనిపోయిన తర్వాతఁ దిరుమల రాయలు సదాశివరాయుని ముఖ్యమంత్రిగా నుండి క్రీ. శ. ౧౫౭౦ దవ సంవత్సర ప్రాంతమున సదాశివరాయలు సనిపోఁగాఁ దిరుమల రాయ లా రాజ్యము నాక్రమించి మూఁడేఁడులు మాత్రము పరిపాలించెను. ఆవల ఆతని రెండవ కొమారుఁ డగు శ్రీరంగ రాయలు క్రీ. శ. ౧౫౭౪ వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చినట్లు శాసనా ద్యాధారము లగపడు చున్నవి.

తల్లికోట యుద్ధము (Battle of Talikota) జరగిన తర్వాతఁ దురుష్కులు విజయనగరము పై నండెత్తి దానిం గొల్లఁగొట్టి బుగ్గి యొనర్చి యుండుటచేఁ దిరుమల రాయలు "పెనుగొండ" (అనంతపుర మండలము లోనిది) ను రాజధానిగాఁ జేసికొనియెను. ఇతని యనంతర మీతని రెండవ కొమారుఁడు శ్రీరంగరాయలును, నాల్గవ కొమారుఁడు వేంకటపతిరాయలును,- రాజ్యము సేసిరి. శ్రీరంగరాయుని పరిపాలనా కాలములో 'బిజాపుర' నవాబులు (Bijapur Nababs) 'పెనుగొండ' ను లాఁగికొనుటచేఁ 'జంద్రగిరి' శ్రీ రంగ రాయునికి రాజధాని యయ్యెను. వేంకటపతి రాయలు పరిపా

లనమునకు వచ్చునప్పటి కి 'చంద్రగిరి' యే రాజధాని. వీర వేంకటపతి రాయల కాలములో 'వేలూరు' రాజధానిగా నేర్పడియె నని

"తనకు వేలూరు వర రాజధానిఁ గాఁగ
వీర వేంకటపతి రాయ విభుఁడు మిగుల
ధరణిఁ బాలించె ధర్మ తత్పరతఁ జెలఁగి"

—అను 'రామరాజీయ' పద్య మవగత మొనర్చు చున్నది. నాఁటినుండి యది 'రాయల వేలూరు' గాఁ జె న్నలరు చున్నది.

క్రీ. శ. ౧౬౭౮ వ సంవత్సరమునకు ముందె తిరుమల రాయని పరిపాలన మంత మయ్యెను గాన నతఁడు కృతిఁబొం దిన 'వసుచరిత్రము' క్రీ, శ. ౧౬౭౭ వ సంవత్సరమున రచిం పఁబడి యుండు ననియు, నీ గ్రంథ రచనానంతరము ముప్ప దేఁడులకు మల్లన కృత "చంద్రభాను చరిత్రము" రచింపఁబడి యుండు ననియుఁ,— దెల్ల మగు చున్నది.

తిరుమల రాయలు బ్రదికి యుండఁగనే కొమాళ్ళచేఁ గొన్ని తావుల నేల్బడి సేయింపుచుఁ దాను విద్యా గోష్ఠి వినో దము లందె నిరంతర ముండుచుండె నని "సమదరి నృపమాళి స్తోమ నీరాజితాంఘ్రిః"— అను 'శ్రుతి రంజనీ' పద్యచరణ మవగత మొనర్చు చున్నది. వేంకటపతి రాయలు

"ద్విజరాజ కార్శ్యము ల్దీర్చు నీ విభుకీర్తి
ద్విజరాజ కార్శ్యము ల్దీర్చు టరుదె

యాజ భవస్ఫూర్తి నడరు నీ నృపుశౌర్య
మాజి భవస్ఫూర్తి నడరు టరుదె
యతి సురభి ఖ్యాతి నలరు నీ ఘను నీఁగి
యతి సురభిఖ్యాతి నలరు టరుదె
చంద్ర గోత్ర శ్రీ లొసంగు నీ పతి కల్మి
చంద్ర గోత్ర శ్రీ లొసంగు టరుదె
యనుచు బుధు లెన్నవలయు రాజాధిరాజ
రాజపరమేశ సకల కర్ణాట కాంధ్ర
రాజధౌరేయ తిరుమలరాయ తనయ
చంద్రుఁ డగు వేంకటపతి క్షితీంద్ర మణికి.

"సర్వతోముఖ వృత్తిఁ బన్వ నౌర్వ మహాగ్ని
యదు మెల్ల సింధుదేశోద్భటంబు
దీర్ఘ కాలస్ఫూర్తి దీపించు విలయాగ్ని
బెడిద మెల్లను సమీరాపిత శకంబు
భీమరో షోద్వృత్తిఁ బెనుపొందు ఫాలాగ్ని
పెం పెల్లను విదేహ భీషణంబు
బహుసత్త్వ భీకర ప్రౌఢిఁ బొల్చు దవాగ్ని
తేజమెల్లను విమర్దిత వనాయు
వహహ యని సింధు శక విదేహక వనాయు
లాదిగాఁ గల నిఖిల దేశాళి నెల్ల
రాయిడించునె తిరుమలరాయ వేంక
టావనీంద్ర భుజ ప్రతాపాగ్ని కరణి.

"రమణీయాత్మకర ప్రసరూక్ష వసుధా
        రాలాభనం దద్భుతో
త్తమ నిత్యాన్న వితీర్ణి సర్వ సుమనో
        దైన్యంబు వారింప భూ
రమణీ ధేను గజేశ్వ రాత్మక బహు
        శ్రీ లిచ్చు శ్రీ వేంకటే
శ మహీవల్లభు సాటియే విధుఁడుఁ ద
        జ్జన్మక్రియా క ర్తయుణ్.

"మిథ్యాభిమాన సమ్మిళితుల వివరణ
        కలి తో త్తరంగులఁగా నొనర్చుఁ
గలనైన ధర్మకౌశలము నేమఱి వా
        రలకు హేమాద్రి మార్గంబుఁ దెలుపు
నతి నయ జల్పాభిరతుల వీక్షించి చిం
        తామణి హస్తగతంబుఁ జేయుఁ
బ్రబల తంత్ర విచారపారీణు లగు వారి
        దొరసి ప్రాభాకర సరణిఁ జూపుఁ

    దత్తదధికారులకు నిట్లు తదుపయోగ్య
    గతులఁ గఱపెడు గురువై యఖండ సమర
    విజయ వేంకటపతిరాయ భుజ కృపాణ
    మఖిల దర్శనాద్భుతశక్తి నతిశయిల్లు.

"ధీర వతంస వేంకట ప
        తి త్రుటి తార సితాత పత్త్రము

లూర్ఛరి జవంబునం దిరుగు
　　బోరులఁ ద జ్జయులక్ష్మికిం దిగం
భోరుహనేత్ర లెత్తు తెలి
　　ముత్తెపు టారతి పళ్లెరంబు లై
చారు తదీయ హేమ కల
　　శంబులు దీవియ లై వెలుంగఁగన్.

"వేంకట భూవరుం జెనకు
　　వీరులు తూఱఁగ నైనఁ గంటిరో
బంకరుహోష్ఠ బింబము వి
　　భాసిలు నాజి న సృగ్ధరంబులన్.
సంకుల వృత్తిఁ ద ద్వరణ
　　సంభ్రమ సంభ్రమ దాదితేయ తా
టంకవతీ పదాంబుజ హా
　　రచ్యుత నూపుర రాజమో యనన్."

—ప్రసిద్ధిఁ గాంచెను. ఇ వ్వేంకటపతిరాయల కటాక్షవీక్షా గౌరవమున నతి శాశ్వత లక్ష్మీ వైభవముఁ గాంచిన 'తరిగొప్పు' లాన్వయమున భూజనశ్రేణి సంభావింప మల్లన - నాగమ్మల గర్భశుక్తి ముక్తాఫలం బనఁ దన ప్రభావములు ధర ననంత ధృతి సమాసాదనంబునఁ దేజరిల్లెడి నరసయామాత్యుఁడు జనియించెను.

ఈ నరసయ్య బుధానంద ప్రదానూన దాన రసామాన్యయశో విశోభితుఁడు. ఆశ్రిత బాంధవావన పరుఁడు. దిగంత శ్రేణి గంధర్వ కిన్నర సామా త్యభిరామ శుద్ధ తర

గాంధర్వైక సంస్తుత్యుఁడు. అనంతపద చింతాపావనుఁడు. అట్లని "చంద్రభాను చరిత్ర" యందలి

"తన నిశాత కృపాణియును భాణియును బతి
శ్లాఘనా ధురీణ నిరాసమును ఘటింపఁ
దన కరుణా సారమును సారమును నరి
శాసనస్మయ నివాసనము చలుపఁ
దన సద్గుణ నికాయమును గాయమును సుధా
కిరణ విస్ఫురణ ధిక్కృతి యొనర్పఁ
దన మనీషా భోగమును భోగమును సుధాం
ధః ప్రధానా వధూననముఁ దెలుపఁ

దన ప్రభావంబు భావంబు ధర ననంత
ధృతి సమాసాదనంబునఁ దేజరిల్ల
వఱలు నాశ్రిత బాంధవావన పరుండు
మంత్రి మాత్రుండె నరపయామాత్య వరుఁడు.

"చతురాస్యానన పాళిక న్మెలఁగు నం
చ త్పాండు పద్మాసన
స్థితి దీపించు వినిర్మలాంబర రుచి
శ్రీమించు హంసాళి న
ప్రతిమా నోన్నతిఁ దోఁప నాఁడుఁ దిలకిం
పఁ శుద్ధ వర్ణాధి దే
వత గాదె నరస ప్రధాన మణి దీ
వ్యత్కీర్తి యశ్రాంతముణ్.

"నర సామాన్య చరిత్రుండే ధర బుధా
నంద ప్రదానూన దా
న రసామాన్య యశోవిశోభిత దిగం
త శ్రేణి గంధర్వ కి
న్నర సామా త్యభిరామ శుద్ధతర గాం
ధర్వైక సంస్తుత్యుఁ డా
నరసామాత్య వరుం డనంతపద చిం
తా పావనుం డెంతయుఁ."

—అను (ప్రి. ఆ; ౨౮, ౨౯, ౩౦, ప.) పద్యము లవగాహ మొనర్చు చున్నవి. ఇతని యర్ధాంగి తిప్పాంబ. ఈమె విజిత భర్తృ దేవతా జన నికురుంబ. అన్నదానమున, సద్గురు పరిచర్యను, బంధురక్షను, ఆర్త సంరక్షణమున, శీలస్ఫూర్తిని, నిత్య సూనృత యుక్తిని, నతుల భాగ్య లక్షణమునఁ, గారుణ్య వీక్షణమునఁ, బరమ ధర్మాసక్తినిఁ,— పేరెన్నికఁ గాంచి సకల సన్నుత చర్య యని యనిపించి కొనిన దని

"వెలయు నాతని దేవేరి విజిత భర్తృ
దేవతాజన నికురుంబ తిప్పమాంబ
బహు మహా భోగముల నుంచు భర్తకుఁ దల
వంపు లొనరించిన ధరిత్రి పెంపుఁ దెగడి.

"సకల సన్నుత చర్య సద్గురు పరిచర్య
పావన యదువర్య పద సపర్య
యన్నదాన ఖ్యాతి యనఘ సాధ్వీ నీతి
నియతార్య జన తాతిశయ వినీతి

బంధురతా శక్తి పరమ ధర్మాసక్తి
నిత్య సూనృత యుక్తి నిర్మలోక్తి
యాశ్రితాశాపూర్తి యలఘు శీలస్ఫూర్తి
బహుల సతీముఖవర్తి భవ్యకీర్తి
యార్త సంరక్షణంబును సకల భాగ్య
లక్షణంబును గారుణ్య వీక్షణంబు
సహజ సిద్ధంబు లీ పుణ్యచరిత కని ను
తింపఁ బొగడొందు నరసయ తిప్పమాంబ.

“గురు పరిభూతి లేని సతి
గోత్ర భరస్థితి లేని యుర్వి సో
దర పరిపాలనా విముఖ
ధామ విహారము లేని కల్మి బి
త్తరి యని బాంధవాశ్రిత వి
తానము సన్నుతిఁ జేయఁ బొల్చు నా
నరసయ ‘తిప్పమాంబ’ భువ
నస్తవనీయ గుణావలంబి యై.”

—అను పద్యము లవగత మొనర్చుచున్నవి. ఇ పుణ్య దంపతులకు ౧. అప్పన ౨. దత్తన ౩. మల్లన యను వార లుదయించి రని ‘చంద్రభాను చరిత్ర’ మందలి

“అత్రి ప్రభవుఁడా నృసింహుఁడనసూ
యాత్యంత సంస్తుత్య చా
రిత్ర శ్రీనిధి తిప్పమాంబ వలనం
బ్రీతి న్సుధాసిక్త ని

త్య క్తాన్నైక ధురీణు నప్పవిభు నే
కాంతానంద పూర్ణేందు న
క్తా త్రేయాహ్వయు మల్లికార్జునుని నా
ర్యాసక్తుఁ గాంచె న్మహిన్,"

—అను పద్యము విదితము సేయుచున్నది. అం దప్పన విభుఁడు 'నిరతాన్నదాన నిధి' యని

"అనవరతాన్నదాన నిధి
యౌ నరసప్రభు నప్పనార్యు నీ
డనఁ దగునే సుతాపరిచ
యంబున వేల్పుల కొక్కనాఁడు భో
జన మతిశీతలం బిడిన
సాగరరాజుఁ బదింటనైన దిటన్
ఘనరుచిఁ దక్క నొక్కొకని
గ్రాస మొసంగు తుషార భానుఁడున్."

—అను పద్యము సువిదిత మొనర్చుచున్నది. అంతియ కాక ఇతఁ డాశ్రిత ద్విజనాయకావనుఁ డైత దిష్టైక సంపద నొడఁగూర్చు లోకబంధుఁ డని

"తన దిక్కుఁజేరు మిత్రునకుఁ దేజము మించఁ
దగు సర్వమంగళోత్పాదకుండు
ఘనుల నానా దిగాగతులఁ గైకొని పూర్ణ
జీవనం బొసఁగు లక్ష్మీ గురుండు

వర ధర్మమున గోత్ర పర్గంబు త్రావు
లెనయించి నిలిపిన ఘన సమాఖ్యుఁ
డాశ్రిత ద్విజనాయకావనుం డై తది
షైక సంపదఁ గూర్చు లోకబంధుఁ
డరయఁగఁ బ్రధాన మాత్రుండే యఖిల వినుత
మాధ్వ దర్శన ధౌరేయ మాన నియమ
పరమ హరిగురు చరణాబ్జ భజనపరుఁడు
మంత్రి నరసయ్య యప్పనామాత్య వరుఁడు."

—అను పద్యము రూఢి సేయు చున్నది. ఇతని తమ్ముఁడే దత్తనామాత్యుఁ డని

"తదనుజ రత్న మై వెలయు
దత్తన మంత్రి మహా విపక్ష దు
ర్మద బలమర్మ దారణ ధు
రంధర సంగర చాతురీ విశా
రదుఁడగు వేంకట క్షితి పు
రందరు నప్రతిమాన రాజ్య సం
పదలు భరింప నాకు లిడు
భవ్యగతి శ్రితపారిజాత మై."

—అను పద్యము దెలుపు చున్నది. దత్తనామాత్యుఁడు తిరుమల రాయేంద్ర భూరి పుణ్యరాశి యగు వేంకటోర్వీశు ప్రాయసములు ప్రాయు చాతుర్యమున నిజ స్వామి హిత

విధాన సుర మంత్రి యనియు, ద్వీపాంతర రక్షాపాకర్షణ స్ఫుర
ణుం డనియు—

"వర్ణంబులనె కాదు వర వృత్తతా స్ఫూర్తి
సన్నుతోభయవంశ జనుల యందుఁ
బత్త్రింబులనె కాదు పంక్తి శోభ సదా ప్ర
దీయమానాన్న భుగ్ద్విజుల యందు
వాచికోక్తినె కాదు సూచితార్థ బహుత్వ
మతుల సత్కవి బుధాశ్రితుల యందు
లిఖన క్రియనె కాదు లీలా శుభానం
బాన తారాతి ప్రధాను లందుఁ
బొరయుఁ దిర్మలరాయేంద్ర భూరి పుణ్య
రాశి యగు వేంకటోర్వీశు వ్రాయసములు
వ్రాయు చాతుర్యమున నిజస్వామి హిత వి
ధాన సురమంత్రి నరసయ దత్తమంత్రి.

"అరుదార స్వరపత్త్రి వృత్త యయి ద
త్తాత్రేయ సంస్పర్శ నా
క్షర యోగోన్నతిఁ గన్న లేఖిని మహా
గర్వాంధ సామ్రాజ్య సం
హారణం బున్నత రాజ్య సంభృతియు ద్వీ
పాంత రక్షాపాకర్షణ
స్ఫురణంబు న్బహుదేశ వస్తు భరణం
బుం గాంచు నంచద్గతిన్.

"యాదవాగ్రజుని పటాటోప మెల్లఁ గొ
 రీవిభు సుగ్రీవభావ మెల్లఁ
గుముదాప్త మండల క్రమణ చిహ్నం బెల్ల
 నుడు పరంపర నుండు నునికి యెల్ల
సిరిఁగన్న తండ్రి యాంతర మెల్లఁ బలుకుల
 కొమ్మయుఁ దలయెత్తి కొనుట యెల్ల
శేషపన్నగము నున్మేషనైఖరి యెల్లఁ
 జదలు ద్రొక్కని కడిఁది చాయ యెల్ల
నగి తెగడి మీఱి కేరి తృణం బొనర్చి
యడఁచి కారించి వారించి యడఁచు నే వి
వేకనిధి కీర్తి యతఁ డొప్పు వేంకటాద్రి
దత్త సామ్రాజ్య విభవుండు దత్తమంత్రి.

"ఘన గోత్రోద్ధరణం బసంఖ్య సుకవి
 గ్రామ ప్రదానైక సా
ధన సద్భావ ధురంధరత్వము మహో
 దర్పోద్ధతారి ప్రథా
న నిరాసోద్భట పాటవంబు నిరవాం
 ద న్దత్తనార్యుండు శ్రీ
దనరు న్వేంకటరాజ దక్షిణ భుజా
 దండా విశేష స్థితిన్."

—అను 'చంద్రభానుచరిత్ర' మందలి పద్యము లవగాహ
మొనర్చుచున్నవి. 'చారు చంద్రోదయ' మందలి "రమణ
వేంకటపతి రాయేంద్రుఁడు నుతింపఁ

"బటుకార్య దక్షుఁడై ప్రబలినాఁడు"

——అను పద్య పాదము "దత్తన మంత్రి" వేంకటపతి రాయ లతిశయముగఁ గీర్తించు నట్లుఁ బటు కార్య దక్షుఁడై ప్రబలి నాఁ డని తెలుపు చున్నది.

ఇ మ్మతిమంతుఁ డాఱువేల నియోగి బ్రాహ్మణ శాఖకుఁ జెందినవాఁడు, మధ్వమతము నవలంబించిన స్వతంత్ర కపి (కౌశిక) స గోత్రుఁడు. తండ్రి నరసయ్య, తల్లి తిప్పమ్మ. సత్తెనపల్లె తాలూకా యందలి 'రాజనాపుర' వాస్తవ్యు లని 'కొండవీటి దండకవిలె' వాకొను చున్నది. ఈ శాఖవారు కొందఱు పూర్వము విజయనగరము లోనగు దూరప్రదేశము లకుఁ జని యచ్చట రాజకీయాది యున్నత పదవుల నంది సత్యుచ్ఛస్థితి నధివసించి ప్రసిద్ధి వహిసిరి. వారిలోఁ గొందఱు మధ్వమత మవలంబించిరి. కావున వీరిని నార్వేల నియోగి మాధ్వ లనఁ జెల్లును. ఇట్టి వా రిప్పటికిని దిరువనంతపుర (Travancore), మహిశూర (Mysore) రాజ్యములలో న నేకులు గలరు. పూర్ణయ్య మంత్రి యీ శాఖా బ్రాహ్మణుఁడే!

'తంజాపూరు'ను బరిపాలించిన

## అచ్యుతప్ప నాయని మహామంత్రి

# రాయసము గోవింద దీక్షితులు

(క్రీ. శ. ౧౬ వ శతాబ్దము)

---

చెవ్వప్ప నాయకుఁడు తంజాపూరును బరిపాలించుచుఁ గ్రీస్తు శకము ౧౫౬౧ వ సంవత్సర ప్రాంతమునఁ దన కొమారుఁ డగు నచ్యుతప్ప నాయకుని యౌవరాజ్యమున కభిషిక్తు నొనర్పఁగా, నతఁడు రాజ్యపాలనమునఁ దోడ్పడి రాజ్యమునఁ గుశలుం డని పే రందెను. అక్కాలమున 'తంజపురి' (Tanjore) రాజ్యమునకుఁ జెవ్వప్ప నాయఁడే ప్రభు వయ్యును రాజకీయ వ్యవహారముల నన్నిఁటిని అచ్యుతప్ప నాయఁడే సూఁచు చుండెను. తంజాపూరు నాయక రాజులలో నితఁడే 'మహామంత్రేశ్వర' బిరుదమును వహించినవాఁ డనియు, నితని నాఁటి నుండియె యీ రాజ్యమునకు రూపురేఖ లేర్పడె ననియు, — నూహింప నను వగుచున్నది.

ఇతని కాలము నుండియుఁ 'దంజపురి' నాయక రాజులు (Tanjore Nàyak Kings) విజయ నగర చక్రవర్తు (Vizianagar Emperors) లకు సామంతులుగ నుండి యీ సింహాసనమునకు నలుబది లక్షల వరహాలు కప్పము

సెల్లించుచు, యుద్ధావసరములలో దోడ్పడుట కయి ౧౫౦ ఏనుఁగులను, ౪ వేల యాశ్వికదళమును, ౧౦ వేల కాల్బలమును, – బోషించుచుండెడివారు.

అచ్యుతప్ప నాయని కాలమున విజయనగరమును సదాశివరాయలు, తిరుమల రాయలు, శ్రీ రంగరాయలు, వేంకటపతిరాయలు, – నను వార లేలిరి. తుళువ వంశజుఁడైన సదాశివరాయల తర్వాత విజయనగరము నేలిన వా రందఱును 'ఆరవీఁటి' వంశ్యులే! అచ్యుతప్పనాయుఁడు పేరునకు విజయనగర చక్రవర్తుల సామంతుఁడుఁగ నున్నను యథార్థముగ స్వతంత్రుఁడుఁగనే యుండుచుండెను. గాని క్రీ. శ. ౧౫౮౪ వ సంవత్సరము నాటికే అచ్యుతప్ప నాయకుఁడు మరల విజయనగర సామ్రాజ్యమునకు విధేయుఁ డయ్యెను.

అచ్యుతప్పనాయని యోగ్యతలు 'సంగీత సుధ' పీఠికలో

"తత్త్రాద్యశైద్ధర్మ భరై రముష్మా
దావిర్బభూ వాచ్యుత భూమిపాలః,
మూర్త్యంబికాయాం జగదంబికాయాం
బాలేందు మాళే రివ బాహులేయః,
ఆరభ్య బాల్యా దతిభక్తిశాలీ
... ... ... ... ... రంగనాథం."
అవాప్య తంజాపుర మప్రతీపః
కౌమార ఏవాభృత రాజ్యభారః,
గజై రనేకై స్తురగై రభఙ్గైశ్చ
నిర్జిత్య సామంత నృపాల వర్గమ్.

సంపాద్య దత్తేస్మ సమస్త మర్థం
శ్రీరంగ నాథాయ తథా ద్విజేభ్యః,
రంగేశితు ర్దివ్య మసౌ విమానం
హైరణ్మయం రత్నమయం కిరీటమ్.

మణిమయం వర్మచ నిర్మమితాతే
సింహాసనం స్మ క్షితిపాల సమః,
తస్యైవ పూర్వోత్తర పశ్చిమాని
సద్గోపురా ణ్యప్రతిమ ప్రభాని.

ప్రాకార మ ష్యష్టమ మాతత నిష్ట
మహాసనం చాపి మహీ మహేంద్రః,
లక్ష్మ్యాశ్చ సర్వా ణ్యపి మండపాని
దివ్యాని రత్నాభరణా న్యతానీత్.

ఆరోహ మార్గం చ మరుద్వరాయా (?)
మలంక్రియా భావ ముపేయ మాంసమ్,
ఆరామ సీమా మపి రంగ భర్తు
ర్గ్రామా ననేకా నపి సవ్యతారీత్.

దానం తులాపూరుష మచ్యుతేన్ద్రో
హిరణ్య గర్భమ్ ప్రతివర్ష మేవ,
హేమాద్రి కల్పే కథితాని సమ్యక్
సర్వాణి దానాని ముహు ర్వ్యతానీత్.

రామేశ్వరస్యాపి చ గోపురాణి
తీర్థాని సర్వాణి నవీ చ కార,

సందర్శనం కించ స రామసేతోః
రసావకార్ష దనువర్ష మేవ,
దినేదినే భోజయ దేవ లక్షాధికా
న్ద్విజా నచ్యుత భూమిపాలః;

—అని యుట్టంకింపఁబడి యున్నది. రాజచూడామణి దీక్షితుని "రుక్మిణీ పరిణయ" మహాకావ్యములోఁ గూడ

"మాయూర మధ్యార్జున కుంభఘోణ
శ్రీ చంపకారణ్య ముఖ స్థలేషు,
మహత్తరం 'మండప' మాతతాన
భక్త్యా మహాత్మాపర మచ్యుతేన్ద్రః,
అగ్రా ననేకా నపి చాగ్రహారా
న సౌ వ్యతారీ దవనీ సురేభ్యః,
శౌర్యేచ ధైర్యేఽపి చ దానకేళ్యాం
సమో నకశ్చి ద్ధరణీ భృదస్య."—

అని యున్నది. ఇమ్మహీజానికి గోవింద దీక్షితుఁడు సచివోత్తముఁడుగా నుండెను. గోవింద దీక్షితుఁడు మహామంత్రజ్ఞుఁడు. మహాకవి. గాయకాగ్రసరుఁడు. మహాయజ్వ. అప్పయ్య దీక్షితులవంటి పండితాఖండలుఁడు. మీమాంసా శాస్త్ర సంబంధ మగు చర్చల నప్పయ దీక్షితులతోఁ గావించె నఁట!

ఇమ్మహామహుఁడు మీమాంసా శాస్త్రము పయి స్వతంత్రించి గొప్ప గ్రంథముల విరచించుటయే గాక సాగ్ని చిత్య సర్వతోముఖాతిరాత్ర సాగ్ని చిత్యాప్త వాజపేయాది

యజ్ఞముల నొనర్చినాఁడు. "పదవాక్య ప్రమాణ పారావార పారీణ, అద్వైత విద్యాచార్య" బిరుదముల నందినాఁడు. ఇతని యాజ్ఞ వహించి దాల్చియే రఘునాథరాయలు 'సంగీత సుధ'ను రచించినాఁడు. ఈ గ్రంథమునకు గోవింద దీక్షితుఁడు 'పీఠిక'ను వ్రాసినాఁడు. ఈ పీఠిక వలనఁ జెవ్వప్పనాయకుఁడు బ్రదికి యుండఁగనే యచ్యుతప్ప నాయకునకు రఘునాథరాయ లుదయించె నని యవగత మగు చున్నది.

రఘునాథరాయలకు విద్యా బుద్ధుల నేర్పి రాజ్యభార వహ నొనర్చుట కయి యచ్యుతప్ప నాయకుఁడు మహామాత్య శేఖరుం డయిన గోవింద దీక్షితుఁడు దన కొమాళ్ళతో పాటు రఘునాథరాయలను గూడ మహావిద్వాంసు నొనర్చెను. గోవింద దీక్షితుఁడు సేసినయజ్ఞములలో నతని జ్యేష్ఠకొమారుఁ డయిన యజ్ఞనారాయణ దీక్షితుఁడే యధ్వర్యుఁడు. ఆ యజ్ఞములలో నచ్యుతప్ప నాయని యాజ్ఞ ననుసరించి యువరాజయిన రఘునాథరాయలు గోవింద దీక్షితునకు ముత్యములు వొదిపిన శ్వేతాతపత్త్రము వట్టియుండెడి వాఁ డఁట !

అచ్యుతప్ప నాయనికిని గోవింద దీక్షితునకును,— అవిచ్ఛిన్న సంబంధ ముండినట్టు లీ క్రింది

"త్రి నామాద్యంత నామానౌ
మహీక్షి ద్దీక్షితౌ వృభౌ,
శస్త్రే శాస్త్రే చ కుశలౌ
వాహ వేషు హవేషు చ."

—అను శ్లోకము దెలుపు చున్నది. అచ్యుతప్పనాయకుఁడు బాల్యప్రభృతి మిక్కుల దైవభక్తిఁ గల్గియుండె నట్టు లీ క్రింది సంగీత సుధ" (౨౬ వ పొరట) యందలి.

"ఆరభ్య బాలా దతి భక్తిశాలీ
ముదా సదా౽౽ సేవిత రంగనాథమ్;
అవాప్య తంజాపుర మప్రతీపః
కౌమార ఏవాహృత రాజ్యభారః."

—అను వచన మవగత మొనర్చుటయే గాక కడు ముదుసలి యగు వఱకు బ్రదికి యుండి యావల రఘునాథరాయలకు రాజ్యమును విడచిపెట్టి శ్రీరంగ క్షేత్రమునకుం జని ముకుందానుచింతనమునఁ బ్రొద్దు వుచ్చె నని 'సాహిత్య రత్నాకరము' లోని

"సర్వాం ధైర్య విధూత మేరు విభవే
సర్వాం సహాయా భరం
ప్రౌఢేఽస్మిన్ రఘునాథ నామ్ని విదధ
త్పుత్రేఽచ్యుత క్ష్మాపతిః,
శ్రీరంగ స్థల సంగతో బుధకులం
శీతాంశు రుర్వీ మివ
ప్రాప్త స్సైనమ పుషోష శేషశయనే
భక్తః పరేధామని."

(౧౨-౯౮.) అను వచనము స్పష్టము సేయుచున్నది.

అచ్యుతప్ప నాయకుఁడు బ్రదికియుండఁగనే యతని నొప్పించి గోవింద దీక్షితులు రఘునాథరాయలను రాజ్యమున నభిషిక్తు నొనర్చి నట్లు 'సాహిత్య రత్నాకర' మునఁగలది.

"హర్షేణ తం తనుజ మచ్యుత భూవలారి
రత్రాభిషిచ్య వివిధై రుదధేః పయోభిః,
కన్యాగణై ర్భటవరై ర్గణికాభిరేవ
మప్యభ్యషేచయ దయం తదను క్రమేణ,
భద్రాసన స్థితి విధి ప్రథితం విభూత్యా
నిత్యాగ్నిహోత్ర భవయా నిటలే మహీన్ద్రో
ఆచంద్ర తారక మధీశ్వరతా నిధానం
గోవింద దీక్షిత గురుః కురుతేఽస్మ పట్టమ్." —

—అను వాక్యములవలనఁ దెలియనగు చున్నది. అచ్యుతప్పనాయఁడు శ్రీరంగనాథస్వామిని సేవించుచు శ్రీరంగ క్షేత్రమున నుండుచుఁ గ్రీస్తు శకము ౧౬౧౪ వ సంవత్సరమునఁ బరమ పదము నందెను.

రఘునాథరాయలు రాజ్యాభిషిక్తుఁ డయిన తరువాత గొన్నాళ్ళు లుండి యావల గోవింద దీక్షితుఁడు సనిపోయెను. ఆ మ్మహామాత్యుఁడు బ్రదికి యుండి నంతవఱకు రఘునాథ రాయలు దన యర్ధసింహాసన మొసంగి యాతని సముచితరీతి నాదరించి సత్కృతులఁ గావించినట్లు లగపించు చున్నది. మహా మంత్రి శేఖరుం డగు గోవింద దీక్షితుని యభీష్టము నను సరించియె. 'సంగీత సుధ'ను రఘునాథరాయలు రచించినాఁడు. తొలుత నిది యేఁ డధ్యాయముల గ్రంథము. కాని నాలు

గధ్యాయములే యిప్పు డగపడు చున్నవి. ఈ గ్రంథమున రఘునాథరాయ లేఁబది రాగములను బదియేను మేళకర్తలుగ విభజించి శ్రుతి - స్వర - ఆలప్తికల సైతము జేర్చినాఁడు. గోవింద దీక్షితుఁడీ గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసినాఁడు రఘునాథరాయలు జయంతసేనాది రాగములను రామానం దాది తాళములను గ్రొత్తఁగా రచించిన సంగీతకళా విచక్షణుం డని గోవింద దీక్షితుని

"జయంత సేనాదిమ రాగ
రామానందాది తాళాన్
రచయన్ నవీనాన్,
సంగీత విద్యాంప ముపా దిశత్స్వామ్
విపంచికా వాద విచక్షణానామ్.

—(J. O. R. Vol. III, P. 154) - అను వాక్యము దెలుపు చున్నది. రఘునాథరాయల యాస్థానమున సంగీత శాస్త్ర విశారదు లనేకు లున్నయట్లు

"వాగ్గేయకార ప్రముఖై రనేకై
ర్విచిత్ర గీతాది కళా ప్రవీణైః,
తథైవ వీణాదిమ వాదవిద్యా
విచక్షణైః క్వాపి నిషేవ్యమాణః"

—అను వచనము వలనఁ దెలియు చున్నది. ఇతని కొల్వు కూటము Darbar) న నుండు నట్టువల విలాస విభ్రమము లనే "శృంగార సావిత్రి" లో నక్షత్రపతి తపోభంగము సేయు టకు వచ్చిన యప్సరాంగనలకుఁ బోల్చి చూపినాఁడు.

గోవింద దీక్షితుఁడు "సంగీతశాస్త్ర విశేషము" - అను గ్రంథమును విరచించి నాఁడు. ఇందు డెబ్బదిరెండు ప్రస్తార మేళములు చెప్పఁబడి యున్నవి. ప్రకృతము వాడుకలో నుండిన కనకాంగి, రత్నాంగి, ఖరహరప్రియ, - లోనగు నవీ గ్రంథమున నగపడు చున్నవి. ఈ వేంకట మఖి గ్రంథముకంటెఁ బ్రాచీనమైనది గావున నీ ప్రస్తార పద్ధతి వేంకట మఖికి నాధార మయ్యె నని తెలియం దగి యున్నది.

"తస్మా ల్లక్ష్య ప్రధానం
తన్నతు లక్ష్మ ప్రధానకమ్"

—అని రామామాత్యుఁ డనుట వలన లక్షణము కంటె లక్ష్యమే ప్రధాన మని యవగత మగు చున్నది; కావుననే కాఁబోలు 'శార్ఙ్గ ధరుఁడు'

"యద్వా లక్ష్య ప్రధానాని
శాస్త్రా ణ్యేతాని మన్వతే"

—యని చెప్పఁజాలెను. వేంకటమఖి 'చతుర్దండి ప్రకాశిక'లో రఘునాథుని వీణమెట్టుల క్రమము నపేక్షింపక సప్త స్వరములకు సర్వకాలాబాధిత మైనయట్టు మెట్టుల 'సరస్వతీ వీణ' కు నేర్పఱచి డెబ్బదిరెండు మేళకర్తల నిర్ధరించిన ప్రజ్ఞాశీలి. అంతతోఁ దనివోక జయదేవుని 'గీతగోవిందము' ననుసరించి కాకర్ల త్యాగరాజు (ములికినాఁటి సీమ వాస్తవ్యుఁడు. భారద్వాజ గోత్రుఁడు; ఆఱువేల నియోగి బ్రాహ్మణుఁడు.) పై నిఱువది నాల్గు అష్టపదుల వివరించి నాఁడట!

రఘునాథరాయలు యౌవరాజ్యమున కభిషిక్తుఁ డయిన కొలఁది దినములకే శ్రీరంగదేవరాయల సోదరుఁడు వేంకటపతిరాయలు క్రీ. శ. ౧౫౮౬ వ సంవత్సరమున విజయనగర సామ్రాజ్యమున కధిపతి యై 'పెనుగొండ' నుండి యేల్బడి సాఁగించెను. అతని పరిపాల నారంభ దినములలోఁ దురుష్కులు 'పెనుగొండ' దుర్గమును ముట్టడించిరి. వేంకటపతి రాయలు పారసీకులు ద న్నెదిరింప వచ్చినప్పుడు రఘునాథరాయనిఁ దనకు సాహాయ్యముగఁ బంపవలసిన దని యచ్యుతప్ప నాయనిఁ గోరఁగా, నాతని యభీష్టమును బట్టి రఘునాథ నాయకుఁడు 'తంజావూరు' రాజ్యమునకు సామంతులుగ నుండిన పాళెగాండ్రను గూర్చికొని 'చంద్రగిరి' కిం జని యట నుండి కొలఁది దినములలోఁ బెనుగొండఁ జేరఁగా, అచ్యుతప్ప నాయని రాఁక విని శత్రులు విక్కలబలము నూపి గనియుఁ, జూపక నిలచి యున్న వారు సులువుగ నోడింపఁబడి రనియు—, "రామభద్రాంబ" వ్రాసిన 'రఘునాథాభ్యుదయ' మహాకావ్యమునఁ జెప్పఁబడి యున్నది.

తంజావూరి నాయక రాజులకును, ఇప్పటి నేపాళమున (జాఫ్నా) కును,—చాల సంబంధ ముండి యుండె నని 'సాహిత్య రత్నాకర, రఘునాథాభ్యుదయము'ల వలనను ఇంక నితర గ్రంథములఁ బట్టియుఁ,— దెలియం దగి యున్నది. చెవ్వప్ప నాయని నాఁట నుండియుఁ దంజావూరికిఁ గప్పము సెల్లించు సామంతరాజ్యముగా నేపాళ (జాఫ్నా) ముండె నని విదిత మగు చున్నది.

చోళ పాండ్యదేశముల రెండిటికి బరిపాలించుచు విశ్వ నాథ నాయఁడు విజయనగర చక్రవర్తులకు లోఁబడి యేల్బడి సాఁగించు చుండెడి వాఁడు కొన్నాళ్ళు బోయిన పిదప నచ్యుత దేవరాయల మఱఁదలు 'మూర్తిమాంబ' ను జెవ్వప్ప నాయఁడు వివాహము సేసికోఁగా, అచ్యుత దేవరాయలు స్త్రీ ధనము క్రిందఁ జెవ్వప్ప నాయనకుఁ జోళరాజ్యము నిచ్చి, యా రాజ్యమున నభిషిక్తుఁ జేసెను. కాఁగాఁ, జోళదేశమును బరిపా వీడ్కొలిపెను. కాఁగాఁ, జోళదేశమును బరిపా లించు వాఁడు ప్రత్యేకముగ లేనందున విశ్వనాథనాయనిఁ బంపుటయే గాక తనకు సంబంధించిన యొకరిని గూడ నియ మించినచో దాని స్వాధీనము సేసికోఁదగు నని యూహించి యీ నియామక మొనర్చెను. అచ్యుతదేవరాయల కోర్కి ననుస రించియే చెవ్వప్ప నాయఁడును గార్యవాది యయ్యెను. 'తంజపురి' (Tanjore) పీనికి రాజధాని (Capital) యాటయు, నది ద్రమిళదేశ (Tamilnad)మున నుండుటయు, - నక్క తనఁ దెలుఁగుదేశము నుండియె మంత్రులను, దండనాథులను, బండితులను, గవిశేఖరులను, గాయకులను, నర్తకులను, నట్టువరాండ్రను, - ఇంక నితరులఁ బెక్కుర్ఁ గొంపోయెను. అటులఁ గొంపోయిన వారిలో గోవింద దీక్షిత వంశ మొకఁడు.

గోవింద దీక్షితుఁడు వశిష్ఠ గోత్రుఁడు. రాయసాన్వయ పయఃపారావార రాకాసుధాకరుఁడు. భార్య నాగాంబిక. ఇతని పేరుతోఁ దంజావూరు జిల్లాలో గోవిందపురము, దీక్షిత సము ద్రము, - నను గ్రామము లేర్పడినవి. తొలుత గుంటూరు

సీమ నుండియె యి వ్వంశజు లా ప్రాంతములకుఁ జనుదెంచి తమ ప్రతిభావ్యుత్పత్తుల కనుగుణముగఁ దేజరిల్లిరి.

విద్వ దీశానులచే భాసమాన మైన యచ్యుతప్ప నాయని కొలువుకూటము (Darbar) శారదాదేవికిఁ గంఠాభరణముం బలెఁ దనరారు చుండెడిది. రఘునాథనాయఁడు సాహిత్య గ్రంథముల నన్నిఁటిని రచించిన తర్వాత 'శ్రీకృష్ణ చరిత్రము' నొక ప్రబంధముగ నిబంధింపు మని యచ్యుతప్ప నాయఁడే రఘునాథనాయనిఁ గోరె నఁట!

అ క్కృతనఁ బితృవాక్యమును బరిపాలించుటఁ బరమ ధర్మ మని యతఁడు తలఁచి యామధ్యాయంబునఁ 'పారిజాతాపహరణ' కావ్యమును రచించె ననియు, నందుల కచ్యుతప్ప నాయఁడు ప్రముదిత హృదయుం డయి రఘునాథుని పాండితీ విభవమునకును గళాచాతుర్యమునకును, – మిక్కిల సంతోషించి యాతనికిఁ గనకరత్నాభిషేకము సలిపె ననియు, – యజ్ఞ నారాయణ దీక్షిత విరచిత మగు 'సాహిత్య రత్నాకరము' న నుల్లేఖింపఁబడి యున్నది.

అచ్యుతప్పనాయఁడు కావేరి నదికి నానకట్ట (Anicut) నిర్మించి, ధర్మకార్యములఁ బెక్కులొనర్చి, – క్రీ. శ. ౧౫౭౭ లో మధ్వస్వామి యైన విజయీంద్ర తీర్థులకు గ్రామమును దాన మొసంగెను. మంత్రాలోచన మొనర్పవలసి వచ్చి నపుడు కోటలోని 'లక్ష్మీవిలాస భవనము' న

"స సుతో వసుధా సుధాకరోఽసౌ
సహ గోవింద మఖిందునా సభాయామ్

సమగా దథ తత్ర గోత్రభిదీ
స జయంతో గురుణా యథా మరాణామ్."—

— OLid 1··i) "భూపః ప్రాప ద్యతాథో సచివ సుత యుతో జాతు లక్ష్మీ విలాసః......"—(సాహిత్య రత్నాకరము, ౧-౨౯) మదుసలి వై కొమారుని జయము నపేక్షించు చున్న యచ్యుతప్ప నాయఁడును, రాజ్యము నెడలఁ, ప్రభువు పట్ల,—భక్తి విశ్వాసములు గల గోవింద దీక్షిత మహామంత్రియు, యౌవనమున నుండి శాత్రవ కంఠలుంఠనముచేఁ దన బాహు కండూతినిఁ బోగొట్టు కొనవలె నను నభిలాషముతో నున్న రఘునాథనాయఁడును,— సమావేశమగు చుండిరి. ఈ సభలలో గోవింద దీక్షిత మంత్రి శత్రుమర్దనము నకుఁ బ్రత్యేకముగ నొక్కొక్కర వంతునఁ దాఁకవలె నని సలహా నిచ్చు చుండెడి వాఁడఁట! అట్లని 'సాహిత్య రత్నాకర' మందలి,

"నిహతే యుధి చోళకే నృశంసే
నిహతా ఏవ భవంతి పారసీకాః,
నరనాథ నిజాశ్రయస్య బాధే
నయసిద్ధో న కి మాశ్రితస్య బాధః."

—అను (౧౦-౨౮.) వాక్య మవగత మొనర్చు చున్నది. ఈ సలహా ననుసరించుట వలన శత్రువు లొక్కుమ్మడిగాఁ బ్రతిఘటించుట కవకాశము లేక వారి వ్యూహము చెదరుట, తత్రాపి యపజయ మందుటఁ,—దటస్థించిన గోవింద దీక్షితుని పథకము నెఱవేఱు చుండెడిది.

రఘునాథ భూపాలుఁడు మహామాత్యుం డగు గోవింద దీక్షితుపై నెట్టి విశ్వాసము, గౌరవ మర్యాదలు,—గలిగి వర్తించెనో దిగ్విజయయాత్ర కయి పురము వెడలుచు రాజ్య భారము నంతను గోవింద దీక్షితుని పై నిడెనో అతఁడును రాజభక్తి పుంభావముతో రఘునాథ భూపాలునకు మాఱుగ రాజ్యము నెటులఁ బాలించెనో "సాహిత్య రత్నాకర"మందలి

"ఇతీరయ న్వచన మిలా బలాహితో
ధరాధురం నిజసచివే నివేశ్య చ,
సరోహితా త్సదసి సరోష మీక్షణా
దనీకినీ మథ సమనీ నహాత్ క్షణాత్."

—అను (౧౩, ౮౪.) వాక్యము దెలుపఁగలదు.

ఇమ్మహామంత్రికి యజ్ఞనారాయణ దీక్షితులు, వేంక టేశ్వర దీక్షితులు, నను కొమాళ్లే గాక లింగాధ్వరి యను నింకొక కొమారుఁ డున్నయట్లును దెలియుచున్నది. లింగా ధ్వరి యనువాఁడు వేదార్థ తత్త్వ నిర్ణయము, శివసహస్ర నామ భాష్యము,—నను గ్రంథముల విరచించి యందు "అస్తి గోవిందయజ్వేంద్ర నాగమాంబా తపః ఫల"మ్మను నట్టు తాను గోవింద దీక్షితుని కొమారుఁడ నని యుల్లేఖించినాఁడు. యజ్ఞ నారాయణ దీక్షితులు సాగ్నిచి త్సర్వక్రతు యాజి. రఘునాథ రాయల చరిత్రమును సాహిత్యరత్నాకరము, రఘునాథభూప విజయము, రఘునాథ విలాస నాటకములను గ్రంథములుగా రచించినాఁడు. ఇతఁడు రఘునాథరాయనికి శిష్యుఁ డఁట! ఆతని యొద్దఁ గావ్య నాటకాలంకార సాహిత్యముల నేర్చికొని

యాతనికి గురుదక్షిణ యీయవలసి యుండఁగా, రఘునాథ భూపాలుఁడే తనకుఁ గర్ణాలంకారములఁ, బాహాంగద కంకణముల, — నిచ్చుటయే గాక తన పదకములను గూడ బహూకరించె నని 'సాహిత్య రత్నాకరము'లో నుట్టంకించినాఁడు. ఇట్టి పాండితీ విభవుఁడు రఘునాథరాయని శిష్యుఁడ నని చెప్పి కొనుట గర్వింపఁదగి యున్నది.

రెండవ కొమారుఁ డగు వేంకటేశ్వర దీక్షితులు పూర్వోత్తర మీమాంసల యందును, సంగీత శాస్త్రము నందును, గవితా పాటవమునను, — సర్వతంత్ర స్వతంత్రుఁడు. సాగ్నిచి త్యాప్త వాజపేయయాజి. సాహిత్య మీమాంసా కర్మాంతవార్తిక వార్తికాభరణ చతుర్దండీ ప్రకాశికాదు లితని కృతులు. మహాకవి వల్లభుం డయిన నీలకంఠదీక్షితుని గురూత్తముఁ డితఁడు. ఇతనితోపాటు రఘునాథరాయల యాస్థానమున నున్న రత్నఖేటదీక్షితుల కొమారుఁడును, విశ్వజిద్యాజి యర్ధనారీశ్వర దీక్షితుల శిష్యుఁడును, — ఇతని (వేంకటేశ్వర దీక్షితుని) యుత్తర్వుల నొందలం దాల్చి మెలంగు వాఁడును, — నగు రాజచూడామణి దీక్షితులు సైత ముండు చుండెడి వాఁడు.

శ్రీనివాస దీక్షితుని సంధ్యావర్ణనా చాతుర్యమునకుఁ గల్పనా ప్రౌఢికి, — 'ప్రముదితుం డయి యచ్యుత దేవరాయ లాతని "రత్నఖేట దీక్షితు" లని పిలచి బహూకరించినట్టు లవగత మగు చున్నది. ఇ విషయమే యజ్ఞదేవేశ్వరుఁడు

రాజచూడామణీ విరచిత మ్మగు 'రుక్మిణీ పరిణయ' మహా కావ్య వ్యాఖ్యానారంభమున

"సంధ్యా సంధుక్షి తాంభోదర నలిక గణా
దుద్గతాః సీసఖండాం,
స్తారోకారా న్నిరోద్ధుం శశిరవి కపటా
ద్బిభ్రతో రత్నఖేటౌ,
అన్యోన్యం యుద్ధ్యమానా వుదయ చరమ భూ
భృ త్త్వపీరా పతి ద్రా,
గుక్త్యా ఖ్యాతా పరాఖ్యాః క్షితిపతి వచసా
రత్నఖేటాధ్వ రీతి"

—అని వివరించి యున్నాఁడు. రత్నఖేట దీక్షితులు సంధ్యాసమయ మభివర్ణించుచుఁ గల్పించిన కల్పనమునకు నచ్యుతప్ప నాయఁడే మెచ్చికొని "రత్నఖేట" యను పదమును బిరుదుగా నతని కొసంగె నని తెలియం దగియున్నది గదా !

ఇ మ్మహాకవి శితి కంఠ విజయము, భైష్మీ పరిణయము, భావనా పురుషోత్తమ నాటకము, విధి నిర్ణయము, బౌద్ధతంత్ర మథనము. వేదాంత వాదావళి,— లోనగు న వెన్నియో విరచించి యున్నాఁడు.

గుంటూరు సీమ లోని యొక పల్లె (గోవింద పురము, నరసరావుపేట తాలూకా) కుఁ జెంది తమ ప్రతిభా వ్యుత్పత్తుల కను వగు రీతిఁ బ్రవర్తింప నిశ్చయించి, దూరప్రాంతము లనియైన గణించక, ద్రమిళదేశ (Tamilnad) మునకుం జనిన

యాంధ్ర నియోగి బ్రాహ్మణ కుటుంబములలో గోవింద దీక్షితుని కుటుంబ మొకటి. రాయసాన్వయమునకు మణి పూస వంటిది యీ కుటుంబము. ఇక్కుటుంబమున గోవింద దీక్షితుఁడు నాతని సంతతియు నెనలేని విఖ్యాతి గడించి నేఁటికిని దారాపథంబున దివ్యజ్యోతులం బలె వెలుంగు చున్నారు.



పశ్చిమ చాళుక్య ప్రభు వగు

## అరికేసరి ముఖ్యమంత్రి

# వసుదోవ పంపనభట్టు

(క్రీ. శ. ౧౦ దవ శతాబ్దము.)

---

ఇమ్మంత్రి శిరోమణి వేంగి దేశ మండలి 'వసుదోవ' వాస్తవ్యుఁడు. క్రీ. శ. ౯౦౨ వ సంవత్సరమునఁ గేశవ శర్మ గర్భమున నుదయించిన వాఁడు. పరాశర గోత్రుఁడు. వేద వేదాంగ పారఁగుఁడు. మీమాంసా శాస్త్రమునకు గురు తుల్యుఁడు. వాఙ్మయ మహోదధి జలమ్ములఁ గడుపారఁ గ్రోలిన వాఁడు. షట్కర్మనిరతుఁడు. పశ్చిమ చలుక్య నృపాలుఁ డగు 'లక్ష్మేశ్వరము' అను నామాంతరముఁ గల 'పులిగెరె' అను పట్టనము రాజధానిగాఁ జేసికొని యేలుచున్న 'అరికేసరి' యొద్ద ప్రధాన మంత్రిగఁ దేజరిల్లిన యతఁడె పంపన భట్టు. ఆర్వేల నియోగి భూసురుఁడు.

ఇమ్మహామహుని తండ్రి కేశవశర్మ అధీత వేద వేదాంగ సర్వశాస్త్రార్థ తత్త్వవిదుఁడు. పితామహుఁడు పంపన బ్రహ్మతుల్యుఁడు, సర్వశాస్త్రజ్ఞుఁడు. ఇట్టి పండిత వంశమున జన్మించి సకల శాస్త్రార్థ విదుఁడయి విఖ్యాతి నందిన కేశవశర్మ యే కారణముననో వైదికమతమును త్యజించి జినధర్మావలంబి యయ్యెను. ఇతని కొమారుఁడే మన పంపనభట్టు.

ఇమ్మడి సోమేశ్వరుఁడు భువనైకమల్లుఁ డను పేరితోఁ గర్ణాటక రాజ్యసింహాసనా భద్రపీఠము నధిష్ఠించెను. ఇతఁడు వీరవిజయాదిత్యుని సమకాలికుఁడు. ఇమ్మడి సోమేశ్వరుని పరిపాలన మెన్మిదేఁడులు మాత్రమే కడచిన్న పిదపఁ దన తమ్ముఁడు విక్రమాదిత్యుని తోడి వైరము వలనఁ బదచ్యుతుం డయి, కారాగారమునఁ బడి, వెతలం జెంది, తుదకుఁ జని పోయెను. వీర విజయాదిత్యుని చరమ దశ యంతయు విచార భూయిష్ఠమై కడచిన దని తెలియుం దగి యున్నది. కాని ప్రాయము వ్రాలుచున్న వయసులోఁ గుమారుఁడు గల్గెను. అతఁడు వర్ధిల్లగలఁ డను పరిపూర్ణ విశ్వాసముతో,నాసతో, - నుండెను.

వీరవిజయాదిత్యుని పండ్రెండవ విజయరాజ్య వర్షము నకు ముం దెన్నఁడో యీ పిల్లవాఁడు జనించెను గాని యీ పిల్లవాఁడు బ్రదుక డను నభిప్రాయముతో భయవిహ్వలుం డయి బ్రాహ్మణులకు శ. ౯౯౪ పరీధావి సంవత్సర పుష్య బ ౧౧ ఆదివారము (క్రీ. శ. ౧౦౭౨ వ సంవత్సరము డిసెంబరు ౨౩ వ తేది) ఉత్తరాయన సంక్రాంతి నాఁడు కలియుధిష్ఠిర మహారాజు "అస్మత్సంతాన బలాయు రారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థ" మ్మని 'మావిండేలు, క్రుండిడి' గ్రామముల నొక దాని తర్వాత నింకొకదాని ననఁగా రెం డగ్రహారములను అష్టభోగ సర్వ సంపదలతో ననుభవించుటకు సర్వకర పరి హారముగా 'సర్వ నమస్య'గాఁ 'బసుదేవ' వాస్తవ్యుఁ డగు పంపన భట్ట మహామంత్రికి ధారవోసినాఁడు. ఇది "శ్రీమ ద్విజయరాజ్య సంవత్సర ద్వాదశే దత్తమిదం శాసనమ్."

కలి యుద్ధిష్ఠిరుఁ డెన్నియాగములు, ధర్మములు, తపములు, — జేసినను దన యభిలాషము ఫలించి నట్లు లగపడదు. అతఁడు తుదకు సంతానము లేనివాఁడుగనే శ. ౯౯౯ నల సంవత్సరము చైత్రమాసమునఁ గ్రీస్తు శకము ౧౦౭౬ వ సంవత్సరమున దివంగతుఁ డయి నట్లు లూహింప నగును. అంతతో 'వేంగి' యందుఁ జలుక్యరాజ వంశ మంతరించిన దన వచ్చును. నిజమునకు వీర విజయాదిత్యుఁడే కట్టకడపటి సత్యాశ్రయ కులజుఁడు. ఇతఁడు సనిపోయిన కాల మందె కర్ణాట రాష్ట్రమున భువనైక మల్ల సోమేశ్వరుఁడు పదభ్రష్టుం డయి దుర్మరణము పాలయ్యెను. ఇవ్విషయము నంతను 'ర్యాలి' శాసనకర్త యగు 'ముత్తయ భట్టు' చక్కఁగా వివరించియున్నాఁడు.

క్రీ. శ. ౯౪౧ వ సంవత్సరమునఁ బంపన భట్టోపాధ్యాయుఁడు ప్రథమ జైన తీర్థంకరుని చరిత్రను 'ఆదిపురాణ' మను పేరిఁట వ్రాయుటయే గాక 'విక్రమార్జున విజయ' మను పంపభారతమును రచించినాఁడు. ఇతని తండ్రియగు కేశవశర్మ వేఁగిదేశము నుండి కర్ణాటక రాష్ట్రమునకుఁ బోయి యుండెను.

వేములవాడ చాళుక్యుల యం దెల్ల మేటియోధుఁ డగు నిమ్మడి నరసింహు నాధిపత్యముననే ముమ్మడి యింద్ర వల్లభుని యుద్ధము లన్నియు నడచినవి. లాట, మాళవ, గూర్జర ప్రతిహారుల యోటమి యితని సైన్య నిర్వాహణ కౌశలమును, రణకోవిదత్వమును, బరాక్రమాతిశయమును, — వెల్లడిసేయు చున్నవి. ఇంతటి చమూపతి మఱియొకరుఁ డా శతాబ్దమున భరతఖండమున లేఁ డని చెప్పఁదగును. ఇతని

పుత్త్రుఁ డగు నిమ్మడి యరికేసరి క్రీ. శ. ౯౩౦ దవ సంవత్సర ప్రాంతమున నిజమండలమున కధిపతి యైనట్టు లగపడు చున్నది. ఇతఁడు రాష్ట్రకూట చక్రవర్తి యిమ్మడి యింద్ర వల్లభునకు మేనయల్లుఁ డని 'విక్రమార్జున విజయము' ప్రథమాశ్వాస మందలి యిమ్మడి యరికేసరి ప్రశంసలోని,

> "రుద్రాంభోధి పరీత మ
> హీంద్ర రదారి న్నరీ నరేంద్రం సాహ
> దింద్రం తాననె సలె నెగ
> ళ్దింద్రేంద్రన తోళె తొట్టి లాగిరె బళిదెం"

—(విక్ర. ఆ. ౧; ౨౨) అను కందపద్యముం బట్టి తెలియ నగు చున్నది. ఇ పద్య మందలి "నింద్రేందన తోళె తొట్టి లాగిరె బళిదెం"—అను వాక్యము లింద్రుఁడు అరికేసరి నెత్తిపెంచి నాఁడని తెలుపు చుండఁగను, 'లేములవాడ' శాసన మందలి

> "దేవీం రేవక నిర్మణి క్షితిపతే
> రింద్రస్య పుత్త్రీ న్సుతాం,
> పౌలోమీ మివ వాసవ శ్రియ మివ
> శ్రీమ న్మరధ్వంసకః,
> స్త్రీరత్నం పరిణీయ యేన నితరం
> తస్యా స్సపత్నీ కృతా,
> నూనాం స ప్త సముద్ర ముద్రిత మహీ
> మ్మ్మా నోన్నతేఽనాథునా."

—అను శ్లోకము ఇంద్ర క్షితిపతి తన కొమార్తె యగు రేవక నిర్మడిదేవి నితని కిచ్చి యుద్వాహ మొనర్చె నని తెలుపు చుండఁగను, — ఈ యూహ సరియైనదే నని చెప్పఁ దగును. బద్దెగని మునుమనుమఁ డగు నిమ్మడి యరికేసరి క్రీ. శ. ౯౩౦–౯౩౬ ల మధ్య రాజ్యము సేసిన నాల్గవ గోవిందునకు సమకాలికుఁడు.

ఇతని యాస్థానమునందె పంపన భట్టోపాధ్యాయుఁడు వెలసెను. ఇ మ్మహాకవి రచించిన యాదిపురాణమును, విక్రమార్జున విజయమును, — దెలియని కన్నడ దేశీయుఁ గడ పడఁడు. 'వేంగి' మండలాంతర్గత మైన కమ్మనాఁటి యందలి 'వేంగిపఱ్ఱు' గ్రామ వాస్తవ్యుఁడు. ఇతఁడు తన రెండు మహా కావ్యములలో 'విక్రమార్జున విజయము' న మహాభారత కథను వర్ణించి తన యేలిక యగు నిమ్మడి యరికేసరికిఁ గృతి యొసంగెను. ఇతని రెండవ గ్రంథ మగు 'నాదిపురాణము' న జైన తీర్థంకరుల చరిత్రము వర్ణింపఁ బడినది. పంపన భట్టోపాధ్యాయుని సమకాలికుఁ డగు పొన్నఁడు దన కవితా మతల్లినిఁ బుష్పింపఁ జేసినది కమ్మనాఁటి యందె. పొన్నఁడు శాంతి పురాణ, భువనైక రామాభ్యుదయాది కావ్యముల విరచించిన వాఁడు. ఇతఁడు పంపని కంటె వయసున నించుక పెద్దవాఁడే! కమ్మనాఁటి యందలి 'పుంగనూరు' గ్రామమున నాగమయ్య యను విప్రునకు మల్లపయ్య, పున్నమయ్య, — యను గొమాళ్ళుండిరి. అప్పటి బ్రాహ్మణుల యనేకులం బలె వీరును శస్త్రోపజీవు లై విలసిల్లు చుండిరి. వీరి సదాశ్రయణంబునఁ, బ్రోత్సాహమున, నితఁడు 'శాంతిపురాణము' ను విరచించెను.

రాష్ట్రకూట ముమ్మడి కృష్ణభూపున కితఁడు తన 'భువనైక రామాభ్యుదయము' అను గ్రంథము నంకితముఁ జేసి యాతనిచే 'నుభయకవి చక్రవర్తి' బిరుదముం బడసెను. ఇతఁ డుత్తరార్కాడు మండలము లోని 'వాణియంబాడి' వాస్తవ్యుఁడు. మల్లపయ్య, పొన్నమయ్య లోనగు వారు పొన్నకవి లోనగు వారి కాశ్రయ మొసంగి వారిచేఁ గర్ణాటభాషలోఁ గావ్యరచన నుపక్రమింపఁ జేసిరి. కాని తెనుఁగు దేశమునఁ గన్నడ భాష కిట్టి మన్నన బహుకాలము జరగలేదు. రాజకీయ కారణముల వలనఁ దెనుఁగు దేశమునఁ గన్నడ భాషకుఁ బ్రచారము క్రమ క్రమముగఁ దగ్గ నారంభించినది. కన్నడము వంటివలెఁ దెనుంగునను గావ్యసృష్టి జరుగుట సముచిత మని వినిశ్చయించి కవుల నభిమానించి, యాదరించి, కవిత్వము వ్రాయుటకుఁ బురికొల్పె నని నన్నెచోడ మహాకవి 'కుమార సంభవ' మందలి

> "మును మార్గ కవిత లోకం
> బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
> గు నిలిపి రంధ్ర విషయం
> బున జనఁ జాళుక్య రాజు మొదలగు పలువుర్"

—అను పద్యముం బట్టి తెలియనగు చున్నది. కావున దేశికవితఁ బుట్టించి యంధ్ర విషయంబునఁ దెనుంగును జాళుక్యులు నిలిపి రనియు, వారికిఁ బూర్వము తెనుఁగునఁ గవిత్వము లే దనియుఁ,— దెల్ల మగు చున్నది

గుణగుని పూర్విజు లగు పూర్వ చాళుక్యులలో నొక్కఁ డగు చలుక్యరాజు దేశిని కవిత్వమును బుట్టించి తెనుఁగు నంధ్ర విషయంబున నిలిపె నని తలంచుట యుక్తము.

ఇట్లారంభ మైన తెనుఁగు కవిత్వమునకుఁ గన్నడ కావ్యములు మేలుబంతు లైనవి. తెనుఁగు కావ్యములలో నాదికావ్య మనం దగు నన్నిచోడని 'కుమార సంభవము'ను బ్రాచీన కర్ణాటక కావ్యములతోఁ బోల్చిన విదితము కాఁ గలదు. కుమారసంభవముః లోనగు వాని యం దగపడు కన్నడ పదములు, పలుకుఁబడులు, కవి సమయములు, వర్ణ నాదికములు,— రానురాను సన్నగిలి తుదకు రూపఱినవి. కాని కొన్నిపట్టులఁ దెనుఁగు గ్రంథములపైఁ గన్నడ ముద్ర స్థిరపడి పోయినది.

ఇమ్మడి నరసింహుఁడు క్రీ. శ. ౯౧౮ వ సంవత్సరము నుండి క్రీ. శ. ౯౩౦ దవ సంవత్సరము వఱకును రాష్ట్రకూట సామ్రాజ్యమును బరిపాలించిన ముమ్మడి యింద్రవల్లభుని సామంతుఁడు. ఇతని కొమారుఁడే యరికేసరి. వీని యాస్థాన కవియుఁ బ్రముఖమంత్రియు, నైనవాఁడే పంపనభట్టు.



•

వేమారెడ్డి కడఁ బ్రధాన మంత్రిగాఁ

## దేజరిల్లిన

# మామిడి సింగనామాత్యుఁడు

(క్రీ. శ. ౧౫ వ శతాబ్దము)

ఇతఁడు త్రిభువనరాయ వేశ్యాభుజంగుఁడు, కదన గాండీవి, జగనొబ్బ గండఁడు, —— అను బిరుదములఁ బెక్కింటిని వహించి వేమ భూరమణు రాజ్య విభవ కళా రమానిధి యై నిర్మల మైన తన యశశ్చంద్రికల నలు కెలంకుల వ్యాపింపఁజేసి సుప్రశస్తిఁ గాంచెను. శ్రీనాథ భట్టసుకవి తన 'శృంగార నైషధము' నఁ 'బంచాంగ స్థిర మంత్ర రక్షణ కళా ప్రౌఢుం' డని యి మ్మంత్రి పురందరు నభివర్ణించుటను బట్టి యితఁడు 'దైవజ్ఞ రత్న' మని తెలియ నగు చున్నది. కావు ననే కాఁబోలు క్రీ. శ. ౧౪౧౭ దవ సంవత్సరమున 'సోమ సిద్ధాంతము' నకు వ్యాఖ్యానము వ్రాసినాఁడు.

సకల విద్యా ప్రపూర్ణుం డగు ని మ్మంత్రి రత్నము నిండు పేరోలగంబునఁ బరివేష్టింపఁబడి సరస సాహిత్య గోష్ఠీ వినోదప్రసంగంబుల సాఁగించు చుండు నని శ్రీనాథకవి సార్వభౌముఁడు విరచించిన 'శృంగార నైషధము' న వ్రాయఁబడినది.

బ్రాహ్మీదత్త వరప్రసాదుండును, సురుపజ్ఞా విశేషోదయాజిహ్మ స్వాంతుండును, నీశ్వరార్చన కళాశీలుండును, నభ్యర్హిత బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళా కళాపుండును, విద్యాసనాథుండును,— నగు శ్రీనాథుండు వేమ భూరమణు నాస్థానమున 'విద్యాధికార' పదవిని, 'అభినవ భట్టబాణ' బిరుదాంకితుం డగు వామనభట్టు (ఇంతడు సాయణ విద్యారణ్య అమాత్యశిష్యుండు. ఇతని పూర్వ వయసు విజయనగరమున గడచిన తరువాతం గొండవీటికి వచ్చి వేమారెడ్డిని, ప్రధానమంత్రి యగు సింగనామాత్యుని,—ఆశ్రయించి 'యాస్థానకవి' పదవినిం బడసి బాణ మహాకవి తన ప్రభు వగు హర్షుని చరిత్రము వ్రాసినట్టు లితండును దన ఱేం డగు వేమభూపాలుని చరిత్రమును వ్రాసెను. బాణమహాకవి పై స్పర్థవహించి యతని గద్య గ్రంథములం బలె గద్యకావ్యముల వ్రాయంబూనెను.

"బాణకవీన్ద్రాదన్యే
కాణాః ఖలు సరస గద్య సరణీషు,
ఇతి జగతి రూఢ యశసో
వత్సకులో వామనోఽధునా మాష్టి."—

ఇతండు 'శృంగార భూషణభాణము'న విద్యానగర ప్రజల సుఖజీవనమును చక్కంగా నభివర్ణించినాండు. 'పార్వతీ పరిణయము'నం గుమారసంభవ కథను నాటకరూపమున వ్రాసినాండు. అంతతో నూరకుండక 'కనకలేఖ' యను నొక నాటికను, ఎనిమిది సర్గల 'నలాభ్యుదయము'ను, ౩౦ సర్గల

రఘునాథచరితము'ను, 'హంస సందేశము'ను,— రచించి నాఁడు.),—ప్రతాపగుణ భూషణుండును, జరిణతార్థ సంభాషణుండును, వితీర్ణ మహీమూర్ణవ్రుఁడును. విభవయోగ సంక్రందనుండును, బంచాంగ స్థిర మంత్ర రక్షణ కళాప్రౌఢుండును, యవనాధీశ సభా నిరంకుశ వచో వ్యాపార పారంగతుండును, మహా సామ్రాజ్య రక్షానిధియు,— నగు సింగన 'ప్రధాన మంత్రి' పదవిని,— వహించి యుండి రని తెలిసి కొన్న యపుడు వేమ దిగ్వలయాధీశుఁడు పండితాఖండలుఁడు, రసికాగ్రసరుఁడు,—నయి యుండు నని గ్రహియింపక పోము.

కావుననే వేమ ధరణీధవునకుఁ బండితులు 'సర్వజ్ఞ చక్రవర్తి' యన్న బిరుద మొసంగుటఁ దటస్థించినది. 'అభినవభట్టబాణ' బిరుదాంచితుఁ డగు వామనుఁడు విరచించిన 'వేమభూపాల చరిత్రము' న వేమ మహీపతిని 'సర్వజ్ఞ చక్రవర్తి' యని వినుతించుటయు, విద్యాసనాథుం డగు శ్రీనాథ కవి సార్వభౌముఁడు విరచించిన 'పోన్నపల్లి' శాసనమున

"వేమాధిపో మాచవిభుశ్చ నన్దనౌ
శ్రీ కోమటీన్ద్రస్య గుణైక సంశ్రయౌ
భూలోక మేకోదర జన్మ వాఞ్ఛయా
భూయోఽవతీర్ణా వివ రామలక్ష్మణౌ"

"చూడామణి ర్నృపాణాం
దుర్మద పరిపంథి శిఖరి దంభోళిః
"సర్వజ్ఞ చక్రవర్తీ" పెదకోమటి
వేమ భూపతి ర్జయతి."—

—అని యుల్లేఖించుటయు,—నిందులకుఁ దార్కాణా మెన్నికొనఁ దగును.

వేమ భూవల్లభుఁడు విద్వాంసులఁ బోషించుటయు, నాదరించుటయుఁ, గాక స్వయమేవ పండిత చక్రవర్తియు, రసజ్ఞుఁడును,—నై 'సర్వజ్ఞ చక్రవర్తి' యని వినుతిఁ గాంచి 'అమరు' కావ్యమునకు 'శృంగార దీపిక' యను వ్యాఖ్యను గూడ రచియించి యశశ్శరీరుం డయ్యెను.
కవి సార్వభౌముని 'శృంగార నైషధము' లో

"తన కృపాణము సముద్ధత వైరి శుద్ధాంత
తాటంకముల కెగ్గుఁ దలఁచు చుండఁ
దన బాహు పీఠంబు ధరణి భృత్కామఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దన కీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ
భవన భూముల గొండ్లిఁ బరిఢవిల్లఁ
దన దాన మహిమ సంతాన చింతా రత్న
జీమూత సురభుల సిగ్గు పఱుపఁ
బరఁగు శ్రీ వేమ మండలేశ్వరుని మంత్రి
యహిత దుర్మంత్రి వదన ముద్రావతార
శాసనుఁడు 'రాయవేశ్యా భుజంగ' బిరుద
మంత్రి పెద్దయ సింగనామాత్య వరుఁడు."

—అని యుదాహరింపఁబడుట వలన నితఁడు వేమ భూరమణుని సచివోత్తముఁడని విదిత మగు చున్నది. ఇప్పావన చరితుఁడు వేమ మహీపతిచేఁ బెక్కు గ్రామములఁ బడయు

టయే గాక, ఆందోళికా ఛత్ర చామరకళ్యాణ కలాంచికాది బహు సమ్మానార్హ చిహ్నంబుల నాదర మొప్పారఁ గాంచి సామ్రాజ్య రమాశీలుం డయి విలసిల్లు చుండె నని 'నైషధ కావ్యము' సూచించు చున్నది.

ఇతని యగ్రజు లగు వేమన, పెద్దసలు, – వేమ మండలేశ్వరుని కడలంగట దండనాథుఁడుగా నుండి విఖ్యాతిఁ జెంది రని 'శృంగార నైషధ' మందలి,

"కాలకంఠ కఠోర కంఠ హుంకారంబు
సెవులు సోఁకని నాఁటి చిత్త భవుఁడు
కుపిత రాఘవ ఘన క్రూర నారాచంబుఁ
దనువు నాటని నాఁటి వనధిరాజు
క్రుద్ధ కుంభోద్భవ భ్రూలతా కౌటిల్య
వికృతిఁ గుందని నాఁటి వింధ్య శిఖరి
వీరభద్రోదార ఘోర వీరావేశ
విహ్వృతిఁ గందని నాఁటి తుహిన కరుఁడు
చక్కఁదనమున గాంభీర్య సారమునను
బ్రకట ధైర్య కళా కలాపముల యందు
దండనాయక చూడావతంస మైన
మంత్రి మామిడి వేమనామాత్యుఁ డెలమి.

"తగుఁ గైవార మొనర్ప విక్రమ కళా
ధౌరేయతా శాలి శ్రీ
పెగడన్న ధ్వజినీశుఁ డంబునిధి గం
భీరుండు శుంభ ద్విష

న్నగర ద్వార కవాట పాటన విధా
న ప్రౌఢ బాహార్గళా
యుగళుం డాహవ సవ్యసాచి ధరలో
నొక్కండ పేరుక్కునన్."

— అను పద్యములవలన విద్యోతమగు చున్నది.

సింగన మంత్రి పితామహుఁడు మాదన్న యను నతఁడు శివదీక్షాపరతుండయి, బంధు రక్షా దీక్షితుండయి, ధార్మిక చక్రవర్తి యయి, విలసిల్లుచు, 'అక్కాంబిక' యను సాధ్వీ మతల్లినిఁ బెండ్లియాడి యామె వలన నల్గురు కొమాళ్లను బడసెను. అందగ్రసరుఁడగు పెద్దన

"అనతారాతి వసుంధరా రమణ స
ప్తాంగాపహార క్రియా
ఘన సంరంభ విజృంభమాణ పటుదోః
ఖర్జూ ద్వితీయార్జునుం
డన వేమాధిపు రాజ్యభార భరణ
వ్యాపార దక్షుండు పె
ద్దన మంత్రీశుఁడు మామిడన్న సుతుఁ డే
తన్మాత్రుఁడే యెన్నఁగన్."

—అను 'శృంగార నైషధ' కావ్యమందలి పద్యముం బట్టి వేమనాధిపు రాజ్యభార భరణ వ్యాపార దక్షుండయి యుండె నని స్పష్టమగు చున్నది.

ఇయ్యమాత్య చూడామణికి వీరభద్ర, మారన, నామామాత్యులు మూవురు సోదరులు గలరు. వారును అనవేమా

రెడ్డి కడ మంత్రు లయి, పెద్దనామాత్యునకుఁ గడు విషయ వినమితు లయి, వివిధ కార్యకరణ సమర్థు లయి, యొక్కొక్క కొక్కొక్క విషయంబున శక్తిమంతు లై, - యుండినట్లు 'శృంగార నైషధ' కావ్య మందలి,

"హేమ ధరా ధరేంద్రమున
    కెంతటి పెద్దభృతి న్భుజంగమ
స్వామికి మేలు చేయి పటు
    వా గ్విభవంబున బుద్ధి సంపద
న్దామర చూలికి న్సరి ప్ర
    ధానులు దక్కిన వారు సాటియే
మామిడి వీరభద్రుఁడన క
    మాత్య శిఖామణి కి వ్వసుంధరన్."—

"సత్యవచో నిరూఢుఁడు ని
    శాకర శేఖర భక్తి భావనా
సాత్యవతేయుఁ డుద్భట భు
    జాబల విక్రమ కేళి విక్రమా
దిత్యుఁడు కార్య ఖడ్గ సము
    దీర్ణుఁడు మామిడి మంత్రి మారనా
మాత్యుఁలు వానిఁబోల వశ
    మా ధరణీధవ మంత్రికోటికిన్."—

"స్వామిద్రోహరగండ లాంఛనునకున్
    సంగ్రామ గాండీవికిన్

వేమ క్ష్మాపతి కార్యభార కలనా
విఖ్యాత ధీశక్తికిన్
నామామాత్యుని కన్యరాజ నిటలాం
తర్వ్యస్త భాగ్యాక్షర
స్తోమాపాకరణ ప్రవీణునకు మం
త్రుల్ సాటియే యెవ్వరున్."—
"తమ్ములు దన్ను ముప్వురును
దైవముఁగా గురుఁగా మహానిధా
నమ్ముఁగ దాతఁగాఁ దమ మ
నంబుల భావనఁజేసి కొల్వ భా
గ్యమ్ముల కెల్ల నెల్లయయి
కాంచీ ప్రసిద్ధి నృప ప్రధాన ర
త్నమ్మగు మంత్రి పెద్దన యు
దాత్తమతిన్ రఘురాము కైవడిన్."

—అను పద్యముల వలనఁ దెలియనగుచున్నది.

కేతనామాత్యుని తనయుండును, గౌతమ గోత్ర విఖ్యాతుండును, దోహత్త నారాయణుండు, ఖండియ రాయండు, చౌహస్త మల్లుండు, – నగు అల్లాడ మంత్రికి సుహిత పుణ్యాయగు వన్నమాంబ యందు జనించిన 'తల్లమాంబిక' ను బరిణయం బొనర్చికొని యీ పెద్దన వేమనామాత్యుని, ప్రెగ్గడామాత్యుని, సింగనామాత్యునిఁ, – గాంచెను.

ఈ మంత్రి రత్నము భారద్వాజ గోత్ర కలితాపస్తంబ సూత్రాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు. సత్తెనపల్లె తాలూకా

లోని 'బలిజేపల్లె' వాస్తవ్యుఁడు. పిడుగురేలకుఁ జను రథ్యను ఈ గ్రామము గలదు. ఇప్పటికిని ని మ్మహాభాగు వంశ్యులే యా గ్రామాధికారులై తమ పూర్వుల ప్రజ్ఞా ప్రాభవ కీర్తులఁ దలపోయుచు నుండు చున్నారు.

---

'రామగిరి' దుర్గాధిపతి యగు

## ముప్పభూపాలుని సచివోత్తముఁడు

# వాణస కందనమంత్రి

( క్రీ. శ. ౧౫ శతాబ్దము. )

---

ఓరుగల్లు కుడిచే భాగమున నున్న 'రామగిరి' దుర్గమున కధీశ్వరుం డగు ముప్ప ధరణీధవు మంత్రి వాణస కందన. ఇమ్మంత్రి శేఖరున కాశ్రితుం డయి 'మడికి సింగన' యను నతఁడు గ్రంథములఁ బెక్కింటిని విరచించెను. వానిలోఁ బద్మ పురాణము, భాగవత దశమ స్కంధము (ద్విపద కావ్యము), వాసిష్ఠ రామాయణము, — నను నవి మాత్రము మనకు లభించు చున్నవి. కాని కందనమంత్రి పేర 'నీతితారావళి' యని యొక గ్రంథము సింగన రచించినది నేఁటికిని లభించ లేదు,

పద్మ పురాణము శా. శ. ౧౩౪౨ కు సరియైన శార్వరి సంవత్సర మార్గశీర్ష శు ౫ బుధవారము (క్రీ. శ. ౧౪౨౦) దవ సంవత్సరమున రచింపఁబడియె నని

"ఆకర యుగానల మృగాంక శక
వత్సరము లై పరఁగు శార్వరినిఁ బుణ్య
ప్రాకటిత మార్గశిర పంచమినిఁ బొల్చు

నుడుపాల సుత వాసరము నందుఁ
శ్రీకరముగా మణికి (మడికి) సింగన
తెనుంగున రచించెఁ దగఁ బద్మ సుపురాణం
బాకమల మిత్త్రి శిశిరాంశువుఁగఁ గంద
సచివాగ్రణికి మంగళమహా శ్రీ"—

—అను వాక్యములు దెలుపు చున్నవి. కందన మంత్రియు నాతని ప్రభు వగు ముప్పడియుఁ, దెలుఁగు రాయఁడును,— ప్రభుత్వముఁ జేసిన కాలములు సుభువుగా లభించు చున్నవి. కందన మంత్రిని

"ధరణీదేవ కలాబ్ధిచంద్ర! విలస
ద్దానాంబుధారార్ద్రవి
స్ఫుర హస్తాంబుజ మంత్ర రక్షణ కళా
చాతుర్య సాహిత్య గీ
త రసాస్వాదన లోకమానస సదా
ధర్మజ్ఞ శ్రీ ముప్ప డీ
శ్వర కారుణ్య కటాక్ష వర్ధిత మహా
సౌభాగ్య భాగ్యోదయా!"—

—అని పద్మపురాణము (ఆ ౮;) నఁ గవివృషభుఁడు సంబోధించినాఁడు. కందనమంత్రి తాతలు కాకతీయ గణపతీంద్రు నొద్ద సామంతు లై యుండి గణపేశ్వ రాది స్థళంబుల దేవాలయ ప్రతిష్ఠలఁ గావించి విశ్రుతు లయిరి.

మడికి సింగన తిక్కన సోమయాజి కొమారుఁడగు కొమ్మనకు దౌహిత్త్రుఁ డగు నయ్యల మంత్రి కొమారుఁడు.

ఈ యయ్యలు మంత్రి యన పోతరెడ్డికి మంత్రి. కావుననే సింగనకు రాజనీతి శాస్త్రముల ధౌరంధ్యము గలిగెం గాం బోలు!

విద్యానగరపుం గంప భూపతి మడికి సింగన కాలము వాఁడు. కావున మనుమంచి భట్టును నాతని యేలిక యగు కంపరాయలును, దప్పక ప్రాచీనులే! ఈ మనుమంచి భట్టు 'శాలిహోత్ర' మను నశ్వశాస్త్రమును 'హయ లక్షణ విలా సము'నను పేరఁ దెలిగించెను. ఈ గ్రంథము చలుక్య కంప భూపతికి నంకిత మీఁబడినది.

మడికి సింగన

"సరస కవితా విలాసుఁడ
గురు భరద్వాజ రమ్య గోత్రాబ్ధి సుధా
కిర ణాయ్యలార్య తనయుఁడ
హరిదాసుఁడ(మడికి) సింగయాఖ్యుఁడ ధాత్రిన్."—

అను 'సకల నీతి సమ్మత' మందలి పద్యము బట్టి భర ద్వాజ గోత్రుఁ డని యవగత మగు చున్నది.

పరమపావన మైన గోదావరీ దక్షిణ దిగ్భాగంబున 'సబ్బినాఁటి రాష్ట్ర' మొండుఁ గలదు. ఈ రాష్ట్రమునకు 'రామగిరి' యనుః పట్టనము రాజధాని యై చెలంగు చుండెను. ముప్ప భూపాలుఁడు 'రామగిరి' పట్టనము నిజరాజధానిగాఁ బురందర విభవుం డయి రాజ్యము సేయు చుండెను. ఇ ముప్ప డీశునకు సకల సామ్రాజ్య భారధురంధరుండును, ధర్మ చరి తుండును, నీతి చాతుర్య వివేక విశేష సర్వ లక్షణ లక్షితుం

డును,—నై యమ్మహారాజు సత్కృతులం బడసి విశేషవస్తు వాహన ఛత్ర చామరాందోళికాది రాజ చిహ్నంబులం బొంపొందు కందనామాత్యుండు కాశ్యపగోత్రుండు లోకగురుండు సెన్నలరు చుండెను.

ఇతని ముత్తాత తండ్రి యగు 'నన్నయ' కాకతీయాంధ్ర గణపతి చక్రవర్తి యొద్ద మంత్రిగా నుండెను. ఇతఁడు

"పరువడి కాకతీయ గణ
పక్షితి నాయకు నొద్ద మాన్యుఁడై
ధరణిఁ బ్రశస్తుఁడై నగరి
దానము లెల్లను జేసి పేరు పెం
పెరువుగ గుళ్ళుఁ గట్టి గణ
పేశ్వర దేవుని గోపికాధిపు
స్థిర మగు చున్న లక్ష్మినిఁ బ్ర
తిష్ఠలు సేసెఁ బ్రభుత్వ మేర్పడన్."—

—అను పద్యముం బట్టి 'నన్నయ' దానరాధేయుఁ డయి యాలయమ్ముల వినిర్మించి గణపతిదేవచక్రవర్తియొద్ద మాన్యుఁడయి యుండె నని విదిత మగు చున్నది. 'నన్నయ' కుమారుఁడు మల్లన 'మొలగూరు' లో రామేశ్వరాయాది దేవతా ప్రతిష్ఠలు గావించి నల్దెసలఁ గీర్తి పతాక నెగుర వైచె నని

"ఆ శత మన్యు వైభవుఁ డ
హర్పతి తేజుఁడు చంద్ర చంద్రికా
కాశ సమాన మూర్తి యగు
గౌరమ మల్లన మంత్రి దిక్కుల

న్యాసికి నెక్కఁ భక్తిని న
వారణమై గుడిఁ గట్టి కట్ట రా
మేశుఁ బ్రతిష్ఠఁ జేసి నుతి
కెక్కిన నమ్మెలగూరి వాకిటన్."

—అను పద్యము స్పష్టీకరించు చున్నది.

కందన మంత్రి జ్యేష్ఠ భ్రాత యగు కేసన మంత్రి కుమారు డుప్ప భూపాలుని మంత్రియై తేజరిల్లె ననియుఁ, గొన్ని ధర్మకార్యములఁ జేసె ననియు,—

"తన నీతి ముప్పడి ధరణీశుఁ డేలెడి
ధరణికి వజ్రపంజరము గాఁగ"—
"అతులిత లీలఁ గేశ సచి
వాగ్రణి ధర్మపురంబు నందు నం
చితముగ నన్నసత్ర మిడి
శ్రీ నరసింహుని కుత్సవంబులన్
సతత మహోపచారములు
సల్పుచు రామగిరీంద్ర మందు
స్థితి గుడిఁ గట్టి విష్ణుని బ్రి
తిష్ఠ యొనర్చె నుదాత్త సంపదన్."

—అను పద్యములు సాటు చున్నవి.

క్రీ. శ. ౧౪౩౦ దవ సంవత్సర ప్రాంతమున రచింపఁ బడిన 'సకల నీతి సమ్మతము' దేవాంకిత మయ్యును నందుఁ

గేసనామాత్యుఁడు సబహుమానంబుగఁ జేర్కొనఁబడియెను.
ఇతని పెదతండ్రి సింగన,

"... ... ... ... ... ... ... ...
నయ్యాల మంత్రికి సింగమాంబకు
దనయుని విష్ణు మంగళ క
థా సుముఖాత్ముని నిత్య సౌమ్య వ
ర్తను శుభలీలు నవ్య కవి
తా రసపోషణ వాగ్విలాసు భూ
జన నుత సింగనార్యు గుణ
సాగరు న స్వలిపించి యమ్మెలిన్."

—అను పద్యము బట్టి సింగమాంబకును అయ్యాల మంత్రి కిని బుత్త్రిం డనియు, నిత్య సౌమ్యవర్తనుం డనియు, నవ్య కవితా రసపోషణ వాగ్విలాసుం డనియు, భూజన నుతుం డనియు, విష్ణుమంగళ కథా సుముఖాత్ముం డనియు, శుభ లీలుం డనియు,— విదిత మగు చున్నది.

ఆత్రేయ గోత్ర పవిత్ర చరిత్రుం డగు పేరయ మంత్రి పుత్త్రిక యగు సింగమాంబను బరిణయ మొనర్చికొని రాజ మహేంద్రవర పురాధినేత యగు తోయ్యేటి యనపోత భూపా లుని మంత్రి యై గౌతమీ నదికి నుత్తరతీరమ్మునఁ గల "పెద్ద మణికి" అగ్రహారమున నారామక్షేత్రాదుల సముపార్జించి 'యన్నదాత' యని పేరందిన మనుజ మందారుఁడగు నల్లాడ మంత్రి కొమారుఁడే అయ్యాల మంత్రి యని

"ఆత్రేయ గోత్ర పవిత్రుఁ పేరయ మంత్రి
పుత్త్రి సింగాంబిక ఘనాత్మ సాధ్వి
వెలయ వివాహమై వేఁగి దేశంబులో
నేపారు రాజమహేంద్ర పురికి
నధిపతి తోయేట్టి యనపోత భూపాలు
మంత్రియై రాజ్య సంపదలఁ బొదలి
యొప్పారు గౌతమి యుత్తర తటమున
మహనీయ మగు 'పెద్దమణికి' యందు
స్థిరత గారాపు తోటలు సుక్షేత్రములును
పెక్కులార్జించి సితకీర్తి పెంపు మిగిలి
యఖిల జగదన్నదాత నా నవనిఁ బరఁగె
మనుజ మందారుఁ డయ్యాల మంత్రి వరుఁడు"

—అను పద్యము సువిదితమై యున్నది. ఈ అయ్యాల మంత్రి కొమాళ్లే సింగన, అనంతయ్య, అబ్బయ్య, నాగయ,— అను వారలు. ఇందు సింగన యను వాఁడు కుమార ముప్ప భూపాలునిచే 'రామగిరి' సీమలో ననేక గ్రామములను, వృత్తులను, - బడసె నని

"ఆ మహావిభు చేత రామాద్రి సీమఁ
బెక్కు వృత్తులు గ్రామము ల్వేలయఁ గాంచి
యతని యాశ్రితు లందెల్ల నధికుఁ డనఁగఁ
జతురుఁ డన ధన్యుఁ డన నడి సన్నవాఁడు."

——అను పద్యము దెలుపు చున్నది. ఇతనికిం (సింగనకుం) దాళ్ళపాక తిరుమలయ్య యను పందవరీక నియోగి బ్రాహ్మణుండు గురూత్తముం డని

"ధర నిహాపరములకును గురు
చరణంబులె యూంత యగుటం జర్చించి మది
న్బరవాది భద్రవారణ
హరి భక్తులం దిరుమలయ్య నూర్యులం దలంతున్."

——అను పద్యము స్పష్టీకరించు చున్నది. ఈ తిరుమలయ్య సంకీర్తనాచార్యుండు. అన్నమాచార్యునకు జెందిన వాండు. ఇతనికిం 'బరవాది భద్రవారణ' మను బిరుదు కల డని తెలియుచున్నది గదా!

ముప్ప ధరణీధవుండును, దెలుంగు రాయండును,—— రాజ్యము సేయుచున్న యపుడు కందన మంత్రి సచివోత్తముండుగా నుండెను. 'పద్మ పురాణము' నం గందనామాత్యుండు,

"ధరణీదేవ కులాబ్ధి చంద్ర! విలస
ద్దానాంబు ధారార్ద్ర వి
స్తర హస్తాంబుజ మంత్ర రక్షణ కళా
చాతుర్య సాహిత్య గీ
త రసాస్వాదన లోకమానస సదా
ధర్మజ్ఞ శ్రీ ముప్ప డీ
శ్వర కారుణ్య కటాక్ష వర్ధిత మహా
సౌభాగ్య భాగ్యోదయా!"

—అని యభివర్ణింపఁ బడుటను బట్టి యతఁడు మంత్ర రక్షణ కళా చాతుర్య సాహిత్య గీత రసాస్వాదన లోకమానస సదా ధర్మజ్ఞుఁ డనియు, శ్రీ ముప్పడీశ్వర కారుణ్య కటాక్ష వర్ధిత మహా సౌభాగ్య భాగ్యోదయుం డనియు, దానాంబుధారార్ద్రి విస్తర హస్తాంబుజుఁ డనియుఁ, – దెలియు చున్నది. సింగన తన 'పద్మపురాణము' న నిమ్మహనీయుని గుణగణంబుల నున్న తెఱంగు నభివర్ణించి యుద్ధమునఁ బ్రతిబింబించిన పగిదిఁ జూపెట్టి యాంధ్రులకుఁ దత్తాపి సారస్వతమునకు,— అత్యంత మహోపకారం బొనర్చె సారస్వతోపాసకుల కృతజ్ఞతకుఁ బాత్రుఁ డయ్యె నని చెప్పక తప్పదు.

కృష్ణానదీ దక్షిణ తీరంబున నలరారు 'రావెల' (మంగళగిరి దగ్గఱ నున్నది.) యను నగ్రహారము తన కేక భోగంబుగా నేలుచు, నందు గోపీనాథు నాలయ మొకండు వినిర్మించి యఖిల విభవంబుల నతిశయిల్లిన నల్లాడ మంత్రి ముమ్మనుమఁడే కందన మంత్రి యాటచే నిమ్మంత్రి పురందరుండు 'రావెల' వాస్తవ్యుఁ డని గ్రహించుటలోఁ దప్పు లేదు. ఇతని నాఁట నుండియు నివ్వంశ్యులు 'రావెల' వారనఁ బఱఁగు చుండిరి.

శ్రీగిరి కోమటిరెడ్డి భూరమణుని

## ప్రధాన మంత్రి

# దూబగుంట కొమ్మనమంత్రి

(క్రీ. శ. ౧౫ వ శతాబ్దము)

---

ఇ మ్మంత్రిశేఖరుఁడు శ్రీగిరి కోమటిరెడ్డి మన్నీనికిఁ బ్రధాన మంత్రిగా నుండి రాజ్యచక్ర మవలీలఁ ద్రిప్పుచుండిన వాఁడు. లౌకిక వ్యవహారములయందె కాక వైదిక క్రతువుల నొనర్చుటయందును అసమాన ప్రజ్ఞ కలవాఁడయి వేద విద్యల నభ్యసించి యగ్నిష్టోమాతిరాత్రము లోనగు యజ్ఞములఁ, గ్రతువుల,— నిర్వర్తించి సోమయాజి యై "తుమ్మిలేఱు, తొంపేఱు"ల మధ్యను 'చుంచి' కోటకు నుదీచీ భాగమున యజ్ఞేశ్వర దేవునిఁ బ్రతిష్ఠించెను. ఇతని భార్య లక్కమాంబ, నారాయణుఁడు, రామచంద్రుఁడు,— నను వారలితని కొమాళ్లు.

ఈ యిద్దఱు కొమాళ్ల సాహాయ్యముతో శ్రీశైలమందలి పాతాళ గంగ నుండి యితఁడు స్వాయంభూ లింగమును గొని వచ్చి శా. శ. ౧౩౫౨ సాధారణ సంవత్సర ఫాల్గున శు ౧౧ లు నాఁడు అనఁగాఁ గ్రీస్తుశకము ౧౪౩౦ దవ సంవత్సరమున జాలతో నొక యాలయమును మండపమును

గట్టించి, చుట్టును విఘ్నేశ్వర, దుర్గ, గోపాల, భైరవ విగ్రహములఁ బ్రతిష్ఠించి శిలలతో నాయకుల నినిర్మించెను. శిలా ప్రాకారములోపల నొక చక్కని గూరాము మేర్పాటు సేసెను. ఇంతియ కాక తాను యజ్ఞము సేసిన చోటులలో జ్ఞాపక చిహ్నముగ శిలా స్తంభముల రెండింటిని వేయించెను. ఈ ప్రతిష్ఠల కన్నిటికిఁ గోమటి రెడ్డి కొమాళ్లు తిప్పయ, శ్రీగిరన్న, రామయ దేవరాయ, నారాయణ దేవులు తుంగభద్రా తీర మందలి విరూపాక్ష దేవు సన్నిధానమున భూదానములఁ బెక్కింటి నొసర్చి యుండుట వలన నా కాలమునకు వీరు ప్రౌఢదేవరాయలకు వశంవదు లయినట్లు లగపడు చున్నది.

ఈ కొమ్మన సోమయాజియు నితని కొమాళ్లు రామ చంద్ర నారాయణులును కందనోలు (Kurnool), కోవూరు (Kovur) చుండి (Chundi) గ్రామముల సమీపమున మంచినీటి బావులను జెఱువులను ద్రవ్వించి ప్రజలకు మహోప కారము సేయుటయె కాక యింక ననేక ప్రతిష్ఠల నొనర్చె నని (నెల్లూరు శాసనములు, సంపు. ౧; పుట ౪౯౨. కందుకూరు శాసనములు, సంపు. ౨; పుట ౧౬ మొదలు ౧౯ వఱకు)— దెలుపు చున్నవి.

అద్దంకి రాజధానిగాఁ జేసికొని కొండవీటి మహా సామ్రాజ్యమును నిర్వక్ర పరాక్రమముతో నేలిన వేమ భూ ధవునకు మల్లారెడ్డి యను సోదరుఁ డొకరుఁ డుండెను. ఇమ్మల్ల రథినీధవు నాస్థానము నందె కవిత్రమున నొకరుం డయి, వాసి కెక్కిన చదలువాడ యెఱ్ఱాప్రెగడ మహాకవి యుండె నని సర్వ జన విదితంబే గదా!

ఈ కొమ్మన్న పార్థివునకుఁ బినకోమటి యను కొమారుఁడు గలఁడు. అనవేమారెడ్డి కాలమునఁ 'గందుకూరు' దుర్గమున నుండి 'పూంగినాఁటి' సీమను బరిపాలించు చుండిన ఈ పిన కోమటి మహీజానికి 'గౌరాంబిక' యందు శ్రీగిరి, రాచ వేమన, మాచన, అన్నదేవ, పెద్దిరెడ్డి యను నైదుగురు కొమాళ్లు గలిగిరి. ఈ యైదుగురులో శ్రీగిరి యను వాఁడు మిగులఁ బరాక్రమ వంతుఁడై శాత్రవ కంఠ లుంఠన మొనర్చి యరిజన భయంకరుండయి విలసిల్లు చుండెను. ఇతనికి "శ్రీమ దొడియరాయ శ్రీగిరి" యను నతఁడు గురువు. ఈతఁడు గాన కళాభ్యాస మొనర్చి దానరాధేయుఁడై హేమాద్రి దాన చింతామణి యని ప్రసిద్ధి వడసెను.

దేశ మంతయు సస్యశ్యామల సంభరిత మై, కన్నుల పండువై,— యుండుట కయి గొప్ప చెఱువులఁ ద్రవ్వించెను. ఇతని తరువాత నీతని పెద్దతమ్ముఁడు రాచవేమన రాజ్యమునకు వచ్చి ప్రజానురంజకముగ నేలుచుఁ దన యన్న యగు శ్రీగిరికిఁ బుణ్యావాప్తి కలుగుట కయి కందుకూరు నందలి జనార్దన స్వామి కొఱ తటాకమును 'బద్దెపూఁడి' గ్రామమునఁ ద్రవ్వించి శా. శ. ౧౩౨౦ క్రీ. శ. ౧౩౯౮ దవ సంవత్సరమున సూర్యగ్రహణ పుణ్యకాలమ్మున సమర్పించెను. అనఁగాఁ గందుకూరు (Kanduku!) నందలి శ్రీ జనార్దన స్వామికిఁ జెందిన 'బద్దెపూఁడి' గ్రామ మందలి పంటభూములు ఫలించు నిమిత్త మొక గొప్ప తటాకమును ద్రవ్వించె నని యవగత మగుచున్నది.

ఈ రాచవేమన తమ్ముఁడు మాచారెడ్డి యను వాఁడు తన పితామహుఁ డగు మల్లారెడ్డి వోలెఁ దురుష్కులతోఁ బోరాడి గెలుపొందినట్లు శాసనములు దెలుపుచున్నవి. శ్రీగిరి రెడ్డికిఁ గోమటిరెడ్డి, మల్లారెడ్డి, అనవేమారెడ్డి, నారాయణ రెడ్డి,— అను వారలు కొమాళ్లు. రాచవేమన తర్వాత శ్రీగిరి జ్యేష్ఠ పుత్త్రుం డయిన కోమటిరెడ్డి రాజ్యభారము వహియించెను. పెదకోమటి వేమారెడ్డియు, నితని కొమారుఁడు రాచవేమనయుఁ జనిపోయిన తర్వాత ఈ శ్రీగిరి కోమటి మహీజాని విజయనగర ప్రభూత్తంసు లగు ప్రౌఢదేవరాయలచే నోటువడి యాతనికిఁ గప్పము సెల్లించు సామంత ప్రభువుగా నున్నయట్లు శాసనాద్యాధారము లగపడుచున్నవి.

ఇతని తమ్ముఁడు మల్ల రథినీధవుఁడు శా. శ. ౧౩౩౦ క్రీ. శ. ౧౪౦౮ దవ సంవత్సరమున 'చుండి' గ్రామమున శ్రీ జనార్దనస్వామినిఁ బ్రతిష్ఠించి యాలయ ప్రాకారములను మండపమును వినిర్మించి స్వామికిఁ బెక్కు సువర్ణమయాలంకారముల నర్పించి నిత్యకైంకర్యాదుల కయి నాల్గుపుట్లన్నర ధాన్యము ఫలించు మెఱక పొలమును, రెండు నివర్తనముల మాగాణి భూమిని, —దానము సేసెను.

పెదకోమటి వేమారెడ్డి సోమోపరాగ మహాపర్వదివసంబున ననఁగా శా. శ. ౧౩౨౬ క్రీ. శ. ౧౪౦౪ వ సంవత్సరమున శాండిల్య - కౌశిక గోత్రోద్భవు లగు నల్లేపెద్ది లక్ష్మణదీక్షితులు షడ్దర్శనాల వల్లభ సోమయాజులకుఁ 'బెదపూఁడి' గ్రామము నగ్రహారముగా నొసంగి తామ్ర

శాసనము వ్రాయించి యిచ్చెను. శ్రీగిరిరెడ్డి తమ్ముఁడును గోమటి రెడ్డి కొమారుఁడును నగు శివలింగ భూపతి ప్రౌఢ దేవరాయల కాలమున శ్రీగిరి కోమటిరెడ్డి గతించిన తర్వాతఁ గందనోలు (Kurnool) రాజధానిగా నేలినట్టు లగపడు చున్నది. ఈ శివలింగ భూపతి మంచి పండితుఁడు. సంస్కృత భాషలో 'గిరీశ స్తుతిసూక్తిమాల' యను గ్రంథమును విరచించి విశ్రుతకీర్తి నార్జించెను.

క్రీ. శ. ౧౪౩౮ దవ సంవత్సరము దాఁక వేమారెడ్డి వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరమున రాజ్యము సేయుచుండి నట్టు శాసనములు వాకొను చున్నవి. క్రీ. శ. ౧౪౪౫ దవ సంవత్సరము జనవరి నెలలో విజయనగర చక్రవర్తి యగు ప్రౌఢదేవరాయల మహాప్రధానుం డగు నాగభూపాలుని కుమారుఁడు మల్లభూరమణుఁడు రాజమహేంద్రవరమున రాజ్యముసేయు చున్న రెడ్డి మన్నీలే మైరో ప్రౌఢదేవరాయల క్రింది కీ రాజ్యము ఎట్లు వచ్చినదో తెలియదు.

రాజమహేంద్రవరము రెడ్లకును, విజయనగర చక్రవర్తులకును,—స్నేహము బాంధవ్యము గల వట్టి శాసనముల వల్లను శ్రీనాథ కవి సార్వభౌముని గ్రంథనిచయము వల్లను,— తెలియు చుండుట చేతను, 'గంగాదాస విలాస' మను గ్రంథ మునఁ బ్రౌఢదేవరాయలు గజపతిని నిర్జించి నట్టు సెప్పి యుం డుటవలనను,—రాజమహేంద్రవరము రెడ్డిరాజన్యుల పయిం గపిలేశ్వర గజపతి యుద్ధమునకు రాఁగా, బ్రౌఢదేవరాయలు వారికి బాసటగా నిలచి గజపతిని నోడించెనని చెప్పనగును.

కపిలేశ్వర గజపతి చాలకాలము నుండియుఁ గళింగ దేశము నేలుచున్న గాంగవంశపు రాజులను దఱిమివైచి క్రీ.శ. ౧౪౩౫-౩౬ లో సింహాసన మధిరోహించెను. తదారభ్య దక్షిణమున నున్న రెడ్డిరాజ్యమును గబళించి వైవఁ దఱుణమున కయి వేచి యుండె నని విదితము కాఁగలదు

కాఁబట్టి రెడ్డిమన్నీ లి విధముగా రాజమహేంద్రవర మునఁ, గొండవీఁటను,—రాజ్యముల నెలకొలిపి బుద్ధియందు బృహస్పతు లనఁదగు సచివోత్తముల ప్రోత్సాహ సాహాయ్య ములతోఁ, బర్యవేక్షణముతోఁ—ప్రజానురంజకముగ రాజ్య మేలిరని తెలియఁదగి యున్నది. "రాజునకుఁ బ్రజ శరీరము, రాజు ప్రజకు నాత్మ" యను నుడి యీ రాజశేఖరుల యేల్బడి యందు సార్థకతఁ జెందినది.

మన దూబగుంట కొమ్మన మంత్రి శ్రీగిరి కోమటిరెడ్డి మహీపతియొద్దఁ బ్రధాన మంత్రిగా నుండి రాజ్య చక్రము అవక్ర పరాక్రమముతో నవలీలం ద్రిప్పి, స్వధర్మ నిష్ఠాగరిష్ఠుం డయి, యజ్ఞయాగాది క్రతువులఁ బెక్కింటి నొనర్చి,— 'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్త్రి' మ్మను సూక్తి కుద్గ్రవ్యై దానరాధేయుఁడై యసమాన ప్రజ్ఞాప్రాభవకీర్తుల విలసిల్లెను. ఇతఁడు పాఁకనాఁటి నియోగి బ్రాహ్మణుఁడు. మైత్రావరుణ గోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు, తండ్రి దామరాజు, తల్లి బ్రహ్మసాని. తాత మారమరాజు. ఒంగోలు తాలూకా యందలి చివఱ గ్రామములలో నొకటి యగు 'దూబగుంట' వాస్తవ్యుఁడు.

---

పూసపాటి బసవ భూపాలుని

## కార్యాచార్య మంత్రి

# చెందలూరి గంగయ్యామంత్రి

(క్రీ. శ. ౧౬వ శతాబ్దము)

---

ఇమ్మంత్రి శేఖరుఁడు జయవాడ మాధవవర్మ వంశజుఁడైన బసవ నృపాలునకుఁ గార్యాచార్యుఁడైన ( rime minister) మంత్రి. అట్లని,

“చతురంగ బలముల జయవాడ దుర్గాంబ
వరమునఁ బడసి దుర్వార లీల
జగతీ స్థలం బెల్ల సాధించి జయ శాస
నములు దిగ్దంతి దంతముల సలిపి
పేద బాలునకుఁ గాఁ బ్రియసుత మోహంబు
పట్టక బెజవాడ పాడి నిలిపి
కలయంగఁ బురమునఁ గాంచన వర్షంబుఁ
గురియించి దేవతాకోటి పొగడ
వసుధ నెగడిన మాధవవర్మ వంశ
వర్ధనుం డగు తమ్మ భూవరుని బసవ
పార్థివున కార్యుఁడై కృపాపాత్రుఁ డగుచు
ఘనత మెఱసె ననంతయ గంగవిభుఁడు.”

—అను పద్యము తెలుపుచున్నది. ఇతఁడు పెసరవాయి నియోగి బ్రాహ్మణుఁడు. కాశ్యప గోత్రుఁడు. శివభక్తుఁడు. ఒంగోలు తాలూకా 'చెందలూరు' వాస్తవ్యుఁడు.

"శివ చింతామయ మంతరంగము శివ
శ్రీ పాద పద్మార్చనా
ప్రవణంబుల్ కర పంకజంబులు శివా
పాది ప్రసిద్ధాగమ
శ్రవణోదీర్ణము కర్ణ యుగ్మము శివ
ప్రాసాద పంచాక్షరీ
వ్యవహారజ్ఞ రసజ్ఞ నిమ్మహి ననం
తామాత్య గంగయ్యకున్."

—అను పద్యము వలన నీతని శైవారాధనా తత్పరత వెల్లడి యగుచున్నది. ఇతఁడు శృంగార చారుమూర్తి, రూప కందర్పుఁడు నని 'నాచికేతూపాఖ్యానము' లోని,

"నారమాంబిక భార్యగా భూరి మహిమ
నఖిల దిక్కులఁ దనకీర్తి యతిశయిల్ల
వెలసె నెల్లజనంబులు వినుతి సేయఁ
గాంతి చంద్రుఁ డనంతయ గంగ విభుఁడు."
"శృంగార చారుమూర్తికి
... ... ... ... ... ... ననంతయ
గంగామాత్యునకు రూపకందర్పునకున్."

—అను పద్యములు విదితము సేయు చున్నవి. ఇమ్మహా భాగుఁడు సంగీత శాస్త్రమును గూలంకషముగ నభ్యసించి

సరస, సాహిత్య, కళాసంగత మతియై యుండి, కవిత్వాభిరుచి గల్గి, ప్రబంధముల వ్రాయించి, కృతులఁ గైకొనుటయుఁ, జాటు పద్యములఁ జెప్పించి యందలి రసాస్వాదన మొనర్చి తన్వింం జెందుటయు, దాని యై శశ్వద్యశస్సు నార్జించి యంతతోఁ దనివోక

"సరిలేని నీతిచాతురి చేత రాజ్యా తం
త్రంబును నడపిన నడపుఁ గాని
యనిశంబుఁ బుష్ప చందన వనితాది సౌ
ఖ్యంబుల నందిన నందుఁ గాని
సంగీత సాహిత్య సరస విద్యా వినో
దంబులఁ దగిలినఁ దగులుఁ గాని
స్వామి హితాసక్తి సదవ నాస దను శా
సన లీల జరపిన జరపుఁ గాని
నీళ్ళలోపలి సరసిజ నీ దళంబు
సరవి నిర్లేపుఁడైన సంసారయోగి
సందియము లేదు ప్రత్యక్ష శంభుమూర్తి
యీ యనంతయు గంగ మంత్రీశ్వరుండు."

—అని 'ప్రబోధ చంద్రోదయము' నఁ గృతికర్తలచేఁ బొగడ్త నందిన ఇమ్మంత్రి చూడామణి అపార రాజకీయ వేతృత్వమునఁ దలమునకలై వ్యవహరించు చున్నను "పద్మపత్రమివాంభసి" యన్న తెఱంగున విషయలంపటుఁడు గాక నిర్లేపుఁడై జనకరా జర్షిం బలె నుండె నఁట! ఇట్టి నియతి వ్రతి నిజాత్మ తేజః పుంజంబున నజ్ఞాన తిమిరము ఛిన్నభిన్న

మొనర్చి పరిబుద్ధుం డయి నందూన సాహిత్యాభ్యంభూనుసూర్తి
వోలె నగపించు చుండెను.

ఇతని తండ్రి యనంతయ్య. తల్లి తిప్పమ్మ. అనంతయ్య,

"తల్లి దండ్రుల మనములు చల్లఁ జేసి
యన్నదమ్ముల కుల్లాస మావహించి
శిష్ట జనులకు సమ్మద శ్రీల నించి
కొమ్మ మంత్రి యనంతయ్య కొమరు మిగిలె."

"అతిథి ప్రియాన్నదాన
వ్రతశీలుఁ డనంత మంత్రి ప్రస్తుతి కెక్కెన్
పతిహిత కృతి 'తిప్పాంబిక'
యతనికి నర్థాంగ లక్ష్మి యై విలసిల్లెన్."

—అను పద్యములం బట్టి యతిథి ప్రియాన్నదాన వ్రత
శీలుం డనియుఁ, బతిహిత కృతి 'తిప్పాంబిక' యతనికి నర్థాంగ
లక్ష్మి యై విలసిల్లె ననియుఁ, దల్లిదండ్రుల మనములు చల్లఁ జేసి
యన్నదమ్ముల కుల్లాస మావహించి శిష్ట జనులకు సమ్మద
శ్రీల నించి యనంతయ్య కొమరు మిగిలె ననియు,— స్పష్ట
మగు చున్నది.

అలఘు దయాపయోనిధి యగు ననంతయ్యకును బతి
వ్రతా తిలక మగు 'తిప్పాంబిక' కును,— ఎల్లన, దుగ్గన,
కొమ్మన, గంగయ్య,— అను సుపుత్రు లుదయించిరి. వీరిలోఁ
జిగురువాడేఁ కుల కమలాకర ప్రకర కోకనదాప్తుం డగు
గంగయ్య మంత్రి.

గంగయ్య మంత్రి "అన్నలకు భక్తి సేయుచుఁ
దన్నిశంబును సమస్త ధరణీపతులు
నన్నన్నఁ జూడఁగ మెలఁగుచు
సౌన్నత్య స్థిస్థితుల... ... ..."

—వెలసినాఁడు. [illegible] డగమాన మానధనుఁడు. పర్వతాధీశ కన్యకా ప్రాణనాథ పాదపంకజ యుగళ పుష్పంధయాయమాన మానసుఁడు. దుర్గాభైరరాజు పెద్దన మంత్రి కొమారుఁడు రాజశేఖరుని సుపుత్త్రిక యగు నారమాంబికను వివాహ మొనర్చికొని విఖ్యాత కీర్తిశాలి యయ్యెను.

"మాధవ భూమండలేశ్వర వంశ
జలధికి నే రాజు చందమామ
యేరా జుదయశైల మెలయు విభేదించెఁ
గపటాహిత మదాంధకార మడఁగ
గజపతి సురథాణి గడి దుర్గముల కెల్ల
నేరాజు వజ్రంపుఁ బోరు తలుపు
మహిమచే నేరాజు మఱపించె నల భగీ
రథ పృథు... రామ రఘు రమణుల
నట్టి గుణశాలి తమ్మరాయని కుమార
వీర బసవ క్షమాచక్ర విభుని చేత
మన్ననలు గాంచి మించిన మహితుఁ డితఁడు
మనుజ మాత్రుండె గంగయామాత్య వరుఁడు."

—అను పద్యము రాజనీతి విశారదుఁడు, కుశలుఁడు, పరిపాలనా దక్షుఁడు, సచివాగ్రణి, — యగు గంగయ్య మంత్రి

వలననే, యాతని యుపజ్ఞ వలననే, – బసవభూపాలున కట్టి యశఃకీర్తులు వాటిల్లిన వని సూచించేయు చున్నది.

'ఉదయగిరి' రాజ్యమునకుఁ బ్రబల శత్రులుగానుండి విజయనగర చక్రవర్తులకు ఆ రాజ్యము వశముగాకుండఁ జేయుటయగాక ఆ రాజమార్తాండుల చమూపతి యగు సాళువ నరసింహరాయలను దన యధీన మొనర్చికొనియె నని ప్రతాప రుద్ర గజపతి రచించిన 'సరస్వతీవిలాసము' నను గ్రంథ మందలి

> "మిత్త్రః శేవధరస్య దాతృ పరిష
> ద్యస్యైవ సూనో స్సమం
> సౌందర్యాతిశయాళు కీర్తి సమ
> తౌన్నత్యే తు నైవా పరః
> జీవగ్రాహ మరిం ప్రగృహ్య సమ
> రే కర్ణాట భూమీ ధవం
> దీనోక్తి ప్రవణం నృసింహ మను
> జాధీశం పున స్త్యక్తవాన్."

—అను శ్లోకము వలనఁ దెలియు చున్నది.

కావుననే కాంబోలు 'ప్రబోధ చంద్రోదయము' లో 'నృసింహ నృపతి వశీకర నయ విద్యా కరణ'—అని చెప్పఁ బడినది. ప్రతాపరుద్ర గజపతి తండ్రి పురుషోత్తమ గజపతి సాళువ నరసింహరాయలను యుద్ధభూమిలోఁ బట్టి కొనఁగా, సభయ యాచ్ఞాంజలితో నుదయగిరి రాజ్య మీయఁగా, నాతని విడచి పుచ్చినట్లు లీ క్రింది

"యస్మై నిత్యతర ప్రతాప దహ
న జ్వాలాయమాన ధ్వజ
స్తంభా బద్ధ కుసుంభ రక్తవస
న ప్రేతా విభగ్న ద్విషః
సంధా యాభయ యాచనాంజలి మ
హోగ్రోత్కోదయా ద్రింభయా
దాత్మానం ముముచే నృసింహ నృప
తిః కర్ణాట దేశాధిపః"

– అను 'ప్రతాపరుద్ర గజపతి' శాసన పంక్తులు దెలుపు చున్నవని యాంధ్ర సారస్వత పరిష ద్విచక్షణ సమర్పిత "విమర్శకాగ్రేసర" ఘన బిరుదాభిరాములు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రనినారు.

దీనిం బట్టి మన గంగయ్య మంత్రి నృసింహరాయలను జీవగ్రాహముగాఁ బట్టికొనుటకుఁ గల నయవిద్యాకరణ మహత్త్వ పటుత్వము, బుద్ధి విశేషము, – కలవాఁ డని యూహ్య యగు చున్నది గదా!

ఇయ్యమాత్యమణి దగ్గుబల్లి దుగ్గన (ఇక్కవి శిరోమణి శ్రీనాథ మహాకవి బావమఱఁదియుఁ దెనాలి తాలూకా లోని 'దగ్గుబల్లి' వాస్తవ్యుఁడును, –) రచియించిన 'నాచికేతోపాఖ్యానము'ను, నంది మల్లయ్య ఘంట సింగయ్య యను కవిద్వయ విరచితంబగు 'ప్రబోధ చంద్రోదయము'ను, – గృతి నందెను ఈ కావ్యముల రెండిఁటిని

"సరసులు సుకవీంద్రులు దనుఁ
బరివేష్టింపంగఁ గావ్యబంధుర గోష్ఠీ
పరుఁ డగుచు... ... ..."—

కృతికర్తల రావించి ప్రత్యుత్థానాసన గంధ పుష్పాక్షత కర్పూర తాంబూల జాంబూనదాంబర మణి విభూషణంబుల సంభావితులఁ జేసి కృతి కన్యా గ్రహణం బొనర్చెను.

ఇమ్మంత్రి శిరోమణి పినతండ్రి కొమారుఁ డగు దేవయ్య దుగ్గనామాత్యుఁడు రచియించిన 'కాంచీపుర మహాత్మ్యము' కృతి నందె నని

"మా పినతండ్రి గంగయ య
మాత్య శిఖామణి తత్తనూభవుం
డై పెనుపొందు దేవ సచి
వాగ్రణి కిచ్చితి వంధ్రభాషఁ గాం
చీపురనాథు దివ్యకథ
చిత్ర తరంబుగ విస్తరించి నీ
వోపుదు వార్య హృద్య మధు
రోక్తుల సత్కృతు లొప్పఁ జెప్పఁగన్."—

—అను 'నాచికేతోపాఖ్యాన' పద్యమును బట్టి విదితమగు చున్నది. ఇయ్యభిరామ కావ్యము శ్రుతీతిహాసాదులలో 'నాచికేత' అనియె వాడుక చేయఁ బడినను దుగ్గన తన యల్లిక కనుగుణముగా 'నాసికేతోపాఖ్యాన' మని పే రిడియెను.

చెందలూరి చిక్కయ యను ని వ్యాఖ్యలలో నొకఁడు 'నాసికేతూపాఖ్యానము' ను రచించి ప్రసిద్ధిఁ గాంచెను. ఈ విధముగ నీమంత్రి రత్నములు యశఃకాయు లయిరి.

కాల గర్భమున నణఁగి మణఁగి యున్న యెందఱు సుపుత్త్రు లీ వంశరత్నాకరమునుండి వెలువడ నున్నారో కాలము సూచింపఁ గలదు.

•

పలనాటి అలుగామరాజు మంత్రిణి

# అరవిల్లి నాగమాంబ

(క్రీ. శ. ౧౨ వ శతాబ్దము)

---

పురాణ కాలము నుండి శాస్త్రీ యుగము వఱకును గల వీర వనితల యుత్కృష్ట గాథల నుప లక్షించినచోఁ బల నాఁటి రణకేళికిఁ గారకు రా లయిన నాగమ్మ వీర చరిత్రము క్రొం గ్రొత్త మార్గము ననుగమించుచు స్త్రీ లోకమున కంతకుఁ దేజ స్సొడఁగూర్చు చున్న దనుట యథార్థము. ఈమె పలనాఁటి సీమలోని దగు 'చిట్టి గ్రామాలపాడు వాస్తవ్యుఁ' డగు చౌదరి రామిరెడ్డి కొమార్తె. పంటరెడ్ల తెగకుఁ జెందిన, 'యారవిల్లి' గృహనామము గల్గిన నాగమ్మ అలగాము రాజు నొద్ద మంత్రిణి యై, తన శక్తి సామర్థ్యములచే 'నాయకురాలు' అని వ్యవహరింపఁబడినది.

అపూర్వ గుణ సంపద, ధైర్య సాహసములు, త్యాగ శీలములు, బుద్ధి కుశలత, విషయ పరిశీలనా శక్తి, వక్తృత్వము, —ఎల్లఱ ముగ్ధుల నొనర్చుటయే గాక అందఱ రసనాగ్రముల నర్తించు చుండెడిది.

ఇ వీర వనిత అనుఁగు రాజు కృపాతిశయంబుఁ బడసి 'గురిజాల' చేరుటకు ముందు నాగమ్మ విషయ మంతఁగాఁ

దెలియ రాదు. అనుఁగు రాజు చనిపోయిన తర్వాత నలగామ రాజు నొద్ద మంత్రిణి యై నడపిన రాజ్యతంత్ర కలాప మొకింతఁ దెలియ నగుచున్నది. పల్నాటి వీరచరిత్రమునకు బాలచంద్రుని ప్రచండ శౌర్యోచిత కృత్యములే ప్రముఖ ములై ప్రాధాన్యములై యుండినను గథాభాగమున నధిక ముగఁ బాల్గొన్నవారు నాగాంబ, బ్రహ్మనాయఁడుఁగనే యగ పించు చున్నారు. బ్రహ్మనాయునికిఁ బలనాటి యం దత్యంత గౌరవమును, అధిక కీర్తియుఁ - గలదు.

అనుఁగురాజు మరణకాలమున మలిదేవాదులను బ్రహ్మ నాయని చేతిలోఁ బెట్టి దేహమును జాలించెను. అది మొదలు మలిదేవాదుల బాధ్యత నంతను అనుఁగురాజు తన యందె యుంచికొని వారప్రాప్త వ్యవహారజ్ఞు లగు వఱకును వారితోఁ బడరాని యిడుమల ననుభవించి, రాజ్య పరిపాలనము నతినిపుణతతోఁ జాఁగించి, ప్రజాభిమానమును జూఱఁగొన్న ప్రజ్ఞా ధురీణుఁడు.

మహాభారతమున శ్రీకృష్ణ పరమాత్మ యెట్టిఁడో పలనాటి వీర చరిత్రమున బ్రహ్మనాయఁ డట్టిఁడే! యని యెన్నఁ బడినాఁడు. అట్టి ప్రథితాయుతునకుఁ బోటీగా నాగమ్మ అలగామరాజు రాజ్యభార వహ యై యాతనిఁ దన చెప్పు చేతలలో నుంచికొని బ్రహ్మనాయఁడు లోనగు విఖ్యాత పురుషుల ముప్పుతిప్పలు పెట్టి మూఁడు చెఱువుల నీరు ద్రావించుచు, మహా చతురతతో రాజ్యచక్రమును ద్రిప్పుచు, శశ్వద్యశస్సు నార్జించిన రెడ్డికుల ధీరాగ్రణి.

మలిదేవాదుల పెండ్లి జరగిన తర్వాతఁ గట్నములు గానుకలు ఇచ్చుటకునై బ్రహ్మనాయఁడు గురిజాలకుం జని నపుడు పల్నాఁటి రాజ్యము పొత్తు లేకుండ నలగామునిచే నేకచ్ఛత్రాధిపత్యమునఁ బరిపాలింపఁ జేయువలె నను నుత్సుకతతో, ద్రఢిమతో, దీక్షతో,— నాగమ్మ బ్రహ్మనాయునిఁ గోడి పందెమున కొప్పించి, యందోడిన వారు తమ సర్వస్వము వీడి యేఁడేడులు వలస పోవునట్లు లొడంబఱచి, పందెమునకు వలయు కోళ్ళను లభ్యముగాకుండఁ గట్టుదిట్టము లొనర్చి, తన ధీశక్తిచే నాతని నోటమిఁ బుచ్చి, యాతని రాజ్యసర్వస్వము నపహరించి, 'మాచెఱ్ల' రాజ్యలక్ష్మికిఁ దిలాంజలి నిప్పించి, మలిదేవాదులతో బ్రహ్మనాయనిఁ గృష్ణానదిని దాఁటించి, పరభూములకు వెడల నంపిన సమర్థురాలు.

తమ పరిపాలనయే సాఁగవలె నను గాఢ విశ్వాసమే గడువుఁ దీఱిన తర్వాతఁ గూడఁ దమ రాజ్యభాగమున కయి బ్రహ్మనాయఁడు రాయబారం బంపిన యనుఁగు రాజును విషప్రయోగమునఁ జంపించి సంధి జరగనీక పలనాఁటి వీరుల కోమల కంఠనాళము నుండి ప్రవహించు రక్తధారల చేతనే మాతృభూమినిఁ దడుపుట కీమె కృతనిశ్చయురా లయ్యెను.

ఈమె కేవలము మంత్రిణి యగుటయే గాక 'కార్యమపూఁడి' రంగమున వీరకాశిఁ గట్టి యశ్వారూఢయై స్వపక్షయోధుల నడపించుచు నఖండ శౌర్యోజ్జ్వల మూర్తు లగు బాలచంద్రాదులును యోధాగ్రేసరు లగు బ్రహ్మనాయఁడు లోనగు వారును,—గల శత్రుపక్షము దుర్నిరీక్ష్యమై యొప్పి

నను అవలీలఁగా జయింపఁ జాలిన యకుంఠిత ధైర్య స్థైర్యములతో మగపంతమునఁ జూపిన వీర నారీమణి.

జయాపజయము లీశ్వరాధీనము లౌట వానిం గూర్చి తడవ వలసిన పనిలేదు గాని దుర్నివారక మైన రణక్షేత్రమున భుజ బల పూర్వకముగా రాజ్యతంత్ర గ్రహణమున కయి యున్ముఖుల నొనర్చిన యామె యసమాన శక్తి విస్మయముఁ గొల్పున దగుట నిశ్చయము. యుద్ధ విద్యా విశారద లయి, ప్రవూర్ణ లయి, — శాత్రవ కంఠ లుంఠన మతి సులువుగాఁ జాఁగించిన రాణీ సంయుక్త, వీరమతి, లక్ష్మీబాయి, రుద్రమదేవి,—లోనగు నిరుపమాన తేజస్వినులెందఱో కలరు. తమ భర్తలకు బాసట లయి యసంఖ్య యోధ గణము నెదుర్కొని రణవిద్యా నైపుణ్యము నగపఱచి శత్రుసంహారముఁ జేసి ప్రాణములఁ గూడఁ గోల్పోయి చరితార్థ లయిన వారును,— కలరు. తమ శీలము భంగము కానున్న సందర్భములలో స్త్రీజనోచిత ప్రకృతిని విడనాడి దుర్మదాంధుల నుక్కడించి మించినవారును గలరు. రాజ్యాభిషిక్త లయి సాహసౌదార్యములచే రాజ్యపరిపాలన మొనర్చిన మహారాజ్ఞీమ తల్లులును గలరు. విద్యా, వినయ, సుగుణ, సంపత్తిచేఁ బతివ్రతా ధర్మముచేతను, దీనపోషణము, ఆశ్రిత వత్సలత, ఆతిథేయ సత్కృతి,—లోనగు వానిచేతను,— వినుతి కెక్కిన సతీమ తల్లు లెందఱో కలరు.

కాని యీమె వలె మంత్రిణి యై సర్వము తాన యై రాజ్య చక్ర మవలీలఁ ద్రిప్పి ప్రజ్ఞా ప్రాభవ కీర్తుల నగపఱచిన వా రెవ్వఱు నగపింపరు.

వృపమిప్పు ఉదాత్త హృదయులు, తేజోనిధులు, నయ్యును బుద్ధి బలమున మంత్రుల సాహాయ్యము తోడ్పాటు నర్థించ వలసిన వారే యాతం రాజ్య పరిపాలనమునం, దత్త దుచిత ప్రజ్ఞను, – నామ మాత్రులుగనే పరిగణింపఁ బడు చుండిరి. కావుననే పరిపాలనా రూపమున మంత్రి సూత్ర ధారులై సర్వభార వహులై యనుక్షణమును దన బుద్ధి కుశలత వలన రాజ్యమును బరిరక్షించు చుండును. గావున సర్వతోముఖమైన ప్రజ్ఞ కలవారే మంత్రిత్వము నెఱపు చుండిరి.

భారత నారీమణులలో నింత దనుక నిట్టి ప్రజ్ఞాధురీణ యగపడదు. ఈమె యందే నేని లోపము లున్నను అవి స్వార్థ రహితములై రాజ్యకార్య తంత్రజ్ఞతకుం జెందిన వగుటచే నాగమ్మ ప్రతిభకు లోటు వాటిల్ల దని తలంప నగును. ఇయ్యశస్వి చరితామృతము ఆబాలగోపాలము తనివిఁ దీఱఁ గ్రోలుదురు గాక !

# నాదిండ్ల అప్పన మంత్రి

(క్రీ. శ. ౧౬ వ శతాబ్దము.)

---

ఈ నాదిండ్ల వారి వంశమునకు మూలపురుషుఁడు కౌశిక గోత్రమున నుదయించిన నామనమంత్రి. ఇతనికి సింగమాంబ యందు మాదయ్య, గంగన, చిట్టి గంగన యను మూవురు పుత్త్రులు జనించిరి. ఇందుఁ జిట్టి గంగన యనంగ సమాన రూపరేఖా లలితాంగుఁడు, సాళువ నృసింహ మనుజ ప్రభు కార్యకళా ధురంధరుఁడు. లవణాబ్ధి వేష్టిత ధరాధిప దుర్మత మంత్ర మంత్రి శుండాల వితాన కేసరి. అప్పని మాదయ గారి మల్లన రచించిన 'రాజశేఖర చరిత్రము' నఁ గల

"సాళువ నారసింహ మను
జ ప్రభు కార్య కళా ధురంధరుం
డై లవణాబ్ధి వేష్టిత ధ
రాధిప దుర్మత మంత్ర మంత్రి శుం
డాల వితాన కేసరి య
నంగ సమాన రూపరే
ఖా లలితాంగుఁ డట్టి చిట్టి
గంగన యొప్పు గుణానుషంగుఁడై."

—అను (ప్ర. ఆ; ప. ౧౯) పద్య మవగత మొనర్చుచున్నది. ఇమ్మూవురలో నగ్రసరుఁ డగు మాదయ్యకు

నమలాంబ యందు నన్నయ్య, లింగయ్య, వరదయ్య, మాధవయ్య, రామభద్రయ్య యను కొమాళ్లుదయించిరి. వీరి గుణ విశేషములు 'రాజశేఖర చరిత్రము' న

"ఆరూఢోన్నతి నన్నపార్యుఁడును లిం
గామాత్యుఁడు న్సర్వవి
ద్యా రాజీవ భవాకృతి న్వరద దం
డాధీశుఁడు న్మంత్రిచూ
డారత్నం బగు మాధవుండు నరిరా
డ్గర్వచ్ఛిదా పాదన
శ్రీరామాపరమూర్తి యీతఁ డనఁగా
శ్రీరామభద్రాఖ్యుఁడున్."

—అని (ప్ర. ఆ. ప ౨౨) వర్ణింపఁ బడినవి. వీరిలో వరదయ్యకు గోపమాంబ యందుఁ దిమ్మన, చిన తిమ్మన, కొండయ్య యను మూవురు కొమాళ్లు జనించిరి. ఇం దగ్రజుఁ డగు తిమ్మన యవారిత శౌర్యుఁడు. అట్లని 'రాజశేఖర చరిత్ర' మందలి

"వారల లోన నగ్రజుఁ డ
వారిత శౌర్యుఁడు తిమ్మమంత్రి మం
దార ముదగ్రదోరసి వి
దారిత దారుణ వైరివీర కం
ఠీరవ కంఠ శోణిత ధు
నీ ఘన ఫేన విభాసిత త్పత
ద్భూరి సితాతపత్త్రి రణ
భూమి యతం డొక మంత్రి మాత్రుఁడే!"

—అను (ప్ర. ఆ; ౨౮ ప.) పద్యము తెలియఁ జేయుచు న్నది. ఈ తిమ్మమంత్రి నాదిండ్లాన్వయ వార్ధి శీతరుచి దాన కౌత్రి సంపన్నుఁడు. ఆశాదంతావళ దంతకుంతి పటల స్ఫూర్తాళు సత్కీర్తి. నానాదేశ క్షితిపాల మంత్రి కుల రత్నము. ఆశ్రిత వ్రాత వీతౌ దాక్షిణ్య నివాస భూమి. అట్లని 'రాజశేఖర చరిత్ర' (ప్ర. ఆ: ౨౫ ప.) మందలి

"నాదిండ్లాన్వయ వార్ధి శీతరుచి దా
న కౌత్రి సంపన్నుఁ డా
శా దంతావళ దంతకుంత పటల
స్ఫూర్తాళు సత్కీర్తి నా
నా దేశ క్షితి పాల మంత్రికుల ర
త్నం బాశ్రిత వ్రాత వీ
తౌ దాక్షిణ్య నివాస భూమి యని లో
క ఖ్యాతి మించె న్మహిన్."

—అను పద్యము స్పష్టపఱచు చున్నది. సత్యగుణశీలి యగు నిమ్మహా సచివమణికిఁ గృష్ణమాంబ యందుఁ గోన మంత్రి అప్పన ప్రభుఁడు, గోప దండనాథుఁడు,—నను ముప్వురు పుత్త్రులు గలిగిరి. అప్పన ప్రభుఁడే యప్పన మంత్రి. గోప దండనాథుఁడే గోపన మంత్రి. వీ రిద్దఱును అన్యోన్య ప్రియులై రామ లక్ష్మణాకృతు లగుచు నలరి రని 'రాజశేఖర చరిత్ర' (ప్ర. ఆ. ౨౯ ప.) మందలి

"ఆ యనుగుం దమ్ముఁడు విన
యాయత మతిఁ గొల్వ నప్పనార్యుఁడు నతఁడు

న్ప్రియక యన్యోన్య ప్రియు
లై యలరిరి రామ లక్ష్మణాకృతు లగుచున్."—
—అను పద్య మవగత మొనర్చుచున్నది.

సకల కర్ణాట రక్షా విచక్షణుండును, దీనసురశాఖియు, శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమునకుఁ గులక్రమాగత మహామాత్యుండును, – నగు సాళ్వ తిమ్మ దండనాథునకు లక్ష్మాంబ యందు జనించిన కొమార్తె తిరుమలాంబను నాదిండ్ల అప్పన మంత్రికొసఁగి వివాహ మొనర్చెను.

"ఆ యప్పమంత్రి గుణములు
వేయి తెఱంగులఁ జెలంగి వినుతి యొనర్ప
న్నాయఁగఁ గాకోదర కుల
నాయకునకుఁ గాక కవిజనంబుల తరమే!"

"నిజ కీర్తి జలధి కున్నిద్ర గుణస్ఫూర్తి
నిత్య పూర్ణేందుఁగా నిలిపినాఁడు
కర హేతి పరశిరః క్రమ కిరీటాగ్ర
పీఠులపై వాఁడిఁ బెట్టినాఁడు
ధరఁ దాల్ప హరిదంత దంతి సంతానంబు
మూలకు ముట్టఁగాఁ దోలినాఁడుఁ
వాచా నిరూఢి గర్వము సూపవచ్చిన
శేషాహి నాలుకల్ చీరినాఁడు
కపట రాజన్య మంత్రి దుర్గర్వ భార
తిమిర పటలంబు శేముషీ తీవ్రభాను
భాను మాలికచేఁ బటాపంచఁజేసి
వెలసినాఁ డనిన వినుతిఁగాంచె."—

"పలుమా ఱంబుధరంబు చూపు బహురూ
పం బంబరాసక్తి శీ
తలభానుండును బొల్పుఁ జెందుటకునై
తాల్చుం గళాప్రౌఢి ని
చ్చలు వారింపఁ జరించు వారినిధి యూ
శా బద్ధుఁడై వీరల
న్నిలకింపం దగు నోటు దాత లని నా
దిం డ్లప్పనిం జెప్పవోఁగా,"

—అను 'రాజశేఖర చరిత్ర' మందలి (ప్ర. ఆ. ౩౦,౩౧, ౩౨ పద్యములు) పద్యము లిమ్మంత్రి చూడామణి గుణగణాం బుల, రూపురేఖల,— దీప్తి దిద్దినట్టు లవగత మొనర్చు చున్నవి.

శ్రీకృష్ణదేవరాయలకుఁ బితృ తుల్యుఁడై, మహా రాజ్య ప్రవర్తకుఁడై, యత్యధిక గౌరవముం బడసిన సాళువ తిమ్మ సచివాగ్రణిని, అతని యర్ధాంగి లక్ష్మాంబను,— మాదయగారి మల్లన యెటుల వినుతించెనో యీ క్రింది పద్యమును జూడుఁడు.

"ఏ మంత్రి మణి నిజ స్వామికార్య క్రియా
తత్పర మానసోత్సాహ శాలి
ఏ మంత్రి మణి మిత్ర హిత బాంధవాశ్రిత
ప్రకర రక్షణ కళాప్రౌఢి బుద్ధి
ఏ మంత్రి మణి వచో హేలాతి నైర్మల్య
శీతలతా ధూత శీతరోచి

ఏ మంత్రి మణి సుధాధామ శాంభవధామ
ధాళధళ్య సుతుల్య ధవళకీర్తి
యట్టి మంత్రి కులోత్తంస మహిత నృపతి
పటల మకుటాగ్ర ఘటిత పత్పద్మ యుగళి
సకల కర్ణాట రక్షా విచక్షణుండు
దీన సురశాఖి సాళువ తిమ్మమంత్రి"

"అమ్మహా మంత్రి కతని యర్ధాంగ లక్ష్మి
సకల పుణ్యాంగనా జన శ్లాఘనీయ
లక్ష్మమాంబకు నుదయించి లలిని మెఱయు
తిరుమలాంబికఁ బెండ్లియై తేజరిల్లె"

—అప్పన మంత్రి, ఇ య్యప్పన మంత్రి యువతీజన చిత్త వినూత్న దర్పకుఁడు. వివేక శాలి, ఆశ్రిత వత్సలుఁడు. కావు ననే యాతని శుభ్రకీర్తు లమృతాంధ స్సింధు రోచీ ఘటా తాదాత్మ్యంబు వహింపఁబోలు.

కాఁబట్టియే మాదయగారి మల్లన
"శీల వదాళి విధాతకు
సాళువ తిమ్మప్రధాన జామాతకు ను
ద్వేల స్పర్శన విజిత
త్రైలోక్య చరాచర ప్రదాతకుఁ బ్రీతిన్."

—అభ్యుదయ పరంపరాభివృద్ధిగా 'రాజశేఖర చరిత్ర' ను రచించి కృతి యొసంగెను. మంగళగిరి శ్రీ లక్ష్మీ నృసింహ స్వామి యాలయమున కెక్కు మెట్లు చేరువనున్న స్తంభము నకు నాల్గు ప్రక్కల శా. శ. ౧౪౪౩ (వృష సంవత్సరమున)

క్రీ. శ. ౧౫౨౧ వ సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయ మహామాత్యుం డగు సాళువ తిమ్మ దండనాథుఁడు చెక్కించిన శాసనముం బట్టి నాదిండ్ల అప్పన ప్రభుచే గొండవీటి దుర్గ పరిపాలకునిఁగా తిమ్మ దండనాథాగ్రణి నియమించి నట్లు లగపడుచున్నది.

అప్పన తన తమ్మునివలెఁ గృతికర్త గా కున్నను గృతిపతియై 'రాజశేఖర చరిత్ర' ను గృతినందికొనుట వలనఁ గవిజన పోషకుం డని నిర్ధరింప వచ్చును. శా. శ. ౧౪౩౭ దాతృ సంవత్సరమున నప్పప్రభుఁడు మంగళగిరి దేవాలయమునకు మండప ప్రాకారములఁ గట్టించె ననియు, శా. శ. ౧౪౩౯ ఈశ్వర సంవత్సరమున నప్పప్రభుఁడు చెక్కించిన రెండు శాసనముల వలనఁ గొండజు బ్రాహ్మణుల కతఁడు దానము లొసంగె ననియుఁ,— గొండవీటి యందు వొక స్తంభము మీఁద శా. శ. ౧౪౪౨ (క్రీ.శ. ౧౫౨౦) విక్రమ సంవత్సరమున నాదిండ్ల గోపన చెక్కించిన శాసనముం బట్టి యతఁడు కొండవీటి శ్రీరామ స్వామికి నాభరణాదుల నొసంగె ననియు, —విదిత మగు చున్నది.

మీఁది శాసనములలోఁ దుది రెండిటి యందు మొదటి శాసనము సంస్కృతాంధ్రము లందును, రెండవ శాసనము సంస్కృతమునను,— రచింపఁబడినవి. ఇవి గాక శా. శ. ౧౪౪౩ వృష సంవత్సరమున శ్రీ కృష్ణదేవరాయలు సంస్కృతమునఁ జెక్కించిన శాసన మొకటి గుంటూరు తాలూకా లోని 'కాజ' గ్రామ మందలి శ్రీ కోదండరామస్వామి

యాలయమునఁ గలదు. ఈమాన్యుఁడు శాసనములును మన్త్రి శాస్త్ర జ్యోతిశ్శాస్త్ర, షడ్దర్శన, ధర్మశాస్త్రములలో గ్రంథములు రచియించిన పండితాఖండలుఁ డగు లొల్ల లక్ష్మీధర సూరి లిఖించినవి. ఇప్పండితాఖండలుఁడు తెనాలి కనతి దూరంబునఁ గల 'కొల్లూరు' వాస్తవ్యుఁడు.

శ్రీ కృష్ణదేవరాయలు శా. శ. ౧౪౩౭ (యువ సంవత్సరాషాఢ శుక్లైకాదశీ మందవాసరము) క్రీ. శ. ౧౫౧౫ దవ సంవత్సరము జూన్ ౨౩ వ తేదీన 'కొండవీటి దుర్గము' ను బరిపాలకుని (Governor) గా సాళ్వతిమ్మ మహామంత్రీశ్వరుఁడు నియమించినట్టును, శా. శ. ౧౪౪౨ (విక్రమ సంవత్సరమునc) గ్రీస్తు శకము ౧౫౨౦ వ సంవత్సరము మే నెల ౨ వ తేదీన సత్తెనపల్లె తాలూకాలోని 'పేరూరు' నందలి శివ కేశవులకు భూదానమును ఆతఁడు సేసినట్టును,—గోప సచివుఁడు స్తంభముపైఁ జెక్కించిన శాసనము వలనఁ దెలియందగి యున్నది.

దీనిం బట్టి గోప దండనాథాగ్రణి యప్పటికిఁ గొండవీటి దుర్గమున కధ్యక్షుఁడుఁగా నున్న యట్టు లవగత మగు చున్నది. సాళ్వ తిమ్మ సచివాగ్రణి శా. శ. ౧౪౪౩ (వృషసంవత్సరమునc) గ్రీస్తు శకము ౧౫౨౧ వ సంవత్సరమునఁ జెక్కించిన శాసనముం బట్టి యప్పు ప్రభుని దుర్గపరిపాలకునిగా నియమించినట్టు లగపడుచున్నది. కాని

"నాదిండ్ల తిమ్మయామాత్య
కళత్రం కృష్ణమాంబికా,

త త్పుత్రో వప్పయా మాత్య
గోపయామాత్య శేఖరా."
"శ్రీకృష్ణ క్షితిపాల తిమ్మ సచి వా
త్పల్యం కికా చామరే,
ఛత్రం యో వినికొండ గు త్తి కనక
క్ష్మాభ్యః పురా ధ్యక్షతామ్,
మ త్తే భాశ్వపదాతి సంకుల మహా
సేనాధి పత్యం మహా,
ద్రాజైకత్వ ధురంధరత్వ మగమ
న్నాదిండ్ల యప్ప ప్రభుః."
"శ్రీ కృష్ణరాయ నరనాథ శిరః ప్రధాన
శ్రీ సాళ్వ తిమ్మ సచివేశ్వర భాగినేయః
నాదిండ్ల యప్ప సచివో నయత త్త్వ వేదీ
శ్రీ కొండవీటి నగరైక ధురంధరోఽభూత్"

—అను వాక్యములఁ బట్టి యప్పన 'వినికొండ' (Vinukonda) దుర్గాధ్యక్షుఁడుగా నుండి నయత త్త్వ వేదియై, విజ్ఞాన ఖనియై, సంస్కృతాంధ్ర భాషలఁ గృతులఁ జెప్పించెను.

త్రేతా యుగమున శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణ స్వామితోఁ గూడి సీతాన్వేషణార్థమై కేగు దక్షిణాభి ముఖుం డయి పోవుచు రావణుని ఖడ్గమున ఖండితుఁడై తన వార్త నిచ్చి నేలంగూలి యున్న జటాయువు వలన లంకాధిపతి సీత నపహరించి పోయె నన్న వార్త నిచ్చుట వినియుండుటచే నీ పర్వతమునకు 'విన్నకొండ' యను పేరు వచ్చె నని యభిజ్ఞు

లను చుండురు. గ్రామము నంటిపట్టికొని యీ కొండ కలదు.
దీని తుదీచీ భాగమున నొక వీరాంజనేయ విగ్రహ మున్నది.
ఆ స్వామిని గుంటి యాంజనేయ స్వామి యని పిలుచు
చుందురు. కొండపైన రామలింగేశ్వర స్వామి యాలయము,
పెద్ద మండపము, రామ గుండము, సీత గుండము, మంచినీటి
దొనలు, తీఁగ బావి,—అనేక చిన్నచిన్న గుహలు, – కలవు.
కొండ క్రింద 'చిన్నకొండ' గ్రామము కలదు.

ఈ దుర్గమును బరిపాలించుటకు నియమింపఁబడిన
యప్ప మంత్రి యార్వేల వంశవార్ధి పూర్ణచంద్రుం డని

"పారద ప్రభా విభాసి భవ్యకీర్తి వాహినీ
పూరదాన ధూత దివ్యభూజ రత్నకామ ధు
గ్వార యారువేల వంశవార్ధి పూర్ణచంద్ర మా
సార బుద్ధి జాల నీతి శత్రుభూమి భృద్రమా !"

—అను 'రాజశేఖర చరిత్ర' (ద్వి. అ; ౧౯౨ ప) యందలి
సుగంధి వృత్తము దెలుపు చున్నది. ఈ గ్రంథమును రచించిన
తర్వాత వ్రాయఁబడిన 'కృష్ణార్జున సంవాదము' నఁ గల

"అందు నప్పన మంత్రి యాచక లోక
మందార భూజ సమాన వైభవుఁడు
రాజశేఖర చరిత్రమున కధినాథుఁ
డాజి కిరీటి మహాభాగ్య యుతుఁడు
శ్రీ యశో నిత్యుండు... ... ..."

—అను వాక్యములు – అప్పన మంత్రి యాచకలోక
మందార భూజ సమాన వైభవుఁ డనియు, నాజికిరీటి మహా

భాగ్యయుతం బనియుఁ,— దెలుపుచున్నవి. అంతియకాక సంస్కృతాంధ్ర వాఙ్మయముల పెంపునకుఁ గారణమ్మయి యనేకాగ్రహారమ్ముల ధర్మమ్మొనర్చి తటాకారామాది వసతులఁ గల్పించి సత్పరిపాలనము నెఱపి ప్రజల కృతజ్ఞతకు భాజను లయి రని

"శాకాబ్దే నవ వహ్ని వార్ధి వసుధా
గణ్యేశ్వరే వత్సరే
సుక్షేత్రం వినికొండ కుండి సరితో
ర్మధ్యే కియ న్మాత్రతః
కృత్వా గ్రామవరం తటాక కలితం
చాప్ప పురాఖ్యాన్వితం
ప్రాదా దంగడి గోపినాథ హరయే
నాదిండ్ల యప్పప్రభుః."

"అనంత గోపీనాథాయ
రొంపిచర్ల నివాసినే
ప్రాదా ద్గోవరం గ్రామం
నాదిండ్లాప్పయ మన్త్రిరాట్."

"మద్దిరాల పురి మాధవ దేవ్యై
వహ్ని మది జలధీందు శశాంకే
హైడిమజ్జు మదిశ త్పరిపూర్ణం
గ్రామ మా వసుధ మప్పయ మంత్రీ."

"బ్రహ్మాగ్ని వేద శశి గణ్య శకేశ్వరేఽబ్దే
నాదిండ్ల యప్ప సచివో వినికొండ దుర్గే

రామేశ్వరాయ ఘన మంటప వప్రి సౌధా
రమ్యాలయం సమతనోత్సుమతో రసజ్ఞః"
"శాకేశ (?) వహ్ని నిగమేందు గదాత్య వర్షే
నాదిండ్ల తిమ్మ సచివాత్మ భ వాప్ప యార్యః
ఓంకార నామ సరి దంతిక నందిపాటి
గ్రామే శివాలయ మనర్ఘ్య మపావకార్షీత్,
... ... ... ... ... ..."

—అను వాక్యము లవగత మొనర్చు చున్నవి. ఇతని వీరత్వమును

"నాదిండ్ల నున్న రిపులకు
నే దండను నైనఁ దిరుగ రెల్ల ధరిత్రిః
ఏ దండనైన విజయము
నాదిం డ్లయ్యన్న దండనాథాగ్రిణికిః."

—అను పద్యము స్పష్టీకరించు చున్నది.

ఇట్టి వీరవిక్రమాదిత్యునకుఁ, బరిపాలనా దక్షునకు, దానికి, భాషాపోషకునకుఁ, గృతిపతికిఁ, బ్రజాహితైక లిత్పరునకు మ న్నమో వాకములు. ఇతఁడు నరసరాయనిపేటకు సమీప దూరమున నున్న 'నాదిండ్ల' వాస్తవ్యుఁడు. నాదిండ్లవారే 'అన్నాప్రెగడ' వారుగా మాఱిరని 'కొండవీటి దండకవిలె' సాటు చున్నది.

కుమార కంపన రాయల మంత్రి

# గోపన మంత్రి

(క్రీ. శ. ౧౪ వ శతాబ్దము.)

ఇతఁడు 'ముల్బాగలు' రాజ్యాధినేత యగు కుమార కంపనకు దండనాయకుఁడు. అభినవ ద్రోణాచార్యుఁడు, శౌర్య ధనుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. హరి హరరాయల కాలమున విజయనగర సామ్రాజ్యము నాలుభాగ ములుగ విభజింపఁబడియెను. ఆ యాలు భాగములలోఁ నుదయ గిరి' రాజ్య మొకటి. దీనిం దొలుత కంపరాయలు, నాతని తర్వాత సంగమరాజు, సావన్న యొడయరులును బరిపాలిం చిరి. సంగముని యొద్ద సాయనాచార్యులు సచివోత్తముఁ డుఁగా నుండి నెల్లూరు నం దుండుచుండెను. వనవాసి, చంద్ర గుత్తి, గోవారాజ్యములు గల 'ఆరగమలె' రాజ్యమునఁ గొంత భాగమును మారపరాయలును, 'ములువాయి' రాజ్య మును ముద్దనరాయలును, 'రాజగంభీర రాజ్యము'ను కుమార కంపరాయలును, - బరిపాలించు చుండిరి. ఇ వ్విభజనము పరి పాలనా సుకరమే యయ్యెను శత్రువులకు దుర్గమ మయి యుండెను.

బుక్కరాయలు పరిపాలించు చుండఁగా నతని జ్యేష్ఠ పుత్త్రుఁడు కంపరాయలు పెక్కు పర్యాయములు విజయ

యాత్రల కేఁగి విజయలక్ష్మి దీప్తియుక్తుఁడై మరలి వచ్చెను. దక్షిణ జైత్రయాత్రకుం జనినపుడు కంపరాయలవెంట గోప మంత్రియు, సాళువ మంగుఁడును, సహకారులుగా నుండిరి. ద్రవిడదేశపాలకుఁ డగు సాంపరాయలకును గంపరాయల సైన్యమునకును గొప్ప యుద్ధము జరగెను. సాంపరాయలు మిపుల బలదర్పములతోఁ బాలేరు నాధారించికొని శత్రు యూథంబుల నెదిరించెను. కంపరాయల సైన్యము యుద్ధమున నాఱితేఱిన దగుటచే నుపాయాన్వేషణమునఁ బాలేరు దాఁటి యాకస్మికముగాఁ బైనబడి ద్రవిడసైన్యమును దునుమాడెను. సాంపరాయలు 'పడవీడు' దుర్గము నందుఁజేరి ధైర్య స్థైర్యము లతోఁ జిఱకాలము పోరాడెను గాని కంపరాయలు సాంప రాయలను వశపఱచికొని యాతని సామంతునిగా నేర్పరచి "సాంపరాయ స్థాపనాచార్య" బిరుదము వహించెను.

బుక్కరాయలు 'తొండమండలము' పై దండయాత్ర సాఁగించినపుడు 'ముల్బాగలు' రాష్ట్రాధిపతి యగు కుమార కంపన యుద్ధమునకు నడవఁగా, ఇతనికిఁ బ్రాఁపుగ 'నుదయగిరి' సేనలు సావణ ఉడయుల యధ్వర్యమున బయల్దేఱినవి. సంగ ముఁడును, అతని మంత్రి సాయణుఁడును, - గూడ యుద్ధము నకుఁ దరలిరి. ఈ యుభయసైన్యములును దొండమండల మునఁ గలిసి "సంబువరాయ" రాజ్యమును గలఁచివైచినవి.

విజయనగర రాయలకుఁ జెందిన రాష్ట్రమును స్వాధీ నముఁ జేసికొనియున్న రాజనారాయణ సంబువ రాయలు ఏక కాలమున రెండు రంగములలో విజయనగరము వారి

నెదుర్కొనవలసి వచ్చెను. నిజబలము లన్నిటి నొక తలఁ జేసి యెదుర్కొనినను రాయరాణువతోఁ బోరఁగల శక్తి రాజ నారాయణ సంబువరాయలకు లేదు కాఁగా, భీకర సంకులము జరగి సాయంబుని విక్రమాటోప కలంబున నుదయగిరి సైన్యము విజయదుందుభిని మ్రోఁగించెను. తరువీర సావణ్ణ ఉడయలు కాంచీపురము (Canjeevaram) ను స్వాధీనపఱచికొని యెను.

ఇఁక 'ముల్బాగలు' నుండి కుమార కంపన దండును దరలింపఁ జేసి తూర్పు కనుమల లోని లోయ మార్గము గుండ బయనము సాగించి పాలేటిని దాఁటి దాని దక్షిణ తటమున 'విరింది పురము' న విడిసెను. పాలేటి యొడ్డున భీకర సంగ్రామము పొసఁగి యందు రాజనారాయణ సంబువరాయఁ డోడి శత్రు దుర్భేద్య మని ప్రశస్తి నందిన 'రాజగంభీర గిరి' దుర్గమునఁ దలఁ దాచికొని యెను. గాని యాతని వెన్నడిఁగొని వచ్చి కుమార కంపన ఆ దుర్గమును ముట్టడింపఁగా, సంబువ రాయఁడు నిలువఁ జాలక కోట ద్వారాజాలలో నొక దానిం దెఱపించి కృపాణ హస్తుఁడై వెలువడి కంపనరాయలతో నెకాంగి పోరు సల్పి రణశయ్య నలంకరించఁగా, నంతట గండరగూళి మారయ నాయకుని యుధ్వర్యమున విజయనగర సేనలు 'రాజగంభీర' దుర్గమును స్వాధీనముఁ జేసికొని యెను.

అం దున్న రాజనారాయణుని కొమారుఁడు బందీ యయ్యెను. అంతతోఁ దొండమండలమున సంబువరాయల యేల్బడి యంతరించినది.

కుమార కంపన 'రాజగంభీర' దుర్గమునుండి బయల్దేఱి యంతకు మున్నె [illegible] స్వాధీనము జేసికొని యున్న సంబువరాయల రాజధాని 'కాంచీపురము'నకుం జని యచ్చో స్థిరముగ నుండి తొండమండలమును బరిపాలింప నారంభించెను. కాని యా దిగ్విజయముతోఁ గుమార కంపన దక్షిణ దిగ్విజయ యాత్ర ముగింపలేదు. మధుర మహమ్మదీయ రాజ్యమును బడఁగొట్టవలె నని కుమార కంపన తలంచి యుండెను బుక్కరాయల యుపదేశ మట్టిది. హిందూధర్మ పునరుద్ధరణమే యీ దండయాత్ర పరమప్రాప్య మగుటచేఁ గుమార కంపనతోఁ గాపేటి రంగనాథుఁడు స్వస్థలము సేరుటకు బయల్దేఱినాఁడు.

ఇప్పనికిఁ జాలినవాఁడును, భక్తశిఖామణియు, నభినవ ద్రోణుఁడును, నగు గోపన్న కుమార కంపన సేనానాయకుఁడు. ఇతఁడు పట్టుదలతో దీక్షతో నుద్దిష్ట కార్యము నెఱవేర్పఁ గల నియోగి బ్రాహ్మణుఁడు.

కావున నాతని సుషుప్తి యందు శ్రీరంగనాయకుఁ డగపించి "వత్సా! తురుష్కులఁ బాఱఁద్రోలి మమ్ము శ్రీరంగమునకుఁ జేర్ప నీవ వలయుదువు"—అని యాదేశించెను. కాఁగా నిద్రలేని గోపనమంత్రి వేంకటాచలమునకుఁ బోయి శ్రీరంగనాథుని నాచ్చియారులతోఁ గూడఁ దోడ్కొని కుమార కంపన వెంట దక్షిణ దిగ్విజయ యాత్ర వెడలెను. తొండమండలమును సాధించి, సంబువరాయ రాష్ట్రమును బూర్ణముగ స్వాధీనముఁ జేసికొనిన తర్వాతఁ గుమార కంపన మధుర

మహమ్మదీయ రాజ్య గడిప్రదేశమున నున్న "రాజగంభీర"
దుర్గమునకు గోపన్నను అధిపతిగా నియమించెనని

"జింజీపురము చెంత సింగవరంబున
నగ్రహారముఁ జేసి యుండెఁ బిదప
కోవెలఁ గట్టించి గోపనాయకుఁడు రంగ
పతినిఁ బ్రతిష్ఠించె భక్తి నెఱయ"

—అను వాక్యము నిదర్శించుచున్నది.

సంబువరాయ మధుర రాజ్యముల నడుమ గడిప్రదేశమునఁ గొన్ని యాటవిక సంస్థానము లుండినవి. ఆరణ్యక మధ్య సీమల దుర్గము లుండుటవలన నవి దుస్సాధ్యములు. వానిం జయించి యాక్రమించుకొనక ముందుఁ దత్ప్రయత్నములు సల్పుట బాగులేదు. ఆ కారణమున మధుర రాజ్యముపై వెంటనే పడుటకవకాశము లేకుండుటయు, బహమనీ రాజ్యముతోడి బలవత్తరమైన యుద్ధమును,— గారణము లయినవి.

కంపిలి రాయల నాఁట నుండియుఁ గంపిలి రాజ్యమునకును, దేవగిరి రాజ్యమునకును,— కృష్ణానది సరిహద్దుగా నుండినది. మహమ్మదిబ్బన్ తుగ్లకుకుఁ గంపిలి రాజ్యము జయించి దిల్లి సామ్రాజ్యమునఁ గలిపివైచిన తర్వాతఁ గూడ వేర్వేఱు రాష్ట్రాధిపతుల యేలుబడి యందున్నను ఈ సరిహద్దు మాత్రము మాఱలేదు.

హరిహర బుక్కరాయలు ఢిల్లీపతి మీఁదఁ దిరుగఁబడి స్వాతంత్ర్య వాంఛను బ్రకటించిన పిమ్మటను గూడఁ గృష్ణా

నదికి దక్షిణ దిశనున్న రాష్ట్రము వారి యేల్బడి యందే యుండినది. కాని హసన్‌గంగు 'గుల్బర్గ' యందు స్వతంత్ర ప్రభుత్వ మేర్పాటు కాఁబడినది మొదలు కృష్ణా తుంగభద్రల నడుమ నంతర్వేదినిఁ గబళింప నుద్యమించి హరిహర రాయల రాజ్యాంతిమ దశను దండెత్తి యందుఁ జాల భాగము నాక్రమించెను. అటులనే తెలింగాణముపై నెత్తి వచ్చి కాపయ నాయకుని నోడించి యాతని నుండి 'కౌలాసు' లోనగు సీమల నూడిచి కొనియెను. దాన వారందఱును దను తమ దేశములఁ గైకొనుట కయి వేచి యుండిరి.

మహమ్మద్ శాహు రాజ్యమునకు వచ్చిన పిమ్మట విజయనగర, తెలింగాణా రాజ్యముల వారు తమ నష్ట భాగములఁ గైకొనుట కదియ సమయ మని తలఁచి సమయ మొకండు గావించికొని యేక కాలమున 'గుల్బర్గకు' రాయబారుల నంపిరి.

విజయనగర - మహమ్మదీయ రాజ్యములకు ననాది నుండియుఁ గృష్ణానది సరిహద్దుగా నుండె ననియు, సులతాన్ అల్లాయుద్దీన్, హసన్ గంగు అక్రమముగఁ గృష్ణానదిని దాఁటి దానికి దక్షిణమున నుండు విజయనగర రాజ్యము నాక్రమించి కొనె ననియు, నితఁ డక్రమముగఁ దీసికొనిన రాజ్యమును మరలఁ దన కప్పగించవలె ననియు, లేనిచో దండెత్తి తన రాజ్యమును దాను గైకొందు ననియు,—. బుక్కరాయలు దెలుపఁగాఁ, గాపయ నాయకుఁడు 'కౌలాసు' మున్నగు సీమలు పూర్వము నుండియుఁ దెలింగాణమునకుఁ జెందినవే యగుట

సులతాను, అల్లాయుద్దీన్, హసన్ గంగు అక్రమముగ వానిం
జేర్చుట యుచితముగ లే దనియు, మరల వానిం దమ పరము
సేయుట న్యాయ్య మనియు, లేనియెడలఁ దైఁబడి వానిం
ద్రొక్కొందు మనియుఁ—దెలియం బఱచెను.

కాని మహమ్మద్ శాహు తన తల్లి వచ్చుదాఁక వేచి
యుండుట మంచి దని యెంచి విజయనగర - తెలంగాణ
రాయబారులను మంచి మాటలతో లాలించి, బుజ్జగించి,
సత్కరించి, - ప్రతి సందేశము నొసంగి, వీడ్కో లొసంగి,
పనుపక పదు నెన్మిది మాసములు గడపెను. ఇంతలోఁ దన
తల్లి 'మక్కా' నుండి మరలి వచ్చెను. ఆమె వలనఁ బ్రయ
త్నము సఫల మగునని వినుకలి యై విజయనగర - తెలింగాణ
రాయబారులఁ బిలువంబంచి రోష కషాయిత నేత్రుం డయి
'మీ ప్రభువులు మాకుఁ జెల్లించ వలసిన కప్పమును ఖజా
నాకు జమకట్టక యింతకాల మేల విలంబ మొనర్చిరో
తెలుప వలసిన దని యతిశయముగఁ బలికి మందలించెను.
కాఁగా; రాయబారులు సేయునది లేక భీతచిత్తు లై తమ
రాజ్యములకు మరలి తమ ప్రభూత్తంసులకు సులతాను
దృక్పథము నంతను విన్నవించిరి.

ఆనుపూర్విగ రాయబారులు సెప్పినది విని బుక్క
రాయలును, గాపయ నాయకుఁడును, - బహామనీ సులతాను
పయి యుద్ధమును బ్రకటించిరి. ఇతఃపూర్వము హసన్ గంగు
వశపఱచికొనిన 'కౌలాసు' లోనగు సీమలను గాపయ నాయ
కుఁడు స్వాధీనముఁ జేసికొనియెను. కృష్ణా తుంగభద్రల నడిమి

ప్రదేశములను బుక్కరాయలు వశపరచికొనియెను. ఇవ్విధముగ విజయనగర - బహమనీ రాజ్యములకు యుద్ధము ఘటిల్లెను.

గోపన మంత్రి ఇప్పోరాటముల నగపఱచిన శౌర్య ధైర్య సాహసాది గుణ కదంబమునకు మెచ్చి కంపరాయ లీతని 'జెంజీ' దుర్గమునకుఁ బరిపాలకునిగా నియమించిన తర్వాతి నొక సమయమున నితఁడు శ్రీ తిరుపతి వేంకటేశ్వర స్వామిని సందర్శించుట కయి పరివార సమేతముగ నేఁగి తిరుపతి కొండ నెక్కి స్వామినిఁ బూజింప నాలయమునఁ బ్రవేశింపఁగా, నాతనికి శ్రీ వేంకటేశ్వర స్వామి యగపడ కుండుటయే గాక మరియొక విగ్రహ మగపించెను.

కాఁగా; వెంటనే యర్చకులఁ బిలిచి "యింతకు పూర్వ మిచ్చట శ్రీ వేంకటేశ్వర స్వామి విగ్రహమే కలదు గాని యీ రెండవ విగ్రహము లేదే! ఇది యెచ్చటిది? ఎట్లు వచ్చినది? — అని యడుగ వారును గోపసచివుం గాంచి "మహాభాగా! ఆ రెండవ విగ్రహము శ్రీ రంగనాథునిది. తురుష్కులు శ్రీరంగ పట్టనమును జూఱఁగొని యాలయముల రూపుఁ జెడఁగొట్టి కకవిక లొనర్చునెడ హిందువు లెట్లో యీ విగ్రహమును దిరు నారాయణ పురంబునకుఁ గొంపోయి యచ్చటినుండి యిటకుఁ గొనిరాఁబడి యర్చనాదులు జరపఁ బడు చుండిన" — వని చెప్పిరి.

ఆ యర్చకుల వలన శ్రీరంగ పట్టనమునఁ దురుష్కులు ప్రవేశించి యార్యమత ధర్మోన్మూలన మెట్లు లొనర్చి విగ్రహ

రాధన మే రీతిగ విముక్తము లగు న మ్మహమ్మదీయ తురుష్కులచే నరికట్టఁబడినదియు, — విని శ్రీరంగ పట్టనము నుండి తురుష్కుల దఱిమివైవ సంకల్పించి యంతదనుక నా శ్రీరంగనాథ విగ్రహమును దన నగరమునకుఁ గొంపోవనెంచి యచ్చట నున్న "శృంగవరము" కొండపైనుండి ప్రత్యహ మారాధనలు జరుపుచుండ వలసిన దని తన పురోహితుల కాజ్ఞ నొసంగెను. వారును గోపన యాజ్ఞ నౌఁదల నిడిరి.

ఆ నాఁటి నుండియు గోపన మంత్రి శ్రీరంగ పట్టనము నాక్రమించి కొని యున్న తురుష్కుల నె వ్విధముగఁ బాఱఁ దోలుదునా యను యోజనా పరంపరలకుం జిక్కి యుండు చుండెను.

ఇట్లుండ శ్రీరంగ పట్టనము నాక్రమించికొని శ్రీరంగ నాథు నాలయ మందె వసించు చున్న మహమ్మదీయ నాయ కునకు వ్యాధి యంకురించి నాఁడు నాఁటికిఁ బ్రకోపించి వైద్యుల సలహా ననుసరించి యతఁడు శ్రీరంగ పట్టనమున నుండక సమీపమునఁ గల "సమయవరము" న నుండు చుండెను. వేగుల వారి వలన ని వ్విషయ మెఱింగి గోపన మంత్రి యొకనాఁడు "సమయవరము" న నున్న తురుష్క లేదో యుత్సవ నెపంబున మద్యమును గుత్తుక బంటిగా సేవించి యొడ లెఱుంగక యుండిరని వినుకలి యై సేనావాహినులతో సమయవరమునకుం జని యా మద్యపాయుల నెల్లఁ బఱ సంహ రింపఁగాఁ, గొంద ఱెటులనో తప్పించికొని పలాయన మంత్రమును జపించిరి.

అనల గోపన మంత్రి 'శృంగవరము' కొండపైనుండి శ్రీరంగనాథు విగ్రహమును రంగరంగ వైభవములతోఁ, గొనివచ్చి యుత్సవమూర్తి యగు శ్రీరంగనాథు నాలయమునఁ క్రీస్తు శకము ౧౩౭౧–౭౨ లోఁ బ్రతిష్ఠించెను. తదాదిగా శ్రీరంగము మహాక్షేత్రముగాఁ బరిగణింపఁబడసాఁగెను. ఇది జరిగిన తర్వాత శ్రీరంగ పట్టనపుఁ బ్రజలెల్లరు నా భక్త శిఖామణి ననేక ప్రకారంబుల వినుతించిరి. ఇతః పూర్వము ముష్కర తురుష్కులకు వెఱఁగంది శ్రీరంగమును విడచి 'సత్యమంగలము'నకుఁ బఱుగు వాఱిన వైష్ణవ గురూత్తముండగు వేదాంత దేశికులు మరల శ్రీరంగమునకు వచ్చి శ్రీరంగము నుద్ధరించి నందులకు గోపన్నమంత్రిని బహువిధముల నభినందించెను.

సంగీత సాహిత్య నిష్ణాతుఁడు

# రాయసము రామామాత్యుఁడు

(క్రీ. శ. ౧౬ వ శతాబ్దము)

---

శకవర్షము ౧౪౫౪ నందన సంవత్సర నిజ భాద్రపద శు ౧౦ సోమవారమునకు సరియగు క్రీ. శ. ౧౫౩౨వ సంవత్సరము సెప్టెంబరు ౯ దవ తేది నాఁటికి అచ్యుతదేవరాయల దండనాథుఁ డగు రాయసము అయ్యపరుసయ్య కొండవీఁటి దుర్గమును బరిపాలించుచుండె నని (S. I. I; Vol. IV, No. 936) తెలుపుచుండుట వలన నప్పటికేఁ గొండవీఁటి ప్రాంతము అచ్యుత దేవరాయలకు మరల వశమయ్యె ననుట నిస్సంశయము.

ఈ సామ్రాజ్యమును మరల గెలుపొంది తురుష్కులను బోద్రోలిన దండనాథులలో నయ్యపరుసయ్య, రామయ మంత్రి భాస్కరుఁడు,—లోనగు వారు కలరు. అయ్యపరుసయ్య చని పోయిన తర్వాతఁ గొండవీఁటి మహా సామ్రాజ్యము నేకచ్ఛత్రముగఁ బాలించిన వాఁడు రామయ మంత్రి భాస్కరుఁడు. ఇతనినే బాచరుసయ్య యని యందురు.

ఇతఁడు శకవర్షము ౧౪౫౫ నుండి ౧౪౬౨ వఱకు ననఁగాఁ క్రీస్తుశకము ౧౫౩౩ మొదలు ౧౫౪౦ వఱకు

నేఁడేఁడులు గొండవీటి దుర్గమున కధిపతిగా నున్నయట్టు శాసనా ద్యాధారములు గలవు. (V. I. O; Nos. 17, 78; Ep. Coll Nos. 514 and 577 of 1914; 42- and 445 of 1915; 302 of 1925.)

ఇతని తర్వాత నితని యన్నకొమారుఁడు బయకార రామప్పయ్య యను రామామాత్యుఁడు కొండవీటి దుర్గాధిపతి యయ్యెను. ఇతని యుచ్చస్థితికి అచ్యుత దేవరాయ లే కారకుఁడు. ఇతనిం గొండవీటి దుర్గమునకుఁ బరిపాలకునిగా నియమించుట సంగీత విద్యకే అ మ్మహారాజు కావించిన గొప్ప గౌరవ మని, సత్కృతి యని,—— చెప్ప వచ్చును

రామామాత్యుఁడు తొల్తఁ జిన్ని యుద్యోగమునఁ బ్రవేశించి తన ప్రతిభా వ్యుత్పత్తులవలన రాజప్రతినిధి(Vice-Roy) యయ్యెను. కొండవీటు దుర్గాధ్యక్షుఁడుఁగ నియమింపఁబడిన తర్వాతఁ గూడ నితఁడు కన్నడ ప్రాంతమునకు రాజప్రతినిధిఁగాఁ బంపఁబడిన దక్షుఁడు, పరిపాలనా చతురుఁడు.

అచ్యుత దేవరాయుల తర్వాత నేల్పడిఁ జాఁగించిన సదాశివరాయల కాలమున అళియ రామరాయలు రాజ్యచక్ర మవలీలఁ ద్రిప్పినాఁడు. అతఁడును రామామాత్యునే కొండవీటి దుర్గాధ్యక్షునిగా నియమించినట్టు (Madras Epy. Report, para 51 of 1915) తెలియఁగ నగు చున్నది. రాయ లీతనితో,

"సంగీత శాస్త్రే బహుధా విరోధా
స్సత్యేవ లక్ష్యేషు చ లక్షణేషు,

సర్వం స విశ్వీకృత్య సరామ మంత్రీ
త నోతు శాస్త్రం వచనా తవేశి."

—అని యుండఁగా, రామామాత్యుఁడు 'స్వరమేళ కలానిధి' ని నేఁడు ప్రకరణములుగా రాయాంకితముగా,

"శాకే నేత్ర ధరా ధరాబ్ధి
గణ్యేఽథ సాధారణే
వర్షే శ్రావణ మాసి నిర్మల తరే
పక్షే దశమ్యాం తిథౌ
రామామాత్య వినిర్మిత స్స్వర
తతే ర్నిర్మక్ష్య రత్నాకరన్
సోఽయం మేళ కలానిధి ర్మతి మతా
మాకల్ప మాకల్పతామ్."

—అను వచనముం బట్టి శా. శ. ౧౪౭౨ (క్రీ. శ. ౧౫౫౦) సరియగు సాధారణ సంవత్సర శ్రావణ శు ౧౦ నాఁడు రచించె నని తెలియు చున్నది. ఈ గ్రంథమున,—

"యః ఖడ్గైక సఖ స్సహోనుజ యుగో
నిర్గత్య విద్యా పురాత్ లబ్ధ్వా గుత్తిగిరౌ
... ... ... ... ... ... ... ... ..."

—అని రాయ లభివర్ణింపఁ బడియెను. (Sources of Vizianagara History P. 191 and 217.)

ఈ గ్రంథముం బట్టియె ముద్గళ సూరి కొమారుఁడు సోమనాథుఁ డను వాఁడు క్రీ. శ. ౧౬౦౯ దవ సంవత్సరము

సెప్టెంబరు ౧౮ దవ తేదీన "రాగ విబోధ" మను గ్రంథమును, దద్వ్యాఖ్యానమును, - ఆర్యావృత్తములలో నైదధ్యాయములుగా శ్రుతులు, స్వరములు, వీణ మేళరాగ రాగరూపములను పేరితోఁ బూర్వ లాక్షణికుల భావపరంపరల సమీక్షరించి రచించినాఁడు.

రామామాత్యుఁడు గొప్ప రాజనీతి విశారదుఁడు, పరిపాలనా దక్షుఁడు, - మాత్రమే గాక సంగీత సాహిత్య నిష్ణాతుఁడు. 'స్వరమేళ కలానిధి'లోఁ దన్ను

"పూర్వాధికకొండవీఁటి
ప్రధానదుర్గ ప్రతిపాదనేన
......సింహాసన పట్టణేన యుక్తాం"

—అని చెప్పికొని గద్యలో

"ఇది శ్రీమ దభినవభరతాచార్య వాగ్గేయ కార తోడరమల్లా తిమ్మామాత్య నన్దన రామామాత్య నిర్మితే స్వరమేళ కలానిధౌ"—అని వ్రాసికొనినాఁడు. 'తోడరమల్ల' యను నదొక బిరుదు. ఇతని మాతామహుఁడైన కల్లినాథున కీ బిరుదు కలదు. ఇమ్మడి దేవరాయల యాస్థాన విద్వాంసుఁడుగాఁ దేజరిల్లుచు శా. శ. ౧౩౭౫ (క్రీ. శ. ౧౪౫౩) వ సంవత్సరము 'సంగీత రత్నాకరము'నకుఁ 'కళానిధి'యన్న పేరుతో నొక వ్యాఖ్యను విరచించి 'అభినవ భరతాచార్య రాయ' అను బిరుదముం బడసి లక్ష్మణామాత్యుని పుత్త్రుఁడయి విలసిల్లిన వాఁడే కల్లినాథుఁడు.

ఇతనినే 'చతురకల్లినాథుఁ' డనియెదరు. తాతా మనుమల కిద్దఱకు నిట్టి యుపజ్ఞ గల్గుట దైవబల మనఁ దగును. అన్వయ సుకృత విశేష మనియుఁ జెప్ప వచ్చును.

అచ్యుత దేవరాయల దగ్గఱను అళియ రామరాయల యొద్దను,— రామామాత్యుఁడు తన గానకళా ప్రతిభ నగపఱచి మెప్పందినాఁడు. అచ్యుతదేవరాయల యంతఃపుర స్త్రీలకును అళియరామరాయల కొమార్తెలకును,— సంగీత విద్యాప్రదానము సేసినవాఁడు రామామాత్యుఁడు అగుటచే నితనికి బయకార రామప్పయ్య యను పేర్వచ్చెను. ఇతఁడు సంగీత విద్యాపారంగతుఁ డౌటయే గాక గొప్ప శిల్పి యని తన శిల్పకళావైచిత్ర్యము నగపఱచుట కయి 'రత్నకూటు' మను రమ్యహర్మ్య మొకంటి నిర్మించి యది 'వైజయంతము' నతిశయించిన దని 'స్వరమేళ కలానిధి' యందె వ్రాసికొని యుండుట వలనఁ దెలియ నగు చున్నది. (Sources of Vizianagar History, P. 190.)

ఇతని తండ్రి తిమ్మయ్య యను నతఁడు శ్రీకృష్ణదేవ రాయల దగ్గఱ 'రాయస' మను మంత్రి పదవి నధిష్ఠించి నందునను, విజయనగర సామ్రాజ్య మందలి వివిధ ప్రాంతము లం గల దుర్గముల కధిపతులై దేశమును బరిపాలించువార లను 'అమరనాయకు' లని వ్యవహరింపఁ బడుచుఁ గ్రమక్రమ ముగఁ బ్రభుత్వోద్యోగు లై దండనాయకు లై దేశ పరిపాలకు లయిన నాయకు లనఁ జెల్లి రని 'రాయవాచకము' వాకొను

చుండుట వలనను,— రాయసము వారనియు, నమరము వారనియుఁ,— బిలువఁబడు చుండిరి.

బయకార రామప్పయ్య శ్రీకృష్ణదేవరాయల కాలము నను అచ్యుత దేవరాయల కాలములోను దాంబూల ద్రవ్యముల నందిచ్చు నుద్యోగిగా వ్యవహరించి నట్టు లాతని క్రీ. శ. ౧౫౩౮ దవ సంవత్సరము సెప్టెంబరు ౬వ తేది శాసన మొకటి యవగత మొనర్చు చున్నది. రామప్పయ్య తమ్ముఁడే కొండ మరుసు. ఇతఁడు శ్రీకృష్ణదేవరాయల సేనానియై విలసిల్లి నట్టు 'రాయవాచకము'నఁ జెప్పఁబడినది. అంతియ కాక శ్రీకృష్ణదేవరాయల కయి సింహాద్రిఁ శ్రీకూర్మము,— లందు విజయస్తంభముల నెలకొల్పిన ధీరుఁడు రాయసము కొండమరుసయ్య యని శా. శ. ౧౪౩౯ ఈశ్వర సంవత్సరమునకు జెందిన 'చోళసముద్ర శాసనము'నఁ గొనియాడఁ బడినాఁడు.

తిమ్మయ్య తిరుపతి యందలి శ్రీ గోవిందరాజస్వామికి నిత్యారాధన కయి చీరాల, పేరాల, ఈఁదుపల్లె (దీనినే యిందుపల్లి యని యందురఁట!) గ్రామములను, 'మనుమప్రోలు' (ఒంగోలు దరిదాపుల నున్న కొప్పోలు) గ్రామమును,— శా. శ. ౧౪౬౦ విళంబ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౫౩౯ దవ సంవత్సరము సెప్టెంబరు ౧౮ దవ తేదీన దానము చేసినట్టు శ్రీ వేంకటేశ్వర స్వామి శాసనములు ౨౫౪ సంఖ్య తెలుఁగగను చున్నది. చీరాల, పేరాల, అందుపల్లి గ్రామములు మీఁద సంవత్సరమునకు ౧౫౦ రేఖా పణములును,

కొప్పోలు గ్రామము మీఁద ౩౬౦ రేఖాపణములును (ఈ నాణెములు బంగారు నాణెములు), — ఆదాయము వచ్చు చుండెడిది.

ఈ దానమును బురస్కరించికొనియె రామామాత్యుఁడు కొంత సంస్కరణము సేసి శా. శ. ౧౪౬౬ క్రోధి సంవత్సరమునకు సరియగు క్రీ. శ. ౧౫౪౪ వ సంవత్సరము జూన్ నెల ౧౬ వ తేదీన అద్దంకి సీమకుఁ జెందిన "సద్యారు" గ్రామమును, బెల్లముకొండ సీమకుఁ జెందిన "కుప్పాయనికొండ" (ఉప్పావినికొండ యేమో!) గ్రామమును, నరసరావుపేటకు దరిదాఁపులం గల 'కారోచేల' గ్రామమును, – శ్రీ గోవిందరాజ స్వామికి సమర్పించి నట్టు లాయాలయ మందలి ౩౬౭ వ శాసనము దెలుపు చున్నది.

తిమ్మయ్య దానము సేసిన 'కొప్పోలు' గ్రామమును స్థిరపఱచుచుఁ జీరాల, పేరాల, అందుపల్లి గ్రామములకు బదులుగా ఆ యాదాయమునకుఁ దగ్గయట్టుగా 'నెడనాడు' లోని 'ఇచ్చుండు'కుఁ దూర్పున నున్న 'కుళత్తూరు' గ్రామమున నొక యగ్రహారమును గల్పించి సాఁబాలు గ్రామమును రామామాత్యుఁ డొసంగినాఁడు.

ఇందువలన సంవత్సరమునకుఁ దొమ్మిదివందల యేఁబది రేఖా నాణెముల యాదాయము లభించు నని యూహించిరి. ఆ యాదాయమునుండి శ్రీ గోవిందరాజ స్వామికిని, మఱి యితర స్వాములకును, — రామామాత్యుఁడు దన పినతండ్రి బాచరుసయ్య కొమారుఁడు కృష్ణ అప్పయ్య (శాసనములలో

(క్రిష్ణప్పయ్యా అనియే కలదు.) పుణ్యము కొఱకు వినియోగించు నట్లు నిర్ణయ మొనర్చెను. స్వామి ప్రసాదమునఁ దన భాగధేయమును బాచరుసయ్యా గారి పుణ్యావ్యాప్తి కయి వశిష్ఠ గోత్రోద్భవుం డయిన ఉదయగిరి దేవరాయ భట్టరు గారి కుమారుఁడు శ్రీనివాస భట్టరునకు రామామాత్యుఁడు ధార వోసెను. ఈ శ్రీనివాస భట్టరు ఆ సమయమునఁ దిరుపతిలో శ్రీ రామాలయమునం దర్చకుఁడుఁగా నుండెడి వాఁడు.

బాచరుసయ్యా, ఆతని భార్య అమ్మాజమ్మ, ఈ దంపతుల పుత్త్రుఁడు క్రిష్టప్పయ్యల పుణ్యావాప్తి కయి రామామాత్యుఁడు శా. శ. ౧౪౬౧ వికారి సంవత్సరమునకు సరియగు క్రీ. శ. ౧౫౩౯ దవ సంవత్సరము ఆగస్టు ౨౫ దవ తేదీన బాచేశ్వర, అమ్మేశ్వర, కృష్ణేశ్వర ఆలయములఁ గట్టించి నట్లు (౩౦౬ వ శాసనము, ౧౯౧౮) లవగత మగు చున్నది.

ఈ రామామాత్యుఁడు మహీశూర రాజ్యము (Mysore State) లోని 'హడినాడు' (Hadinad) సీమ కధిపతిగాఁ గ్రీస్తు శకము ౧౫౩౫ దవ సంవత్సరము ఫిబ్రవరి ౭ వ తేదీన నున్నయట్లు లగపడు చున్నది. ఇతని కార్యకర్త 'ప్రాఁత మోదహళ్లి' లోని 'మల్లికార్జున స్వామికిఁ' జెందిన భూములను గ్రామములను ఆ స్వామి కిచ్చినట్లు (౨౪౫ దవ శాసనము, ౧౯౧౩) తెలుపు చున్నది.

'బలారి' (Bellary) మండలము లోని కొన్ని గ్రామములలో దేవాలయములఁ జెఱువుల నిర్మించి కొన్ని తావుల గ్రామములం గూడ నేర్పఱిచి నట్లు క్రి. శ. ౧౫౩౯ దవ

సంవత్సరము ఆగస్టు మాసమునకు సరియైన శా. శ. ౧౪౬౧ (వికారి సంవత్సరము) నాఁటి శాసనముల నెన్మిదింటిలోఁ జెప్పఁబడి యున్నది. (300–302 శాసనములు, ౧౯౧3) శా. శ. ౧౪౬౬ క్రోధి సంవత్సరమునకు సరియగు క్రీ. శ. ౧౫౪౪ వ సంవత్సరము జూన్ ౧౬ వ తేది నాఁటి శ్రీ గోవిందరాజ స్వామి యాలయ మందలి 3౫౭ వ శాసనమును, శ్రీ తిరుపతి వేంకటేశ్వర స్వామికి నొసంగిన దాన శాసనమును,— ఆ సంవత్సరాంతమున ననఁగాఁ గ్రీస్తు శకము ౧౫౪౫ దవ సంవత్సరము జనవరి నెల ౭౭ వ తేదీ నాఁటి యాతని దాన ధర్మములు 'బళారి' మండలముననే మరల నగపించు చున్నవి. (514, 517 Inscriptions of 1917.)

అతఁడు సేసిన దానశాసనములలోఁ జివఱది శా. శ. ౧౪౭౮ నల సంవత్సరమునకు సరియగు క్రీ. శ. ౧౫౫౬ వ సంవత్సరము ఏప్రిల్ నెల ౧౨ వ తేది నాఁటిది మాత్రమే! (304 Inscription of 1925.)

ఇ వ్విధముగ రామామాత్యుని దానశాసనములు వివిధ ప్రదేశములలో వివిధగతుల నుండి నందునఁ దొలుత శ్రీకృష్ణదేవరాయల కొలువులోఁ జేరి చిన్ని యుద్యోగములఁ జేసి తమ ప్రజ్ఞా ప్రాభవముల వలన రాజప్రతినిధి పదవికిఁ బోఁగల్గె ననుట యథార్థ మని సునిశ్చిత మగుచున్నది.

ఇతఁ డసంఖ్య యవన యోధుల జయించిన శౌర్య ధనుం డనియుఁ, గర్ణుని వంటి దానరాధేయుం డనియు, – నని ప్రసిద్ధి సెందెనని 'కొండవీఁడు' నందలి 'గోపీనాథస్వామి'

యాలయ ద్వారమునం గల యొక శాసనమున వ్రాయఁబడి యున్నది.

ఇతని మేనయత్త యగు ప్రతాప చిన్నమాంబ (ఈమె యల్లమరుసు భార్య. ఆత్రేయ గోత్రము, ఆశ్వలాయన సూత్రము, ఋక్శాఖ,) సంవత్సరమునకు ౩౫౯ రేఖాపణములు (సువర్ణనాణెములు) ఆదాయముగాఁగల 'కొండవీఁటి సీమ' యందలి 'రామచంద్రపురము' నాఁబడు 'వంకాయల పాడు' గ్రామమును శా. శ. ౧౪౬౯ ప్లవంగ సంవత్సరమునకు సరియగు క్రీ. శ. ౧౫౪౭ వ సంవత్సరము జులయి నెల ౮ దవ తేదీన దాన మొసంగి నట్లు (Tirupati Govinda-rajaswamy's 401 Inscription) లగపడుచున్నది. అంతియ కాక శా. శ. ౧౪౬౨ శార్వరి సంవత్సర చైత్ర మాసమునకు సరియగు క్రీ. శ. ౧౫౪౦ దవ సంవత్సరము మార్చి నెల ౨౨ వ తేదీనఁ జంద్రగ్రహణ పుణ్యకాలమున ఈ 'వంకాయలపాడు' గ్రామము నగ్రహారముగాఁ జేసి 'రామచంద్రపుర' మని పేర్వెట్టినది. అంతతోఁ దనివోక 'సాతలూరు' లోఁ బర్వతినాథస్వామినిఁ బ్రతిష్ఠించి, 'వంకాయలపాడు' దగ్గఱ 'గోపీనాథ సముద్రము' నను నొక తటాకమును ద్రవ్వించి మంచి దాని యని యనిపించికొనినది. (Ep. Coll, 422 Inscription of 1915 and Tirupati Devastanam Epigraphical Report, PP. 234, 237.)

కావుననే యామె

"కర్ణాట భూపాల ఘన కృపా కలిత వి
స్తీర్ణ గజాంత లక్ష్మీవరుండు

చండప్రతాప భాస్కరుఁడు భాసుర దంత
నాథు నత్తయు మహోన్నత గుణాఢ్య
పూని షోడశ మహాదాన విద్యాప్రౌఢి
చిరకీర్తిఁ గన్నట్టి చిన్నమాంబ
దుగ్ధాంబునిధి తోడఁ దులఁదూఁగు గోపికా
నాథు సముద్రంబు నలువు మీఱి
ధరణిఁ గట్టించె నా చంద్ర తారకముగ
నఖిల హిత మైన యీ ధర్మ మాచరించె
... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ..."

—అని ప్రసిద్ధి సెందినది. 'రాజా ప్రకృతి రంజనా' త్తను నుడి సార్థక మొనరించి, ప్రజానురంజనముగఁ బరిపాలనము గావించి, యశోరమను జేఁబట్టిన ధీ భవనమూర్తి. పరాశర గోత్రుఁడు. తిమ్మయ లక్కలీశమ్మల గర్భశుక్తి ముక్తాఫలము. ఆఱువేల నియోగి బ్రాహ్మణుఁడు. సంగీత సాహిత్యములలో ముక్కాఁకలు దీఱిన వాఁడు. స్వామికార్య నిర్వహణ ధౌరంధర్యుఁడు. దానరాధేయుఁడు. పరిపాలనా దక్షుఁడు. శౌర్య ధనుఁడు. 'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్త్ర' మ్మను సూక్తి కుద్దియైన సంప్రదాయ వంశమున జనియించి కార్యఖడ్గముల నసమాన విఖ్యాతి నందినవాఁడు రామామాత్యుఁడు.

ఇమ్మహాభాగుని పూర్వులు కొండవీటి సీమ నుండియె అయ్యై ప్రాంతములకుం జని యజరామర మగు కీర్తి నార్జించి యిప్పటికిని దివ్య జ్యోతులంబలెఁ చారిత్ర పథంబున వెలుంగు చున్నారు.

కొండవీటి పరిపాలకుఁ డగు

## వేమారెడ్డి కడ 'విద్యాంగ మంత్రి'

# శ్రీ నా థ భ ట్ట సు క వి

(క్రీ. శ. ౧౪ వ శతాబ్దము)

---

శ్రీనాథ మహాకవి యొక్క నిరుపమాన పాండిత్య కవిత్వ గౌరవమునకు, ప్రతిభా విశేషమునకు — ఆనాటి తెలుఁగు నాఁటి రెడ్డి భూరమణులు, వారి మంత్రులు, ఆప్తులు కర్ణాటక ప్రభువులు వారి సామంతులు, వెలమదొరలు ఇతర సంపన్నులు ముగ్ధు లయి యతనికి వశంవదు లయినారు. అవ కాశము కొలఁది తమ తమ యాస్థానములకు ఆతనిఁ జేరఁదీసి నారు. అపూర్వ గౌరవ పురస్సరముగా సత్కారములు చేసి సకల సంపదలతోఁ దులఁ దూఁగ జేసినారు. వారందఱును గూడ బండితులు, కవులు, గ్రంథకర్తలు, కవి పండిత పోష కులు, నిరంతర విద్యావినోదులు, మహోన్నత స్థితిలో నున్న వారు,— అగుటచే మన కవిసార్వభౌమునకును వారికిని ఎడ తెగని యనుబంధ మేర్పడినది.

ఆంధ్ర సారస్వత ప్రపంచములో శ్రీనాథునివలె బండి తుండై కవియై మహారాజ భోగముల ననుభవించిన వాఁడు ఇంకొక్కఁ డేకాలములోను అగపడఁడు. అతఁడు కవి పండిత

కుటుంబములో జన్మించినాఁడు. కవిత్రయమునకుఁ దరువాత మిక్కిలి పన్నెకెక్కిన మహాకవి. పాకనాటి నియోగి బ్రాహ్మణుఁడు, గోత్ర పట్టన నాస్త్రప్యుఁడు. దీనినే గ్రాల్పట్టన మని యందురు. కొండవీడు మొదలుకొని కందుకూరు వఱకుఁ గల దేశమును పాకనాఁ డనియెదరు. 'పద్మపురాణ' మును రచించిన కమలానాభామాత్యుఁడు ఇతనికిఁ దాత. మారయ వీనికిఁ దండ్రి. సహజముగనే ప్రతిభ కలవాఁడు. 'సకల విద్యా సనాథుఁ' డయిన పండితుఁడు. కవిసార్వభౌముఁడు. ఇతని రచన రాజశివితో నడుచును. ఇతని కలవడిన శయ్యా సౌభాగ్యము (grandeur of style) మఱి యే కవికి అల వడినది గాదు. అన్నిఁటను నరిఁ కలఁడే సాటి, శక్తి యుక్తులు గలవాఁ డగుట వలననే మహారాజ భోగముల యథేష్టముగ ననుభవించుచు నుండఁగలిగినాఁడు.

కొండవీటిని పాలించిన కోమటి వేమారెడ్డి యాస్థాన ములో మన శ్రీనాథునకుఁ దొట్టదొల్త ప్రవేశము గలిగినది. ఆనాఁడు రెడ్డిరాచరికము మహోచ్ఛస్థితి యందు దున్నది. తొలుత నాస్థాన విద్వాంసుఁడు, కవి, తర్వాత విద్యాధికారి,— అయినాఁ డక్కడ. ఆ రాజ్యములో విద్యాశాఖకు సంబంధిం చిన విషయముల నన్నిఁటిని ఏర్పాటుసేయుట, పరిశీలించుట, పరిష్కరించుట మన శ్రీనాథుని పని. అంతియకాదు. వేమారెడ్డి యొసంగు భూదానాల శాసనములకు 'ముసాయిదా'ను సంస్కృ తాంధ్ర భాషలలో శ్రీనాథుఁడే రచించువాఁడు. ఆ యాస్థాన ములో శ్రీనాథుని ప్రాపున వివిధ శాస్త్ర పరిజ్ఞాతలయిన పండి

తులు, కవులు, — తమ తమ సామర్థ్యమును ప్రకటించి యుచిత రీతిని సత్కారములం బొందుచు నుండువారు. ఆ కాలములోనే శ్రీనాథుని కీర్తి ప్రతిష్ఠలు విస్తరిల్లం జొచ్చినవి. ఆ కాలమే శ్రీనాథుఁడు మహారాజ భోగములు అనుభవించుటకుం బ్రారంభకాలము. ఇతఁడు రూపాభిమానము కలవాఁడు.

"చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
హర్ష నైషధ కావ్య మాంధ్రభాష
ప్రౌఢ నిర్భర వయః పరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమ
ప్రాయ మింకను మిగులఁ గైవ్రాల కుండ
కాశికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాట దేశ కటక
పద్మవన హేళి శ్రీనాథభట్ట సుకవి."—

—నని శ్రీనాథుఁడు సెప్పికొని యున్నాఁడు. ఈ పద్యములో నీతని వయోవస్థా భేదములను దెలుపు పదముల సరిగా మనసునకుం బట్టించికొని యతని రూపమును భావనాప్రపంచమున నూహాగానము సేసిన యెడల నాతఁడు మంచి స్ఫురద్రూపి యని నిస్సంశయముగాఁ దెలియ నగును.

మన కవిసార్వభౌముఁడు కట్టునది చీని చీనాంబరములు, పెట్టునది యనర్ఘము లయిన నవరత్న ఖచిత సువర్ణ భూషణములు, పూయునది దివ్యపరిమళముల వెదఁజల్లు సుగంధ ద్రవ్యములతోఁ బొదిపిన యంగరాగములు. ఈ యలంకార ద్రవ్యము లన్నియు హరవిలాసము కోఁకి కృతి నందికొన్న అవచి తిప్పయ్య సెట్టి యథేష్టముగాఁ దెచ్చి యిచ్చు వాఁడు. తిప్పయసెట్టికి బెద్ద యోడవర్తక ముండెడిది. అలంకార పరికరములను సుగంధ ద్రవ్యములను దేశదేశాల నుండి యోడల మీఁదఁ దెప్పించి యిక్కడ మహారాజులకు విక్రయించు వాఁడు. మన కవి సార్వభౌముఁడు ఈ యలంకారప్రీతి ఆది భిక్షుకుఁడైన దక్షారామ భీమేశ్వరుని వఱకు వెళ్ళినది. చిత్తగింపుఁడు.

"గజ చర్మ మెన్నఁడో కాని నిచ్చలు గట్టు
పసిఁడి కమ్ముల పట్టు పచ్చడంబు
భసిత మెన్నడో కాని ప్రతిదినంబున యందు
మలయజంబు కురంగ మదము గూర్చి
నిడుద పాములరాజు తొడవు లెన్నఁడో కాని
తారహారములు నిత్యము ధరించు
వృకరంకరుండ మాలిక లెన్నఁడో కాని
ధరియించు కల్హార దామకంబు"—

అని నాఁడు. ఇంకను ఇక్ష్వాకు మాంధాత్రాది చక్రవర్తులు సమర్పించిన యమూల్యాభరణాదులను గూడ భీమేశుని చేత ధరింపఁజేసినాఁడు మన శ్రీనాథుఁడు. తనకును ఆభరణాదుల నిచ్చువారు మహారాజులె! కావుననే తనవలె

శివుని నలంకరింపఁ జేసినాఁడు. కవిసార్వభౌముని భోజనము మహారాజోచిత మైనది. షడ్రసోపేతమైనది.

"మొగ విరిసి కరకు కూఁడక
పగులక వెడలుపును నిడుపు పసిమి కలిగి
చిగురు ముదురు కాని
నడిమి యీనె పుచ్చిన అంటాకులో"

శ్రీనాథుఁడు భుజించువాఁడు మహామంత్రుల పంక్తిని బంగరు పళ్ళెరములలోనే యతని భోజనము.

"ఖండ శర్కర జున్ను కండ చక్కెరలు దో
సెలు వడల్ సేవె పాసెముల తోడ
కమ్మగాఁ గాచిన కరి యాల నేతితో
కమనీయ పంచభక్ష్యముల తోడ
సంబారముల తోడి శాకపాకముతోడి
పక్వ మయిన పెసర పప్పు తోడ
తేనియ ధారతో పానకంబుల తోడ
శిఖర షాడబ రస శ్రేణి తోడ
నచ్చు లవణాదికము తోడ నమృత ఖండ
పాండురం బైన దధితోడ......"

ఇతనికి భోజనము జరగుట మామూలు. మొత్తము మీఁద శ్రీనాథుని శాకపాకములు.

"మరచి ధూళీపాళి పరిచితంబులు మాణి
బంధాశ్మ లవణ పాణింధమములు

బహుళ సిద్ధార్థ జంబాల కాండంబులు
పటురామఠామోద భావితములు
తింత్రిణీ కర సోపదేశ ధూర్ధరములు
జంబీర నీరాభి చుంబితములు
హైయంగ వీన ధారాభిషి క్తంబులు
లలిత కుస్తుంబు రూల్లంఘితములు"

—అయి యుండును. తాను, బంధు మిత్రాదులు, ఏక పంక్తిని గూరుచుండి,

"గోధూమ సేవికా గుచ్ఛంబు లల్లాడ్చి
ఖండ శర్కరలతో గలిపి కలిపి
గజ్జగాఁ గాఁచిన గోక్షీర పూరంబు
జమిలి మండెగలపైఁ జల్లి చల్లి
మిరియఁబుతోఁ గూడ మేళవించిన తేనెఁ
దోరంపు లడ్వాలు తోఁచి తోఁచి
పలుచఁగా వండిన వలిపంపు జా పట్లు
పెసర పప్పుల తోడఁ బెనచి పెనచి
గోవ జవ్వాది కస్తూరిఁ గొజుఁత పఱుచు
వెన్న పడిదంబు జొబ్బిలి విరిచి విరిచి"

భుజించు వారు. మహారాజోచిత మైన యిట్టి భోజనమునకు నలవాటు వడ్డ శ్రీనాథ మహాకవి అనాగరపుఁ దిండిని గుఱించి

"ఫుల్ల సరోజ నేత్ర యల
పూతన చన్నుల చేదుఁ ద్రావి నాఁ

డల్ల దవాగ్ని మిడింగితి న
టంచును నిక్కెడ వేల తింత్రిణీ
పల్లవ యుక్త మాష సూడుకు
బచ్చలి శాకము జొన్న కూటితో
మెల్లన యొక్క ముద్ద దిగ
మ్రింగుమ నీ పస కాన నయ్యెడున్."

—అని యనును. జన్మసిద్ధమైన రూపము, అనర్ఘము లయిన నాగరక జనోచితము లయిన వస్త్ర భూషణాద్యలంకారములు, ఇష్ట మృష్టాన్న భోజన సౌకర్యము,—అమరి యుండినఁ జాలు నెట్టి యరసికునకైనను సులువుగ శృంగారరస సముద్రమునఁ బడి మునిఁగి పోవుటకు — శ్రీనాథుఁడా రూప యౌవన గుణ సంపన్నుఁడు. సౌందర్య పిపాస ఆతనికి సహజముగనే యున్నది. కవిత్వములోఁ బాండిత్యములో నీడు జోడు లేని వాఁడు. సరస రసికాగ్రణి. నాగరిక శిఖామణి; మహారాజుల యాశ్రయము వలనఁ దినుటకుఁ, గట్టుటకుఁ, బూయను,— దండిగాఁ గలవాఁడు. పై పెచ్చు నిరంకుశుఁడు. అట్టి మన శ్రీనాథ మహాకవి నవ నవ శృంగార రసవాహినీ తరంగ డోలికలో నిరంతర మూఁగులాడు చుండు నని యన వింత లేదు. ఎంత స్త్రీ లోలుఁడు, ఎంత ధైర్యము కలవాఁడు గాకున్న నొక మహారాజు సమక్షమున నిలుచుండి

"అక్షయ్యంబగు సాంపరాయని తెలుం
గాధీశ కస్తూరికా

భిక్షాదానము సేయురా సుకవి రా
డ్బృందారక స్వామికిన్
దక్షారామ చళుక్య భీమ వర గం
ధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై
వాసించుఁ ద ద్వాసనల్."

—అని 'దక్షారామ' మందలి వేశ్యల వక్షోజములకుఁ బూయుటకు నాకుఁ గస్తూరి యిప్పించవోయి యని యడుగునా ?

ఆ కాలములోఁ గర్ణాటక ప్రభువు ప్రౌఢదేవరాయల యాస్థానములో నొక యుద్దండ పండితుఁడు గౌడ డిండిమభట్టు కలఁడు. అతఁడు పలువుర పండితులను, గవులను విద్యా వివాదలో జయించినాఁడు. అతనికి 'కవి సార్వభౌమ' బిరుదము కలదు. అతని యొద్ద 'కంచు ఢక్క' యుండెడిది. దానిని మ్రోగించి తన విజయదర్పమును బ్రకటించు కొనుచుఁ, దన నిరంకుశ స్వభావమును వెల్లడించుచు నుండు చుండెను. ఇవ్విషయము మన శ్రీనాథ భట్ట సుకవికి వినుకలి యై యతనికి 'శృంగ భంగము' సేయవలె నని బుద్ధి వొడమె ఆత్మ విశ్వాసము (Self-respect) కలవాఁ డౌటచే నచటికిఁ బోయి యెన్నాళ్లకును బ్రభు దర్శనము గాక పలుకష్టములకు లోనయి దారిద్ర్య వివశుఁడై,

"కుల్లా యుంచితి కోకఁ జుట్టితి మహా
కూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టము న్మెసవితిన్
విశ్వస్త వడ్డింపఁగా
సల్లా యంబలి ద్రావితిన్ రుచులు దో
సం బంచుఁ బోనాడితిన్
తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయ లే
దా నేను శ్రీనాథుఁడన్."

—అని తాఁ బడిన కష్ట పరంపరల నేకరువుఁ బెట్టినాఁడు. ఎటులనో రాజసందర్శన భాగ్య మొదవినది. డిండిమభట్టుతోఁ దా వాంఛించినట్లు కవి పండిత మండలి సమక్షమున వాద ప్రతివాదములు చెలరేఁగి తుదకు విజయలక్ష్మీ కరగ్రహణ మొనర్చినాఁడు. డిండిమభట్టునకుఁ గల 'కవిసార్వభౌమ' బిరుదును లాగికొని యాతని కంచుఢక్కను బగులఁ గొట్టించి ప్రౌఢదేవరాయల సన్నుతికి, సత్కృతులకు, భాజనుఁ డయినాఁడు. ఆ ప్రభువు తన ముత్యాలశాలలో కనకాసనముపైనిఁ గూర్చుండఁ బెట్టి దీనార టంకాలతోఁ గనకాభిషేకము చేసినాఁడు. ఈ యసామాన్య సత్కారము ఎంత గొప్ప కవులకో పండితులకోగాని జరగదు. ఆంధ్ర వాఙ్మయ ప్రపంచ చరిత్రములో నిట్టి సత్కారమును బడసిన వారిని కేవలము వ్రేళులమీఁద లెక్కించవచ్చును. విజయలక్ష్మీ కరగ్రహణమైన తర్వాత మన కవి సార్వభౌముఁడు కంటినిండ నిద్ర వోయినాఁడు.

"కంటికి నిద్రవచ్చునే, సు
ఖంబగునే రతికేళి, జిహ్వకు
న్వంటక మిందునే, యితర
వైభవముల్ పదివేలు మానసం
బంటునె, మానుషంబుఁ గల
యట్టి మనుష్యున కెట్టి వానికి
న్గంటకుఁడైన శాత్రవుఁడొ
కండు తనంతటి వాఁడు కల్గఁగన్,"

—అని యీ పిదపఁ దన స్వభావమును వింధ్య పర్వతపు మాటలుగా దెలియఁబఱచి నాఁడు. కాఁబట్టి యెన్నియో కష్టములకు బాల్పడి తన ప్రత్యర్థిని జయించి తన విజయమును గవిసార్వభౌమ బిరుదురూపముతో నాంధ్ర వాఙ్మయ ప్రపంచ ముండునంత కాలము స్థిరముగా నెలకొని యుండునట్లు లొనర్చినాఁడు.

ఇతని జీవితము ఆ విధముగా మహారాజుల జీవితము వోలెఁ జీకు చేవలు లేకుండ ఆప్యాయతగా గడచిపోయిన దన అది యంతయు నప్పటి తెలుఁగు ప్రభువులకుఁ దెనుఁగు భాష మీఁద, సారస్వతము మీఁద, తెలుఁగు పండితులమీఁద, కవులమీఁద,— ఉండుచుండిన అపూర్వమైన అపరాభిమాన ముల చేతనే యని చెప్పక తప్పదు.

ఈ మహాకవి వార్ధక దినాలలో ఆ రాజులకును, ఆ రాజ్యములకును,— విపత్తు ఘటిల్లినది. అక్కడక్కడఁ జిన్న చిన్న ప్రభువులను, చిల్లర శ్రీమంతులను గొందఱను బట్టికొని

యతఁడు కాలము వెడల నడపినాఁడు. అప్పుడుగూడ నాతని స్వభావములోఁ గాని ప్రాభవములోఁగాని మార్పు అంతఁగా నేర్పడలేదు. క్రమక్రమముగఁ దెలుఁగు దేశమును నుత్కళ రాజచంద్రులు, ఆక్రమించుకొనిరి. వారికిఁ దెలుఁగుమీఁదను దెలుగు సారస్వతము మీఁదను ఆదరాభిమానము లెందుల కుండును? అందువల్ల ఆ వార్ధకమున శ్రీనాథ కవి సార్వభౌముని నాదరించు తెలుఁగు ప్రభువు లెవ్వరును లేక పోయిరి. చివఱకుఁ దినుటకుఁ దిండియే లేకపోయినది. ఇఁక భోగములకు విలాసములకు అవకాశ మెక్కడ? అయినను ప్రాయమును అవసరమును జూచికొని పని సాఁగించువాఁడు కాఁడతఁడు. ఆత్మవిశ్వాసము ముప్పిరిఁ గొన్నవాఁడు గదా! 'బొడ్డుపల్లె' అను గ్రామమును గుత్తకుఁ దీసికొని నాఁడు ఒడ్డె దొరల వద్దఱ. దానికి సంవత్సరమునకు శిస్తు ఏడు నూర్ల టంకాలు. ఈ పనిలో వేలకొలఁది ఆర్జించవచ్చునని, మరల వెనుకటి వలె రంగ రంగ వైభవములతో నుండవచ్చు నని, తలఁచి సిబ్బందిని కూర్చి సేద్యమును సాఁగించి నాఁడు. కాని లాభము లేక పోయినది. అతఁడు కవిసార్వభౌముఁడే కాని కర్షక సార్వభౌముఁడు కాఁడు గదా! దండి పంటను బండించ లేక పోయినాఁడు. కృష్ణనది యొడ్డున 'బొడ్డుపల్లె' కలదు. పండిన కొంచెము వరిపంట కృష్ణవరద వచ్చి పొట్టను బెట్టి కొనినది. తిలలు, పెసలు, మొదలగు పంటలు పక్షులు (బిల బిలాక్షులు) లోనగునవి పరికొని తినిపోయినవి. శిస్తు చెల్లించక తప్పినది కాదు. ప్రభుత్వోద్యోగులు ఒత్తిడి సేసినారు. అప్పుడు

మన కవి సార్వభౌముఁడు తన పూర్వవైభవ ప్రాభవముల స్మరించుచు

"కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెను గదా
పురవీధి నెదురెండఁ బొగడదండ
ఆంధ్ర నైషధ కర్త యంఘ్రి యుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళ యుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్య మందెను గదా వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరి వాకిట నుండు నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిల బిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
'బొడ్డుపల్లెను' గొడ్డేరి మోసపోతి
నెట్టు చెల్లింతుఁ దంకంబు లేఁడు నూర్లు"

—అని తన దీనస్థితికి వాపోయినాఁడు. అవసాన కాలములో

"కాశికా విశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయఁ డిచ్చుఁ
గైలాసగిరిఁ బంట మైలారు విభుఁ డుండె
దినవెచ్చ మే రాజు తీర్పఁ గలఁడు
రంభఁ గూడెఁ దెనుంగు రాయ రాహుత్తుండు
కస్తూరి కే రాజు ప్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యో విస్సన మంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు

భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిఁగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజ కవివరు గుండియ దిగ్గు రనఁగ
నరుగు చున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

—అని ధీరుఁడై విలపించినాఁడు.

కేవలము పురాణములనే తెలిఁగించు పద్ధతి అనంతామాత్య జక్కయల నాఁటి నుండియె సన్నగిల్లిన దని చెప్ప వచ్చును. కావుననే మన కవిసార్వభౌముఁడు పురాణ కథలఁ గైకొని, స్వేచ్ఛఁగా, అపూర్వ వర్ణనలతోఁ, గల్పనలతోఁ, గావ్యరచన మొనర్చి ప్రబంధరచనకు వలయు రచనా స్వాతంత్ర్యమును వెల్లడించి యున్నాఁడు. ఆంధ్రభాషా యోషకు అమూల్యాలంకారములై యున్న ఈతని గ్రంథములలో మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్ర, – తప్పఁ దక్కిన శృంగార నైషధము, హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, పలనాఁటి వీరచరిత్ర, శాటమరాజు కథ, క్రీడాభిరామము, శివరాత్రి మహాత్మ్యము,—అను నవి యుపలబ్ధము లై యున్నవి. ఈ గ్రంథములే గాక నందనందను చరిత్రము, ధనంజయ విజయము, కామశాస్త్రము, వల్లభాభ్యుదయము,—నను గ్రంథములు గూడ శ్రీనాథ కవి సార్వభౌముని కృతములే యని లక్షణ గ్రంథముల వలనఁ దెలియు చున్నది. కాని నేఁ డివి యగపడ కున్నవి. ఇట్టి వింక నెన్ని కాలగర్భమున దిక్కుమాలి కూలిపోయినవో గదా! మఱియు నితఁడు సంస్కృతమున ననేకములు శాసనములు విరచించెను.

రస గుళిక లనఁ దగు చాటుప్రబంధకాలెంది యాంధ్ర దేశమున బహుళ ప్రచారమున నున్నవి.

శ్రీ హర్షుని నైషధ మహాకావ్యమునకుఁ దెలుఁగు సేత శృంగార నైషధము. అయినను స్వతంత్ర కావ్యము వలె బుధ జన శ్లాఘాపాత్రమై యొప్పుచున్నది. భాషాంతరీ కరణమునఁ గావ్యమునకుఁ గల యథార్థ రూపము రూపఱు ననుట వాస్తవ మయ్యును ప్రతిభాయుతుల యాంధ్రీకరణ మున నయ్యది నూత్న రూపమును బొంది ప్రత్యేక కావ్య మట్లు ప్రకాశించు ననుటకు శ్రీనాథుని శృంగార నైషధమే నిదర్శనము. ఇప్పటను నాంగ్లేయ విమర్శకుఁడు గ్రీసింగు లేంబర్టు చెప్పిన "Poetry cannot be translated without ceasing to exist; it is true that in a poet-translator's hands it may give birth to a new poem as happened to Homer and Omar-khayyam, it is a new creation"

—అను నీ వాక్యములు పైఁ జెప్పిన విషయమును రూఢి సేయు చున్నవి.

శృంగార నైషధ కావ్య రచనానంతరమున శ్రీనాథుఁడు విశేష దీర్ఘ సంస్కృత సమాస విరహితమును ఆంధ్రపద భూయిష్ఠమును నగు 'హరవిలాస' మను ప్రబంధమును విర చించెను. సిరియాల చరిత్రము, పార్వతీ పరిణయము, దారుకా వన విహారము, హాలాహల భక్షణము, కిరాతార్జునీయము,—నను శివకథల ననేక పురాణముల నుండి గైకొని స్వతంత్ర ముగా నీ గ్రంథమును రచించి యపూర్వ వర్ణనా నిపు

ణత్వము, భావగాంభీర్యము, శృంగార రసోత్కర్ష, పాండిత్య ప్రకర్ష,—మొదలుగాఁగల ప్రబంధస్వరూప అవయవము లను వెల్లడించెను. దీని తర్వాత రచింపఁబడిన కావ్యము భీమఖండము. దీనికి మాతృక స్కాంద పురాణాంతర్గత భీమ ఖండము. శృంగార నైషధము వలె నిది సంస్కృత పద భూయిష్ఠముగా నున్నను జక్కని లోకోక్తుల తోడను, జాతీయముల (Idioms) తోడను,—నిండి సహృదయ రంజకముగా నున్నది. భీమఖండము రచించిన పిదప నితఁడు కాశీఖండమును రచించినాఁడు. తానే దానిం గూర్చి

"స్కాంద పురాణ సంహితకు
ఖండము లేఁబది యందులోన నా
నందవనాను భూతి కథ
నంబున వక్తకు శ్రోతకుఁ శుభా
నంద పరంపరా వహము
నైజ గుణం బగు కాశి ఖండ మా
క్రందువ యే నెఱింగి సమ
కట్టితి కావ్యముగా నొనర్పఁగన్."

—అని చెప్పికొనియెను. శ్రీనాథుని గ్రంథములలో నిది యుత్తమోత్తమము. సంస్కృతమున కిది సరియైన యను వాదము కాదు. కాని ఇందలి పదసారళ్యము, ప్రౌఢిమోల్లస నము, రచనా చమత్కృతి.—ముఖ్య కారణములు. శివరాత్రి మాహాత్మ్యము కట్ట కడపటిది, ఇందు వాడిమిఁజెన యతని కవితాధార సజసజ మని పజుగు లిడు చున్నది. "True

ease in writing comes from art not chance."—
అను నొక ఆంగ్లేయసూక్తికిం బట్టి యభ్యాసవము వల్లనే
కళాకౌశల మేర్పడు ననుట కితఁడు కడపటి గ్రంథములే
తార్కాణలు. శివరాత్రి మాహాత్మ్యమునకు ముందే 'క్రీడాభి
రామ' మను వీథి నాటకమును రచించి తన యపూర్వ భావ
శబలతను వెల్లడించినాఁడు. ఈ గ్రంథమును గుఱించి ప్రొఫెసరు
వేంకట రంగయ్య ఎం. ఏ. గారు.

"The work entitled Kridabhiramam was written by Srinadha, one of the greatest of the Telugu poets. It is characterised by all those poets qualities associated with the writings of that prince among poets . . ... It has however to be noted that the book throws a flood of light on social conditions in the great kingdom of Telingana under prataparudra and as such its value to students of research and historians is immense"—

అని వ్రాసిన వాక్యములు దీని యుత్కృష్టతను విశద
పఱచు చున్నది.

ఇఁక పలనాఁటి వీరచరిత్ర, కాటమరాజు కథలు పండిత
జనైకవేద్య మగు సంస్కృత చ్ఛందో బద్ధమై యున్న మార్గ
కవిత్వమునే గాక సర్వజన సమాదరణీయ మైన దేశికవితను
గూడ రచించి యాంధ్రభాషా జాతీయత నిలువఁ బెట్టిన వాఁ
డని స్పష్ట మగు చున్నది. ఇవి ద్విపద గ్రంథములు. పలనాఁటి
వీర చరిత్రము లోని శౌర్య సాహస కృత్యములు ఒడలు
పులకరించి జలదరించును. ఇం దీతని దేశ చరిత్రాభిమానము

ద్యోతక మగు చుండును. ఇతఁ డిట్టి పాటల, పదాల, ఏలల, జోలలఁ, బెక్కింటిని రచించి జన సామాన్యమున కుత్సాహము, ఆనందము, – జేకూర్తించి యున్నాఁడు. "హరి హరీ నారాయ ణాదినారాయణా కరుణించి మమ్ము నేలు కనుల లోచనుఁడా"—అను నయ్యవారి పదము నితఁడు వ్రాసినదే యని కొంద ఱందురు. ఇట్టివే తెలుఁగు నాఁడునకు సహజములై తెలుఁగు వారి ప్రత్యేక ధర్మమును స్పష్టముగా స్ఫురింపఁ జేయును.

కావుననే వీని యావశ్యకతను గుఱుతించి శ్రీనాథుఁడు మాత్రాగణ ఘటితమై తాళ లయాన్విత మగు దేశి పలుకుల తెనె తేఁటలతో నీ గ్రంథముల విరచించి యాంధ్ర వ్యాజక ములుగా నొనర్చి యున్నాఁడు.

తాను విద్యాధికారిగా నున్నయుప్పుడు శ్రీనాథుఁడు రచించిన పోన్నపల్లి, ఫిరంగిపురము లోనుగాఁగల శాసన ములలోని సంస్కృత సాహితీ మహిమ బాణ, మయూరా దులఁ – దలఁపించు చున్నది. ఆతని చాటుధారల లోని భావ స్వాతంత్ర్యము సౌందర్య ప్రకటనము, కవి చమత్కారము— వర్ణింప నలవి కానిది. దండి మహాకవి తన 'కావ్యా దర్శము' న—

"నైసర్గికీ చ ప్రతిభా శ్రుతం చ బహు నిర్మలమ్,
అమందశ్చాఽభి యోగోఽస్య కారణం కావ్య సంపదః"

—అని సహజ ప్రతిభయు, బహు నిర్మల మైన పాండిత్యము, నిరంతరాభ్యాసము, – కావ్య సంపదకు ననఁగాఁ గవిత్వము

నకుఁ గారణము లని చెప్పి యున్నాఁడు. సహజ శక్తి, లోక శాస్త్రాద్యవేక్షణము వలని నైపుణ్యము, కావ్యజ్ఞ శిక్షచే నభ్యాసము, నను నవి కవిత్వోపలబ్ధికిఁ గారణము లని మమ్మటుఁడు నిర్వచించి యున్నాఁడు. కావ్య ప్రకాశమున— "ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా"—యని కావ్య కౌతుకమునఁ జెప్పఁబడినట్లు లెప్పటికప్పుడు నూతనముగాఁ గల్పించు శక్తియే ప్రతిభ యనఁబడు చున్నది. అది పుట్టుకతో నేర్పడున దగుట నితఁడు ముక్కుపచ్చలారక ముందె కావ్య నిర్మాణమునకు దొరకొని నాఁడు. భీమఖండమునఁ దన్నుఁ గూర్చి వెలువడిన

"భాషించి నాఁడవు బహుదేశ బుధులతో
విద్యా పరీక్షణ వేళలందు"

—అను వాక్యము అతని సకలశాస్త్ర వైదుష్యమును ప్రకటించు చున్నది.

"పగులఁ గొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమ భట్టు కంచు ఢక్క"

—అను వాక్యము అతని విద్యావైభవమును వెల్లడించు చున్నది. అతఁడు గురుముఖమున శాస్త్రము లభ్యసించుట చేతనే మూలమున లేని విషయమును దాను స్వీయముగాఁ, గాశీఖండమున

"శాస్త్ర మాచార్య సన్నిధిఁ జదువఁడేని
యర్థ బోధంబు మది సంగ్రహింపఁ డేని

తెగువ మీరాతి ప్రతిజ్ఞ సాధింపఁ జేసి
జ్ఞాతి జయమందఁ జేసి తజ్జనుఁడు జనుఁడె"

—అని యుగ్గడించి యున్నాఁడు. ఇంకఁ గావ్యజ్ఞ శిక్షచే నభ్యాస మను నదియు నితనికిఁ గావ్యజ్ఞుఁడగు తన తాతగారి శిక్ష లభించి యుండ వచ్చునని

"మత్పితామహుఁ గవితాపితామహుని దలఁతుఁ
గలిత కావ్యకళాలాభు కమలనాభుఁ
జంద్ర చందన మందార సదృశకీర్తి
సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి."—(కా. ఖం.)

—అను పద్యము స్ఫురింపఁజేయు చున్నది. ఇంతియ కాక 'కాశీఖండము' లోని

"ఘోడె రాయాంక సద్గురురాయ భీమే
శ్వరస్వామి పద సమారాధనంబు"

—అను పద్యభాగము వలన 'సకల కళాధామ' బిరుదాంచితుఁ డగు భీమేశ్వర స్వామి యను గురువు శ్రీనాథునకు శిక్షఁ గఱపి యుండనగునని తోఁచెడిని. హడ్సన్ చెప్పినట్లు "The really great poets of the world have one and all been substantial men"— ప్రపంచము లోని యుత్తమ కవు లందఱును వ్యుత్పన్నులై యున్నా రనుట వీని పట్ల సన్వర్థ మగు చున్నది.

బహుజ్ఞత లేని కవి గొప్ప గొప్ప విషయములఁ దెలిసి కొని వానిని లోకమున కందఁజేయఁ జాలఁడు. కావున నే షెల్లీకవి

"Poets are the un-recognised Legislators of the World" అని చాటినాడు.

ఇతఁడు భీమఖండమున 'గోదావరి' ని

"తరులతా షండముల తోడ దరుల తోడ
విమల డిండీర ఖండ ఖండముల తోడ
మురువు హరువును నాటోపముఁ జవంబు
వడువు నొప్పంగ గంగమ్మ నడుచు వమ్మ."

—అని వర్ణించి నట్టు మురువు హరువు నాటోపము జవము వను గుణము లన్నియు నితని కవనమునఁ గన్పట్టును. ఇతఁడు మెచ్చిన కవిత్వ సందర్భము (conception of poetry)—

"హర చూడా హరిణాంక వక్రతయుఁగా
లాంత స్ఫుర చ్చాండికా
పరుషోద్గాఢ పయోధర స్ఫుట తటీ
పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా
సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించు చుండుఁ గవిరా
జీ గేహ రంగంబులన్."

—అను 'కాశీఖండ' పద్యము తెలుపు చున్నది. కావుననే యితఁడు తెలుఁగు పద్యములకు అపూర్వ మైన నిబ్బరపు నడక నేర్పినాఁడు. ఇతని సీసములు చరణముల నిలుకడతో సమపాద విన్యాసము గలిగి మదపు టేనుఁగు గతి ననుసరించుచు నత్యంత మనోహరముగా నుండును. చూడుఁడు.

"ప్రథమానురాగంబు రాజహంసము చేతఁ
దెలిపి యంపిన యట్టి దిట్టతనముఁ
బేరోలగంబునఁ బెద్ద గద్దియ నుండి
దృష్టించి డగ్గని ధీరతయును
నుత్తర ప్రత్యుత్తరోక్తి నైపుణ శక్తి
గర్వంబు సూపిన కలికితనము
వరణావసరమున వాసవాదుల మాయ
మాయింపఁ నేర్చిన మతిబలమ్ము
నాత్మ దివ్యాకారతా వ్యంజకంబుఁ
బ్రౌఢిఁ బదరింప వ్రీడాభరంబు కలిమి
వైశికం బయి యుండు నెవ్వరికిఁ జూడఁ
గాన లజ్జింప లజ్జించెఁ గమలవదన."—

—ఇది నైషధ పద్యము శయ్యా సౌభాగ్య మీతని సొమ్ము. తొలుత నన్నయ, తిక్కన, సోమనాథాదు లిట్టి త్రోవఁ ద్రొక్కిరి. ఆవల మన శ్రీనాథుఁడు దన లక్ష్యము నెల్ల శయ్యా సౌభాగ్యము జక్కఁజూచుకొనుట యందే వినియోగించును. భీమఖండమున—

"ఆకాశాంచల వీథుల న్నెగడె సం
ధ్యా రాగ రేఖావళుల్
పాకోన్ముద్రిత పారిభద్ర కళికా
పాండిత్య వైతండికో
త్సేక స్ఫూర్జిత చండతాండవరయో
ద్రేకార భట్యుద్భట
శ్రీకంఠ స్థిర కంఠ కోమల జటా
శ్రేణి న్విడంబించుచున్."

—అను పద్యమున నర్థగౌరవము కంటె శయ్యా సౌభాగ్య
మే యతిశయమై యగపడు చున్నది. శ్రవణ మాత్రముననే
యానందము గల్గించు గడుసరి నుడికారముల నుభయ భాష
లలో జతపఱచి సార్థకముగాఁ జెప్పు చాతుర్యము శ్రీనాథు
నకుఁ గరతలామలకమై యున్నట్టు లీ క్రింది

"ఎవ్వాఁడు డాచేతి క్రొవ్వాఁడి నఖమునఁ
జిదిమె భాషాదేవి చిగురు ముక్కు-
తటిగె నెవ్వాఁడు ఖడ్గ ధారాంచలంబున
నగ్ని నాలుక లేఁడు నంటఁబట్టె"

"గౌతమీ గంగ ముత్యాల కంఠమాల"

"కడుపు చల్లఁగ వేదాల కన్నతల్లి"

"కాశి కరుగంగ నేఁటికి కాళ్ళజాలి"

"హాలాహలం బను నల్లో నేరెడి పండు
మిసిమింతుఁడును గాక మ్రింగినాఁడు"
"అవ అవ మంచు నెఱ్ఱని చంద్ర మల్లెల
చోద్యంపు గుండాలు సొచ్చువారు"
"ఎవ్వాఁడు వింధ్యాద్రి నిఱ్ఱింకు లింకించె
గంభీర హుంకార గర్జనమున"
"వణఁకు గుబ్బలి రాచవారి కూరిమి కన్య
భీమయ్య శుద్ధాంత భామఁ గొలిచి"
"పేద లయ్యును గడు బిఱ్ఱ బిగిసి యుంద్రు
వట్టి యభిమానము లను గర్వములఁ బట్టి

యల్లు వారికి నెల్ల నీ యవగుణంబు
వెన్నతోఁ బెట్టినది యింత విసువ నేల."

—అను నీ పద్యములలో ముక్కందు ముచ్చటఁ గొల్పు నది చమత్కారము. చక్కని శయ్యలో వింత వింత పదముల సంతరించి యర్థంపు సొంపు ననుగతి పఱచుట కవిసార్వభౌముని గ్రంథము లందె యగపడును.

ఇక్కవికులాగ్రసరుఁడు సూర్యోదయాది వర్ణనలలో మూలమున లేకుండినను నిజ కవితా ప్రాగల్భ్యము విపులముగఁ బ్రకటించి యున్నాఁడు. చూడుఁడు.

"సంజ కెంపును దిమిర పుంజపు నలుపు
గమిచి బ్రహ్మాండ భాండంబు గరము మెఱసె
పరమ పరిపాక దశవృంత బంధ మెడలి
పతన మగు తాటి పంటితోఁ బ్రతిఘటించి."

— భీమ ఖండము.

"తఱిపి వెన్నెలలోని ధావళ్య మొక కొండ
నవ సుధా కర్దమ ద్రవము గాఁగఁ
జిన్నారి పొన్నారి చిఱుఁత చీఁకటి చాయ
యసలు కొల్పిన మషీరసము గాఁగ
నిద్ర మేల్కాంచిన నెత్తమ్మి మొగడల
పరువంపుఁ బుప్పొళ్లు హరి దళముగఁ
దొగలు వన్నియ లేఁత తొలు సంజ కెంజాయ
కమనీయ ధాతు రాగంబు గాఁగ

వర్ణములు గూడి యామినీ వ్యాపగనుమున
జగము చిత్రింపఁ దూలిక చందమైన
కౌమరుఁ బ్రాయంపు నూనూఁగుఁ గొదమ యెండ
ప్రాచి కభినవ మాణిక్య పదక మయ్యె.”

—(కాశీఖండము) ఇవి మన కవిసార్వభౌముని స్వకపోల కల్పితములే! ఇతని గ్రంథములలోని సంభాషణము లనన్యసామాన్యములై పాత్రము లెట్టయెదుట మాటాడున ట్లుండును. చూడుఁడు.

“లోలార్కునకు నీకు లోలోన నేమేని
పోటి పుట్టదు గదా మాట...”

—ఇది భీమ ఖండములోనిది.

“ఎందుండి వచ్చితి రీరు ? కాసల్నాఁటు
నుండి వచ్చితిమి మే ముత్పలాక్షి
యెవ్వరి వారు మీ? రేము సంకృతి పూతి
మాష మాధవుని కుమార వరుల
మీ దివ్యనామకం బేదియో ? గోవింద
మంచన శర్మ సమాహ్వాయులము
మీర లిచ్చటికి రాఁ గారణం బెయ్యది ?
చేరి మీ బోంట్ల నాశీర్వదింప
నైన విచ్చేసి కూర్చుండ నవధరింప
వార్చి వచ్చెద మటువోయి వనరుహాక్షి
యెచ్చటికి వార్వఁ బోయెద రెఱుఁగఁ జెప్పు ?
డక్కవాడకు మేము బ్రాహ్మణుల మగుట.”

—ఇది క్రీడాభిరామ పద్యము. ఇతని గ్రంథముల సవిమర్శముగఁ జదువు నప్పుడా యా వస్తు చిత్రణములఁ బట్టి యితఁడొక గొప్ప చిత్రకారుఁడేమో యని స్ఫురింపక పోదు. చూడుఁడు.

"పరిపూర్ణ హేమ కుంభములు హస్తంబుల
ధరియించి యిరువంకఁ గరులు గొలువఁ
బలగమై వర శంఖ, పద్మ, మహాపద్మ
మకరాది నిధులు నేమమునఁ గొలువ
వింజామరలు దాల్చి వెనుక దిక్కున దేవ
గంధర్వ గుహ్యకాంగనలు గొలువ
నెలవంక బలువంక నింద్రాది దివిజులు
సేవాంజలులు మౌళిఁ జేర్చి కొలువ
భర్మ పంకజ కర్ణికా భద్ర పీఠి
కాగ్రమున నిండు గొలువుండి యఖిల లోక
రక్షణము సేయు విశ్వేశుఁ బ్రస్తుతింతు
నసమ సౌభాగ్య గుణధన్యు యభ్రికన్య."

—కాశీ ఖండము.

"పువ్వులు కొప్పునం దుఱిమి
ముందుగఁ గొనసియాడు చుండఁగాఁ
జెవ్వన జంగసాఁచి యొక
చేతను రోఁకలి పూని యొయ్యనన్
నవ్వు మొగంబు తోడఁ దన
నందనుఁ బాడుచు నాథుఁ జూచుచున్

సువ్వియ సువ్వి యనుచు నొక
సుందరి బిడ్డను దంచె ముంగిటన్."

— చాటువు.

"వెనుకకు మొగ్గ వ్రాలి కడు
విన్నను వొప్పఁగఁ దొట్టి నీళ్ళలో
మునిఁగి తదంఘ్రి రత్న మగు
ముంగర ముక్కున గుచ్చికొంచు లే
చెను రసనా ప్రవాళమున
శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమ లీల నిప్పుడు చు
పాయము లెట్టివి నొట్టు నేర్చెనో"

— (క్రీడాభిరామము.) దీనిం బట్టి యాతఁ డెట్టి యపూర్వ వస్తువున కైనను జక్కని రూపకల్పన మీయఁగలఁడని తెలియ నగుచున్నది. ఇతని భాషా ప్రయోగములు చాల నితరుల ప్రయోగములకు విలక్షణముగా నుండును. ఇతని పద సంవిధానము, అన్వయ క్రమము, కారక ప్రయోగ వైచిత్రి, పదోపక్రమ నిర్వాహములు, విలక్షణము లై యుండును. సామాన్యముగ తెలుఁగు కవులు విశేషణమును ప్రథమాంత ములుగా నుంచి 'అగు' క్రియాజన్య విశేషణమును జేర్చి విశేష్యముతో నను సంధింతురు. ఇతఁ డెక్కువగా విశేషణ విశేష్యముల 'నేక విభక్తి' యందె నిల్పును.

"భువనైక ధన్వి చేఁ బుష్పాయుధుని చేతఁ
బ్రసవాస్త్రమున నేటు వడని వాఁడు"

"హాటక గర్భుచేతఁ గనులొసనుచే"
"శ్రీ విశాలాక్షిచే శిశిర భాను కిరీటు
నర్ధాంగ లక్ష్మిచే నగజచేత"

ఇట్టి వనేకములు గలవు. సీసము నాల్గు చరణములను క్రియాన్వితము లగు వాక్యములుగాఁ జెప్పి యెత్తుగీతిని యత్తదర్థక శబ్దముతో నుపక్రమించి పూర్వచరణములతో నన్వయము పొసఁగించుట శ్రీనాథ కవిసార్వభౌముని క్రొత్త గడుసరి కూర్పు నేర్పు. చూడుఁడు.

"అఖిల ప్రపంచంబు నన్యథా కల్పించెఁ
బటు రోష రేఖ సాఫల్య మొంద
ఎవ్వఁ డాతండు సామాన్య ఋషియె తలఁప!"

—అన్నిఁటి కన్న ముందుఁగా నెన్నఁదగినది నిరంకుశత్వము. కాశీఖండమున దక్షాధ్వర ధ్వంస కథనమున దధీచి యను విప్రర్షి సభామధ్యమున నిలిచి యీశ్వరు నాహ్వానింపక కావించుచున్న యధ్వరమునకు వచ్చిన దేవతలను

"శితికంఠునకు నెచ్చెలి కాఁడు గాఁ డొకో
యటమటీఁడైన యీ యక్షభర్త?
యహికంకణునకు మూఁడవ కన్ను గాఁ డొకో?
పాల్మాలి నట్టి యీ పావకుండు?
పురవైరి కవతంస పుష్పంబు గాఁ డొకో
నిర్భాగ్యుఁ డైన యీ నీరజారి?

గంగాధరునకు లెంకల లెంక గాఁడొకో
పెనుగూళ్లైన యీ యనిమిషేంద్రు
డేమి గుడువంగ వచ్చినా రిండ్లు విడచి
హరుని వెలివెట్టి నట్టి యీ యాగమునకుఁ
బంచవదనుని కను జేవురించె నేని
తత్క్షణము నంద తమ యాంధ్రత్రాళ్లుఁ దెగవె!"

—అని యుపాలంబించిన వాక్యముల లోని నిరంకుశత్వ మును భావోద్రేకమును, నెంత యని కొనియాడఁ గలము. గీత పద్యము లోని మొదట గీతించిన పలుకులలో రెండవ యర్థ మెంత యశ్లీలముగా నున్నను గొన్ని పట్టుల నది యెంతయు సభ్యము సరసము నై యున్నది. ఇట్టి రచనలు కవిసార్వభౌమునకుఁ గాక తాటోటు కవులకు సాధ్యమా!

"A thing of beauty is a joy for ever."



"చుండి" సంస్థానాధీశుల ప్రధాన మంత్రి యగు

# చుండి కౌశయామాత్యుఁడు

(క్రీ. శ. ౧౬ వ శతాబ్దము.)

---

ఇతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. కౌశిక గోత్ర కలితాపస్తంబసూత్రుఁడు. శివపూజా రతుఁడు. చుండి సంస్థానాధీశుల యొద్దఁ బ్రధానమంత్రిగా నుండి తేజరిల్లిన వాఁడు. తల్లి సోమాంబ. తండ్రి రామమంత్రి. అద్రీంద్ర స్థైర్యుఁడు. స్వామిద్రోహర గండ నవ సమీర బలుఁడు. రుద్రాక్ష భూతి భూషణ ముద్రాంకుఁడు. దుస్సంగదూరుఁడు. నభస్సింధు సమాన కీర్తి భరితాంకుఁడు. నిస్సీమ భూప్రదాత. అఖిల విద్యానిధి. విస్సాంబాపతి. శౌర్యధనుఁడు. నుత రాధేయ సమాన దాన రసికాగ్రణి. నీతి యుగంధరుఁడు. శంభు భక్తి కలితాత్ముఁడు. బంధుప్రియుఁడు; అట్లని 'మల్హణ చరిత్ర' మందలి

"ఈ దృశ గుణ జలరాశికి
శ్రీ దేవీ వరతనూజ శృంగారునకు
న్భూదాన భార్గవునకు ను
మా దేవీ వర విభూతి మహిమాఢ్యునకున్."

"బంధుర విక్రమ శాలికి
సింధు గంభీరునకు శేముషీ ధిషణునకు

న్బంధుఁ బ్రియునకు నీతి యు
గంధునకు శివభక్తి లలితాత్మునకున్."

"యోధాగ్రేసరునకు నుత
రాధేయ సమాన దాన రసికాగ్రణికి
న్యాభధర రిపు విభవునకు న
సాధారణ ధైర్య శౌర్య సద్గుణ మణికిన్."

"అద్రీంద్ర ధైర్యునకు స్వా
మిద్రోహర గండ నవసమీర బలునకున్
రుద్రాక్ష భూతి భూషణ
ముద్రాంకునకు న్బ్రధాన మూర్ధన్యునకున్."

"దుస్సంగ దూరునకును న
భస్సింధు సమానకీర్తి భరితాంకునకున్
నిస్సీమ భూ ప్రదాతకు
విస్సాంబా ధవున కఖిల విద్యానిధికిన్.

"శ్రీ మంతున కఖిల కళా
ధామునకును గీర్తినిధికి ధర్మాత్మునకున్
సోమాంబా తనయునకు మ
హామహునకుఁ జండి కాళయామాత్యునకున్."

—అను షష్ఠ్యంత పద్యము లవగత మొనర్చుచున్నవి. ఇతని నునుంజూడ్కి ధీమదాశ్రిత దైన్య తామిస్రమునకు నైందవ కరాళి. ఇతని యాజ్ఞప్తి సామంత సీమంతినుల కొప్పు విరుల కగ్గలపు గాలి. ఇతని వితరణము ఇనసూను ఖేచర ప్రకట

దాన ప్రౌఢిఁ బరిఢవించుచు, ఇతని కీర్తి శైలేంద్ర కన్యాధీశ కంఠ హాలాహలాంకంబుఁ గప్పఁగా, ఇతఁడు నేపాళ, కురు, నిమ, ఘూంగ, వంగ, గౌళ, గాంధార, మగధ, కొంకణ, విదేహ నృప మహాస్థాన కవి వర్ణనీయ గుణుఁడు. అట్లని

"ఏ మంత్రి నునుఁ జూడ్కి ధీయదభ్రశిఖా దైన్య
తామిస్రమునకు నైండవ కళాళి
ఏ మంత్రి యాజ్ఞప్తి సామంత సీమంతి
నుల కొప్పు విరుల కర్గలపు గాలి
ఏ మంత్రి వితరణం బినసూను ఖేచర
ప్రకట దానప్రౌఢిఁ బరిఢవించు
నే మంత్రి కీర్తి శైలేంద్ర కన్యాధీశ
కంఠ హాలాహలాంకంబుఁ గప్పు
నతఁడు నేపాళ, కురు, నిమ, ఘూంగ, వంగ,
గౌళ, గాంధార, మగధ, కొంకణ, విదేహ,
నృప మహాస్థాన కవి వర్ణనీయ గుణుఁడు
చూడి రామయ కాళుఁ డఖండ యశుఁడు.

—మల్హాణ చరిత్ర (ప్ర. ఆ. పద్యము) మందలి పద్యము దెలుపు చున్నది. అంతియ కాక ఇతఁడు సముద్ధత కీర్తి దశ దిశావిశ్రాంత దంతి దంతములతోఁ ద్రస్తరింపఁగా, దన మనోహరమూర్తి తరుణతాహంకార మానినీజనముల మరులు గొల్పఁగా, దన దాన విస్ఫూర్తి ధనరాజ సంతాన చింతా మణి శ్రేణి సిగ్గుపఱుపఁగాఁ దన వాగ్విలాసము దందశూకాధీశ దేవేంద్ర గురుల నేవగింపఁగా,— బరఁగ సుర సరి దురుతర

బహు తరంగ నివహ ఘుమఘుమ రవ సముదిత సుకవి ఫణిత వర గుణ మణి గణాభరణ శాలి.

ఇ య్యఖండ యశుఁడు
“... ... ... ... ... ... ... ... ... ... ...
అవని ననుకూల దాంపత్య సుఖ నటించు
నఖిల జనములు వినుతింప నతుల మహిమ
మంత్రి రామయ కాళనామాత్య చంద్రుఁ
డనఘ విస్సాంబ నుద్వాహ మయ్యె నెలమి.”

అగుటచే

“పరకాంతఁ జూడఁడు పైత్రోవఁ జూచెనా
వర్ణించు మఱి కాని వావిగాను
తలఁచు మాటాడఁడు తగుచోట నాడెనా
యబ్రహ్మపదము శిలాక్షరంబు
తర మెఱుంగక యీఁడు తగ మెచ్చి యిచ్చెనా
చాలు నర్థికి జన్మ జన్మములకు
మనసీక నిల్పఁడు మదినిచ్చి నిల్పెనా
యది విభీషణు పట్ట మచ్యుతంబు
రక్ష రాష్ట్రమునకును శ్రీరామ రక్ష
యాజ్ఞ సుగ్రీవు నాజ్ఞఁగా నడఁచె రిపుల
బుణ్యవంతుండు సద్గుణ భూషణుండు
చుండి రామయ కాళుఁ డఖండ యశుఁడు.”

—అను ‘మల్హణ చరిత్ర’ ప్రథమాశ్వాస పద్యములం బట్టి పరనారీ సహోదరుం డనియు, దాన రాధేయుం డనియుఁ,

దన రాష్ట్రమునకు శ్రీరామ రక్షగాఁ, దన యాజ్ఞ సుగ్రీవు నాజ్ఞఁగా,—రిపుల నడఁచిన వాఁ డనియు, జన్మ జన్మములకుఁ జాలినంతఁగా నర్థి కిచ్చు మహాసీయుం డనియుఁ,—దెలియవగు చున్నది.

ఇ య్మతిమంతుఁడు తన బంధురాజిలోఁ జేరిన పెదపాటి యెఱ్ఱనచే 'మల్హాణ చరిత్ర' మను ప్రబంధ రత్నమును విర చింపంజేసి తాఁ గృతినందిన నిరుపమ గుణహారి. మల్హాణుని కథ పండితారాధ్య చరిత్ర నుండి గ్రైకొనఁబడి, మల్హాణుని కథ ప్రధానముగను, శ్వేతుని వృత్తాంతము ప్రాసంగికముగ,— ఎఱ్ఱన గ్రైకొని శృంగార రసాభ్యుచితముగ నిబంధించినాఁడు. పదునేడవ శతాబ్దము నం గల సాంఘిక జీవనము, ప్రజాభి రుచి,—ప్రతిబింబింపఁజేసినాఁడు. స్వాభావిక వర్ణనలతోఁ, జక్కని లోకోక్తులతోఁ,—గథను సాఁగించి, వారాంగనా సక్తుం డయ్యును మల్హాణుఁడు శివభక్తి రతుఁ డగుటచేఁ దన యభీష్టమును ఈశ్వరాను గ్రహమునఁ బడయఁ గలిగెనని విశద పఱచినాఁడు. నిష్కళంకమనుం డగు నీ మంత్రి రత్నమును దిల కించిన యర్థికోటికి

"చెంపల గంధము స్మరణుఁగుఁ
జెక్కుల నొత్తిన యన్మథాంకపుం
గెంపులు వీటికా విహిత
కృత్రిమ రాగము కంటి యెమ్మెలు
న్మంపుఁ గొనంగఁ గ్రమ్మఱు కు
మంత్రులఁ జూచిన రోఁత..."

—మానుచుండెడి వఁట!

# వీర బుక్కరాయ నృపాలుని మంత్రి యగు
# శ్రీ దివాదం అనంతయ్యా మంత్రి

(క్రీ. శ. ౧౪ వ శతాబ్దము)

---

దక్షిణా పథమున దండకారణ్య మందు గార్గేయ ఋష్యాశ్రమ భూమిఁ దనరు చోట 'దేవరకొండ' కలదు. దాని దాఁపున 'నోరూ' రను గ్రామ మొకండుఁ గలదు. అందు సాధువృత్తిని నందవరీక నియోగి బ్రాహ్మణుం డయిన 'ధాకరాజు' రవణిల్లు చుండెను. అతని సాధ్వి మేళాంబ. ఈ దంపతులకుఁ జౌడేశ్వరీ కృపాసంయోగము వలనఁ జిక్కప్ప యను నొక్క కుమారుఁ డుదయించినాఁడు.

ఇతఁ డుద్భవించిన కొలఁది కాలముననే 'ధాకరాజు' దైవయోగంబునఁ దనువు చాలించినాఁడు. అది మొదలు "మేళాంబ" యా పల్లెయం దష్టకష్టముల నంది జీవనము సాఁగింపఁ జాలక నచ్చోటు వాసి మైదేంద్ర కురవాఁ డగు నీ చిక్కప్పను వెంటనిడికొని యూరూర భిక్షించుచుఁ, గొన్నాళ్ళకుఁ దుంగభద్రానదీ తోయంబుల నతిపవిత్రమై, విద్యారణ్య యతీంద్రుని విజ్ఞాన నియతి నతుల సంపదల కాకరమై, ఋశ్యమూకాది భూభృద్రాజ పఙ్క్తి నవిరళతతి కభేద్యమై బుక్కరాయ నృపాలుని నుద్ధృత భుజాపటిమ ననపాయ

గరిమఁ బెంపారెడు విద్యానగరమునకుం జని చక్రతీర్థంబు నందుఁ గోదండ రామాలయాంగణమున నిలిచి, మహాంగవున సుఖ నిద్ర మై నున్న కందు నచ్చోటఁ జేర్చి, భిక్షకు నగరాంతర వీథి కరుగఁ, గోదండ రామాలయ పార్శ్వ తలమునఁ బెరిఁగి యెంతయుఁ బెంపుఁ గనిన వామలూరున వసించు "సుటుసర్ప" మొండు వెలువడి యల్లన వివర మార్గమున హాయి నిద్దురఁ జెందు నా చిన్నవాని వదనంబున కెండవడ సోఁకకుండఁ దన పడగ విచ్చి తద్దయుఁ గూర్మి ఫాలభాగమ్మునఁ బట్టి యుట్టటులుగ నోలసి యూడుచు నుత్సాహ వృత్తి నుండఁగా, "నాగాభోగి" యను పాములవాఁడు తత్ప్రాంత మం దుండి యా త్రోవం జనుచు, నా వింత నటన నట నిల్చి చూచి, యత్యాశ్చర్య మందెను.

ఆ నాగ మనలఁ గొంతసే పాడి యచ్చోటు వాసి వామలూరుం జేరఁగా, 'నాగాభోగి' యబ్బుర మంది "యితఁడు దశావంతుఁ డగు నేని నాగ స్వరాత్మకం బగు నేఁ జేయు గాన మాలించి యీ యురగ మేతెంచి యీ స్థళమున మగల నాడవలె" నని తలపోసి యా యూహించుకొండికుఁడు వెస నాగసరము మోవినిఁ జేర్చి పట్టి రమ్యమోహాన మధురస్వరము గిరి గుహావళి గిజికొని మెసఁగ నూఁదెను. ఆ మనోజ్ఞ రవళి నాలించి వల్మీకము నుండి వచ్చి యాశీవిష మ్మంతంత బాలుని పయిఁ దన పడగను విప్పి రెండు గడియలు లోకక్రీతి వర్తించి యరిగె నంత మేల్కాంచి చిక్కన్న తన యెదుట సాష్టాంగ రించి యున్న 'నాగాభోగి' ని దిలకింపఁగా, నప్పురుషుండు

చిక్కన్న నవలోకించి "దశాయోగము నీ కబ్బిన నా కేమి యిత్తు" వని కౌఁగిటం గ్రుచ్చి యడుగఁ, జిక్కన "నే దశావంతుండ నౌదునేని చెఱువులుఁ బురములుఁ గొన్ని నీపేరఁ దప్పక నిర్మింతు" నని చెప్పెను. అంతఁడా బాలుని ముద్దాడి మురియుచు దిగిచి చనిన తర్వాత, మేళమ్మ భైక్షంబుఁ గొంచు నరుదెంచి చిక్కన్న నవలోకించి, యా వృత్తాంత మంతయు నెఱింగి యబ్బురం బంది వెక్కసో నుండెను. అ య్యతివ మిన్న యనుదినం బిట్లు లా చిక్కన్న నొంటిపై విడచి తా నొక వంకఁ బురిని భిక్షించుటకై యందందుఁ గ్రుమ్మరుచు, శ్రమ నొందలేక, యోజనఁజేసి, తుదకుఁ దన వెంట నిడికొని చనుచు 'నాయనా! కాలముఁ దప్పిన కారణమున మనకుఁ గష్టములే మనఁగుడు పయ్యెను. నీతండ్రి నీశైశవమునఁ జని పోయిన కారణమున మడి మాన్యములు వోయి, మర్యాద సడలి, గొడ్డుగోదయు నిల్లు గుల్లను దరలి, యున్న సంపద వోవ నూరూర భిక్షించుటయు, నూరె వేఱగుటయు, నేవేళ మనతోడ నెలమిపై నున్న చుట్టపక్కంబు లిత్తఱిని జూడ కుండుటయు, గలనాఁడు తినిపోవఁగలవారె కాని చెడఁజూచి సాయంబు సేయ రెవ్వరు. ఎల్లరకు నన్న మిడిన మన కీ నాఁ డింటింట భిక్షింపవలసి వచ్చినది. కలకాల మిట్టు లాఁకటికిఁ గా నొరుల వేఁడ మనసు రాదు, యాచ్నావృత్తి కంటె సరివారి యింటఁ గష్టము సేసియైన జీవించు టొప్పు. కాఁబట్టి యట్టిచోఁ బరులాడు మాటలు పంతానఁ గొనక సహనభావంబునఁ జనవలెను.''—అని చిక్కన్నతో మేళమ్మ యనఁగాఁ, జిక్కన్న "అమ్మా! బాధలు మనుజునకే కాక గ్రామానికి వచ్చునా? అను

భరింపక తీఱునా? కష్టంబు పైకొన్నవాఁడు శిశువుఁ బెంచువాఁడు
దోసిలి యొగ్గవలసి వచ్చినది. జీవి పరహితార్థమై బ్రతుక
వలయుఁ గాని తన మేలు పాటించికొనని యెఱుఁగ దగును.
ఈ పరమార్థమును నెప్పుడును మనస్సునందుంచుకొని జీవిక
సాఁగింతును. వంతఁ బొగులవలదు. నీ యాత్మకెట్టి యపకారముఁ జేఁ
బ్రయత్నింపను. తన యోగు బాగులఁ దన్నంటి నిచ్చి తనకు
మేలొనరించు ధన్య యీ తల్లిని వెతలఁ బాలుసేయు తన
యుండు నుల్లోకముల సుఖముండఁడు. మాతృమూర్తికి సాటి
యైన దైవతము గలదా? ఆమె హితవు మీఱ నగునా? కన్నమ్మ
యాజ్ఞ నౌదల నిడనివాఁడు కొమరుఁ డగునా? కనుక నా కెట్టి
యంగద గల్గునేని నీ యాన జవదాఁట" నని మేళమ్మతో ననఁగా
నామె కొమారుని బిగ్గఁ గౌఁగిలించికొని, యక్కునఁ జేర్చి
ముద్దాడి, నగర మధ్యమునఁ గరుణాయుతుండు, చక్కని శాంత
మూర్తి, వితరణ గుణశాలి, విజ్ఞాన కుశలి, యగు బుక్కరాయ
మహీపాలు మంత్రిరత్నమై యొప్పు నారాయణాఖ్యుని గుఱించి
తెలిసికొనిన దగుటచే నల్ల నల్లన నామె యాతనిఁ దఱిసి
సాకల్యముగఁ దన చరితంబుఁ దెల్పి సాయంబు వేఁడఁగా, నా
సాధుమతి నిలువునఁ గఱఁగి మన్నించి, యా మేళాంబను
జిక్కన్నను దన యింట నిడికొని, తనయుని భంగి నన్న
వస్త్రంబుల నరసి, పోషించి, యుచిత ముహూర్తమునఁ
జిక్కన్న కుపనయనంబు జరపి, యుత్తమాచార్యుల యొద్ద
నర్వవిద్యలఁ దెల్వి నలవడఁ జేసి, యాతని బుద్ధి సంపద
నెద నెఱింగి, యిచ్చ మెచ్చుచుఁ జన వెచ్చుగా నిచ్చి,
బుక్కరాయల సభకుఁ దన వెంట నాతనిఁ గొంపోవుచుండెను.

అత్తఱి నొకనాఁటి యర్ధరాత్రమున దిల్లీశు నాస్థాన భటు లరుదెంచి పాదుషా యాజ్ఞగా 'ఫర్మానా' యొకటి బుక్కరా యని కీయఁగా, నాతఁడు వ్రాయస కాండ్రకై సేవకుల ననుప నద్దుసరేయి యాపాట వ్రాయస కాండ్రెవ్వ ర త్తరుణమునఁ జిక్కకుండుటచే బంటు లమాత్యుని సౌధాంగణమునఁ జనుచుఁ దత్ప్రాంతమునఁ జావడిఁ దిన్నె సెజ్జగఁ జేసికొని పవ్వళించి నిదురించు చుండిన చిక్కన్నను మేల్కొల్పి బుక్కరాయుల సమ్ముఖమ్మునఁ జేర్పఁ బ్రభుఁ డా లేఖమును జిక్కన్న కొసఁగి పఠింపు మన, నా ధీమంతుఁ డందలి యంశముల నాద్యంత మరసి విశదముగఁ దెల్పి ప్రభువు నానందింప జేసి గృహోన్ముఖుం డయ్యెను.

అనంతరం బవార్తాహరు లేతెంచి ప్రత్యుత్తరముఁ గోర బ్రభువరేణ్యుఁడు దా విన్న యంశ మంతయుఁ గుప్తముగ వినిచి లేఖకుల కా విధ మొప్ప బదులు వ్రాయ నాజ్ఞాపింప, వ్రాయసకాండ్రు "పాదుషా" పనిచిన భాషా విధానము, భావ వైఖరి,—పరికింపక ప్రతిలేఖ వ్రాయ నశక్తతను దెలుప, నా ప్రభూత్తంసుఁడు 'పాదుషా' లేఖ కనఁబడమిం జేసి యా వక్కణ మెల్లఁ దనకు వినిచిన కుర్రవాని న్వేగమె యటకు రావించి, లేఖకుఁ బ్రతివ్రాయఁ గోరఁగా, నతఁడు జ్ఞాపకమును బట్టి ప్రతిలేఖ వ్రాసి, ప్రభువున కొసఁగి యనుజ్ఞ వడసి, నెలవున కరిగెను. ఆనాఁటి రేయి రాయఁడు శయ్యఁ జేర నంతఃపురికిఁ బోవ నచటి దూలఁపు నెఱియలో 'పాదుషా' యనిచిన యుత్తర మగపడఁగా, దాని భద్రముగ నుంచి

మఱునాఁడు దానిం జిక్కన్న వ్రాసియిచ్చిన ప్రతిఁగోడ లేఖ
కులకుఁ జూపి, లేఖకుఁ బ్రతిలేఖములఁ జూఁచి నట్లు లుంట
గుఱుతించి, యాతని బుద్ధివిశేషమున కచ్చెరు వంది, యితఁ
డేక సంధాగ్రాహి యని యెంచి, యాస్థానమునఁ బ్రధానా
మాత్య వరులు దండనాథులు నుద్దండ పండితులుఁ బౌర
బృందము సభాసదు లోలి నాసీను లయి యుండ, నపుడు
చిక్కన్న నచటికి రావించి, యతనిఁ గొండాడి, మమత
రెట్టింప 'నమాత్య పదఁబు' 'నొడయరు' బిరుదంబు నొసంగి,
మన్నించెను.

ఒక్కనాఁ డా బుక్కవిభుఁడు సకల ప్రధానులను సర్వ
సైన్యములను గొలువుడు కాండ్రను గొని యుత్తరాశ నొగి
కార్యభార వహుం డయి వెడలు నవసర మునఁ జిక్కనామా
త్యుని బిలిచి యఖిల రాజ్య వ్యవహారంబు నొప్పించి, ముద్రిక
నొసంగి, బొక్కసము నాతని కైవస మంద యర్పించి, రాజ
కీయ క్రియారతుం డయి తరలెను. చిక్కన్నయుఁ బుడమిఱాఁను
నాదేశమును దలఁదాల్చి వ్యవహార నిరతుం డయి యను
దినము సభాగారమునకుం బోయివచ్చుచు నుండఁ, బ్రభుపత్ని
యాతని కన్దోయి, కపోలము, వేసపుఁదీరు మైచాయ, విలా
సము, ముఖపద్మము, నాతనితీరుఁ,—— దన సౌధతలంబున
నిల్చి చూచి యతి మోహితాత్మ యై య య్యెడఁదకానిఁ దన
యొంటి మేడ కుత్తర నిమేషమునఁ దోడ్కొని రాఁ బడఁతుక
యొకర్తుకను దన సఖి ననుప, నామెయు విసవిస నరిఁగి,
చిక్కన్న కభివందనము సల్పి 'యయ్యా! మా దేవి మీకయి

పంపినది. మీరు వేగ రావలయును. రా వలసు పడ దన రా
దని యనఁ జిక్కన్న మంత్రి యచ్చెరు వందుచు, నెట్టి విపత్తు
ఘటించునో యనుచు లోలోన ననుమానించి యె వ్విధి సేయ
నగునో? పోదగునో, పోరాదో? ప్రభుఁ డూరలేని యు
ప్పట్టున నెట్టి యనివార్య కార్యాంత రాసక్త యగుచుఁ
బ్రభ్వీణి పిల్చెడినో, నేఁ బోకున్న నేమో? యెట్లైన నగుఁ
గాక యేఁగెద నంచుఁ దలఁచి దూతి వెంబడి మేడఁ జొచ్చి,
నవనీలచికుర విన్యాసంబు దాని, రవణించు కబరీభరం బొప్పు
దానిఁ బలు తావి విరుల సంపదఁ గుల్కుదానిఁ, బసమీఱ
దిద్దిన పాపట దాని, గొనఁబునఁ గదలు ముంగుఱు లొప్పు
దాని, సౌమ్య లలాట నక్షత్రంబు దాని, కలువ ఱేకులఁ గేరు
కన్దోయి దానిఁ, దళ్కొత్తు చెక్కుటద్దంబుల దాని, నెలవంక
సాటి వెన్నెల నవ్వు దాని, పల్లవారుణ కరపదముల దాని, జిల్గు
దువ్వలువలఁ జెలువారు దాని, వివిధ భూషలఁ గడు విలసిల్లు
దాని, మవ్వంపు లీలల మలయించు దాని, మృదువచో
యుక్తి నెమ్మొయి మించుదానిఁ, — దన రాఁకచేఁ దనివందు
దానిం గాంచి మానసమునఁ గళవళం బంది, పిల్చిన కారణ
మామె దృష్టులందె తెలియవచ్చుటను సంశయం బతిశయింపఁ
జిక్కనామాత్యుండు చేష్టలు దక్కి వదనంబు వాల్చి నెవ్వగఁ
జెంది నిలువ, న మ్మహారాజ్ఞియు సుమనోజ్ఞ మధుర భాసుర
వచోరచన యులరఁ దా నెంతయు వ్యాజాత్మ యగుచు, నని
శంబు రుచిర హాసాన్విత యగుచు, నర్థానురక్త గుణానురక్త
యును గాక తమకమ్మున గమ్యుల వలచి గోష్ఠుల

యెడఁ దద్దఁ గూర్మిఁ గుప్పించు సంతత సముచిత సంయోగ
శీలినై, యిది ధర్మపథ మగు నిది యధర్మం బని తలపోయని
యవినయ హృదయ నై, సాంధ్యాభ్ర తతి నటు చ్చంచలా
లతకు ననయంబు సైన యగు నతి చంచలాత్మ నై, యనుఁగు
బందుగులకే నన్యుల కేని నలుకు నహింపని యవగీత చరిత
నై, లోకంబుఁ దనదు నాలోక శృంఖలముల బంధింప నేర్చిన
ప్రోడనై, తమి యొక్కటియ జీవధనముగాఁ గనిన కాంత నై,
సిగ్గిడి వారకాంత చందమునఁ జిక్కనామాత్యు చూపిక్క-
సున్నిక దృష్టి నిల్పి, కిలకిల నవ్వుచుఁ, గేలుచు. మిన్నులఁ దన
వాంఛితార్థంబుఁ దెలుపఁగా, సమ్మంత్రి శిరోమణి "యకట !
విరోధి కార్యము మూఁడె" ననుచుఁ దద్దయు బెగడి, సంతా
పంబుఁ బొంది, యవల ధైర్య మవలంబించి, యామెతో
"వలదమ్మ, నీ కీర్తి వలవని శాస్త్ర, శాస్త్రముల కంతనను
రాజ్ఞివి గాన మేలి వర్తనమున మెలఁగుట యొప్పు కాకున్న
లోకంబు కామాంధకార గహన మధ్యంబునఁ గూలి నశించును.
ప్రభ్వీణివి కావున నాకుఁ దల్లివి, కులపతి భార్య, గురుభార్య,
రక్షకుని భార్య, యన్న భార్య, మాతులుని భార్య, త్రేం
భార్య, – తనకు మాతృదేవత లని ధర్మజ్ఞు లందురు నీ కెవ్వ
రీ యధర్మమును బోధించిరి ? స్తవనీయు లగు సత్పురుషు
లతో నెపుడును గికురింత మాని పల్కెడు పలుకు పలుకు,
ప్రవిమల భావ మేర్పడ దీనకోటికి నెలమి నెయ్యమున సల్పెడు
మేలు మేలు, బుధవరులకు ధర్మానుగతిని నెంతయు భక్తిఁ
జేసెడు సేవ సేవ; అంతియ కాని నీ దృష్టియుఁ, బల్కును,
మేలిమి సేవయు, హేయ భాజనముగా నిట్టు లుండుటఁ దగునా?

నేను బ్రహ్మచారిని, నాకు నెలఁతలఁ జూడఁ బాతకం బగును. కాలుష్య బుద్ధితో భామలు నన్నఁ దగదు నే నిఁక నువిదల నే నాఁడు దలఁపఁగా నొల్లను. నేఁ జచ్చు వఱకు నీ బ్రహ్మచర్య వ్రత మనుష్ఠింపఁ గలను. కావున సెలవిమ్ము. ఇచట నిల్వఁగాఁ దగదు"— అనుచు సాగిలఁ బడి నమస్కారం బొనర్చి వెన్కకుఁ జూడకుండ నడక సాగించెను.

నాఁటం గోలెఁ జిక్కనామాత్యుఁ డాస్థానమునకుఁ బోవుట మాని యవనీశున కొక్క లేఖను

"విద్యాపురీ జనవరేణ్యుం డగు వీర బుక్కరాయల చిత్తమునకుఁ దమ మంత్రి చిక్కప్ప ధన్యవాదముల నొనర్చి నివేదించు సవినయ లేఖ. ప్రభూత్తంసమా! మీరు పరమ విశ్వాస పూర్వకముగ నాఁడు బుధకోటిలోన రాష్ట్రంబు కోశమ్ము రాజముద్రికయు నా హస్తగతం బొనర్చి నను బెద్దఁ గావించి నా కృతజ్ఞతను మన్నించినారు నాఁటఁ గోలె రాజ్య వ్యవహార సంగతుల లవమేని వెల్తిఁ గల్గనీక యెపుడు వేయి కన్నులతోడ వీక్షించు చుండ నొక్క యువాంతరము వాటిల్లినది. దాన నగ్గలంబుగ మదీయ స్వాస్థ్య మెడలె. ఎవ్వఁడును దీనిం బూరింపఁ జాలఁడు. మీరలు ధర్మజ్ఞు లగుట నీ తత్త్వ మూహించి, నా యసమర్థత నయదృష్టి నెఱిఁగి, వేగము నగరికి వేంచేయఁ గలరు; మీ రాక కయి వేచి యున్నాఁడ. చిత్తగింపుఁడు,

—చిక్కప్ప మంత్రి"

—అని వ్రాసి జాంఘికులచే నిడి 'నృపునకుఁ జేర్పుఁ' డని యనుచు సత్వరముగ ననిచి కాలగుల నిలువెవలక యుండ నేలిక మగుడి విద్యానగరమ్మునకు విజయము సేయ్యనగ్ని. జరగిన విషయమ్ము సకలమ్ముఁ దనదు నంతఃపుర స్త్రీ జనాళి వలన నాలించి, యథార్థ తత్త్వముం దెలిసికొని, చిక్కనామాత్యుని చిత్తశుద్ధికిని నకలుషవృత్తికిని నబ్బురంబాది తన మందిరమున కాతనిం బిల్పించి "నీదు సౌశీల్యంబు నిరుపమానంబైనది. నీ కుద్వాహ మ్మొనర్ప నిశ్చయించి యుండఁగా శశ్వద్బ్రహ్మచర్య వ్రతంబేల పూనితివి? నీ కిది తగునా? అయిన నీ కిష్ట మగు నేని వరంబొండు వేఁడికొనుము నిచ్చెద" నని యనఁగా విశ్వాసము మూర్తీభవింపఁగాఁ, చిక్కనామాత్యుఁ డతి వినమ్రుఁడై "ప్రభూ! కోశమునం గల ద్రవ్యము నంతను ప్రేమ మెయి నా కిండుఁ" అని యనఁగ, నాతఁడు ముదం బంది యా ద్రవ్యము నొసంగి సత్కార సంహతి ననుపమ గుణధుర్యుం డగు చిక్కప్పను వీడ్కొల్పెను.

చిక్కప్పయు సంతుష్టాంతరంగుం డయి పూర్వ రాజ్యము సేరి పురములఁ, దటాకముల, గుడుల, నెలకొల్పఁ దలఁచి పెన్నమాగాణిలోఁ బెనుకొండ వైపు నుండి యుత్తర దిశను నొక యేఱు వెడలుచుండుటను జూచి యట నొక తటాకంబు నల్లగుట్టల చెంతఁ గట్టి దాని దాఁపున నీ యుత్తర భాగమున గ్రామమ్ము నిల్పి 'నాగాభోగి' పేర నీయూరి చెఱువుల నేకభంగి 'నాగసముద్రం' బని నామధేయం బిడెను.

అంతమాత్రనఁ దన్వేనందక చిక్కప్ప మంత్రి చెలువు
లను నూళ్ళను వింకఁ గొన్ని నిర్మింప నెంచి యందందుఁ దగిన
తావుల వీక్షింపఁ దలఁచి యుత్తరపు దెస నగస్త్యాశ్రమ
దివ్యభాగమునం గల పెన్నగట్టుల గమిఁ జెల్చుకొనుచు వచ్చు
పెన్నేటి త్రోవను నష్టకట్టవైచి యఁచ్చుటఁ బెను వఱద నిల్క
డఁగ నాఁపఁగా నోపెడు నట్టి తటంబు కొండల నడుమ
నెక్కొనఁజేయ నిశ్చయించి, యొడ్డెల ననుజీవి వర్గంబు నచటఁ
జేరిచి, యుదయాస్తమయంబు పనివడి నియమతత్పరత మెలంగి
కార్యసమారంభ కలన నెసంగఁ గూర్కుడు నెడ ముద్దుగుమ్మ
యొక్కరిత స్వప్తి నగపడి "యో కార్యకర్త! యీ యొక
పల్కు వినుము. నీ పూన్కి యెంతయు నిరుపమానము, కాని
గంగకు వడి కడిఁది యా నిచట నామె యుద్యోగంబు నాఁప
నశక్యము. గాన వృథా ప్రయత్న మగు నిప్పని మాని దక్షిణ
మునఁ జిత్రావతీ నది కలదు. అచటఁ జేరి యిప్పని సాఁగించిన
కీర్తి ప్రతిష్ఠ లతిశయిల్లు" నని యంతర్ధాన మయ్యెను. అయ్యమ
గంగాభవానియే యని యాత్మలోఁ దలపోసి యుద్దేవికి నాత్మలో
నెఱఁగి మగుడి నిద్రాసక్తి దేహము నమ్మఱచెను. అఖిల జీవు
లిట్టు మాయాస్తి నడఁగ దిననాథుం డరుదెంచుఁ దెలివొందు
డంచు ఖగవంది నికర మొక్కటను ఘోషించగాఁ, బూషుఁడు
నయ్యుడ రుచిర కోటీర మండనుం డగుచుఁ బొడసూపెను.
అంతటఁ జిక్కనామాత్యుఁడు తెలివొంది, యాచోటు వాసి
సుమవిశంకట ధరాస్థల మధ్యతటిని నుభయ పార్శ్వముల
మహోన్నతరీతిని నాకసం బంటు గిర్యగ్రద్వయంబు పెట్టని.

కోటకుఁ బెనుఁగవవట్టు దనరార దాని యంతర్భాగ మందుఁ
దిరుగు మహాస్రవంతికి ధామ మగుచుఁ గణ్యాశమో
పాంత గహన భాగమునఁ బార్లపల్లియ గండిపట్టు వీక్షించి
యటఁగూష వాహిని యాఁగ దటంచుఁ దలఁచి పశ్చిమ
దిగధ్వమున నరిగి గార్గేయాశ్రమ భూమినిఁ బరఁగు
'దేవరకొండ' పాద భూస్థలిని సమతల మందు స్వేచ్ఛఁగా
బెరిఁగిన 'తుమ్మల' నొరయుచుఁ దోరంపు టూర్మికర నికర
ముల భీకర కందరముల నప్పళించుచు మించు నల్క ఊప్పు
చును గడు ఘూర్ణనము నొంది, కాలవాహిం బలె నురుఁగులఁ
గ్రక్కుచు, నులిమి బొందలఁ గూఁకటి వ్రేళులతోఁ గూల్చుచుఁ
దరుల దరులఁ జీల్చుచును నుద్దవిడి సస్యముల ధరనంట నడఁ
చుచుఁ, దలపీటికడల నొలయుఁ బశ్వాదుల నువ్వోత్తుఁగొనుచు,
గుట్టల రాయుచు, గుడుల దుల్చుచును, బలునైన శిలలఁ
బ్రవాహవేగమున దొరలఁజేయుచు దూఁకిదొడఁ దొడఁ బొలు
"పాండునది" నింగాంచి సంతోష మందెను. అది పదిక్రోశముల
యవ్వలఁజెన్నొందు కంబుగిరీశుని కనుమలలోఁ బుట్టి వచ్చెడు.
మహాస్రవంతి యని యెఱింగి యందొక చెఱువు నిర్మించి
యంత దానికి రెండు మొనలఁ బ్రాగ్దిశ నొకటియుఁ, బడమర
నొకటియు, - అలుఁగుల రెండిఁటి నమర్చి, యచ్చట నొక్కొక
వైపున నొక్కొక్కఁ యూరు గట్టించి, పూర్వదిగ్భాగమున
నెసఁగు స్థానీయమునకు భూధవు కీర్తి వెలయ "బుక్కరాయ
సముద్ర" మను పేరుతోడనుఁ బశ్చిమమునఁ గల పట్టణమ్ము
నకు నాతని భార్య యగు ననంతాంబ రక్తి చిహ్నముగఁ గ్రాల

'ననంతసాగర' మను పేరుతోడను, - వినిర్మించి లోకమున రాజభక్తి భాసిల్లఁజేసెను.

అంతఁ జిక్కనామాత్యుఁడు అనంతసాగరమునకుఁ బ్రక్కను గృష్ణగిరిని దేవాలయ మొకండు గట్టించి బ్రాణలింగంబు దెప్పించి తిరపడ శ్రీ శివదేవ ప్రతిష్ఠచేయించి తత్కార్య చిరతరస్మృతికి శంకరదేవుని సాన్నిధ్యమున శా. శ. ౧౨౮౭ (క్రీ. శ. ౧౩౬౫) క్రోధి సంవత్సర కార్తీక బ ౫ గురువారము నాఁడొక శాసనము వేయించెను, ఇవ్విధి నాతఁడు ప్రతిష్ఠల నయిదింటిని గావించి, దక్షిణ సాగరంబట్టి, యొంటిఁ బడాఱు పరువులు నడచి రేఁగుసాలములు చంద్రపాదపములు తింత్రిణీ ద్రుమములు లోనగునవి గల పర్వతావళిఁ గాంచి యాదారుఁ బచ్చికచోట్లు నింపాదిగా వెలయు సారవంతంబగు సమభూమి జొచ్చి యందలి ప్రకృతిఁ గన్నార వీక్షించి, వరగిరి వేంక టేశ్వరగిరి దరినిఁ బ్రవహించి దానికిఁ బశ్చిమ దిశకు నల్లగుట్టల కవనడుమ వడిమీఱుఁ జిత్రావతినిఁ గని "యీ రెండు గుట్టల యెడమున నొక్క గట్టు వేయించి గంగను నిల్పునెడల నది జీవనాధారమై లోకమునకు నానందదాయిని యగుఁగాదె! నే ని ప్పనిఁ గావింతు" నని లోనఁ దలఁచి యుత్సాహ ప్రక్రియ పేరేపఁ గోట్లకొలందిఁగఁ గూలివారలను నొద్దజనంబును నియోగించి తటము నెలకొల్పి దాని కిరుగడల మరవలఁ గొల్పెను. అంతతోఁ దనివోక చౌడేశ్వరీ నిలయ మొక్కండు గణనాథ సౌధ మొక్కండు నిర్మించెను.

ఆవలఁ గొన్నాళ్ళచ్చట వసించి యుండే యసువులఁ బాసెను. స్వార్థ పరత్వము, స్వాభిమానము నను నవెట్టివో యెఱుఁగని యుద్ధమానసుఁడు, ఔదార్య ఘనుఁడు నై చిక్కనామాత్యుఁ డీ రీతిఁ దన మన్కి నెప్పుడును సాఁగించిన ధన్య మూర్తి. ఇతని యమృత జీవనమే మానవసంతతికి అనంత జీవనమె యగు. ఇ ప్పావన చరిత్రుఁడు మన యందఱ కారాధ్య మూర్తి.

ప్రతాప రుద్ర చక్రవర్తి యొద్ద
"సంధివిగ్రహి"

## కౌకుమాను విశ్వనాథ కవిరాజు విద్వన్మణి

(క్రీ. శ. ౧౪ వ శతాబ్దము)

---

ఇతఁడు సాంధి విగ్రహిక మహాపాత్రుఁడు, ఆలంకారిక చక్రవర్తి. సాహిత్యదర్పణ కర్త. ఇతని తండ్రి చంద్రశేఖర మహాకవి. తాత నారాయణ పాదుఁడు. తన వంశము పెక్కు తరములుగాఁ బండిత యాచార్య మహత్తరులది యని గ్రంథమున సూచించినాఁడు. కళింగ భూమండల మహారాజాధిరాజ శ్రీ నరసింహదేవుని సభలో నారాయణ పాదుఁడు ఆస్థానిగా నున్నయట్లు "కావ్యప్రకాశ" మందలి

"యదాహుః శ్రీ కళిఙ్గ భూమణ్డల
మహారాజాధిరాజ
శ్రీ నరసింహదేవ సభాయాం
ధర్మదత్తం స్థగయన్తః,
అస్మత్పితామహా శ్రీమన్నారాయణ పాదాః"

—అన్న వాక్యము లవగత మొనర్చుచున్నవి. ఇతఁడు చండీదాసుని యన్నకు మనుమఁడని

"అస్మత్పితామహానుజ కవిపణ్డిత ముఖ్య శ్రీ చణ్డీదాస పాదానాం"— అను సాహిత్య దర్పణ వాక్యము దెలుపుచున్నది.

"సాహిత్యార్ణవ కర్ణధార, ధ్వని ప్రస్థాన పరమాచార్య, కవిసూక్తి రత్నాకర, అష్టాదశ భాషా వార విలాసినీ భుజఙ్గ, సాన్ధివిగ్రహిక, మహాపాత్ర శ్రీ విశ్వనాథ కవిరాజ" —అని యితఁడు తన బిరుదావళిని మెల్లమెల్లఁగాఁ దెలిపినాఁడు. ఇబ్బిరుదావళి యందలి "మహాపాత్రము" మహామాత్యార్థక మని యెఱుఁగఁ దగును. విశ్వనాథ మహాకవి తిక్కనలో నగు కవిబ్రహ్మల వలె గొప్ప రాజనియోగి. సంధివిగ్రహి ప్రెగ్గడ కావుననే యాతని యలంకార గ్రంథమున లాలిత్య సారళ్య వైశద్యములు పుంఖాను పుంఖములుగ దొరలిన వని మనీషుల యభిప్రాయము. ఇతఁడు

> "శైవావయం న ఖలు తత్ర విచారణీయం
> పఞ్చాక్షరీ జప పరా నితరాం తథాపి,
> చేతో మదీయ మతసీ కుసుమావ భాసం
> స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరమ్."

—అన్న మతమునకుఁ జెందిన వాఁడు. ఇతని సాహిత్య దర్పణము 'వాక్యం రసాత్మకం కావ్య' మ్మను సూక్తికి సుద్దియై ప్రసిద్ధి నెందిన దగుటచే సాహిత్యార్ణవ కర్ణధారుం డని విశ్రుతుం డయ్యెను. ఈ 'సాహిత్య దర్పణము' క్రీ. శ. ౧౩౮౪ దవ సంవత్సరమునకుఁ బూర్వము ఇంచుమించుగఁ క్రీ. శ. ౧౨౪౦ దవ సంవత్సరము తరువాతను, అనఁగాఁ

త్రయోదశోత్తరార్ధ చతుర్దశ పూర్వార్ధ సంకలిత మ్మగు శతాబ్దియం దెప్పుడో రచించి యుండ నోపు. వాక్యమును రసమును ఆత్మగాఁ గలది కావ్య మను లక్షణముతో నియ్యది విరాజిల్లు చున్నది. విశ్వనాథుఁడు నాటక లక్షణమును సమగ్రముగఁ దన స్వాతంత్ర్యేచ్ఛ వెలయునట్లుగను, నాందీ రంగ ద్వారము లోనగు భేదము నావిష్కరించుటం బోని పట్టుల నిపుణ నిపుణముగను, దత్కర్తలకుం గల్గు ననేక సంశయములఁ దొలంచునట్లుగను,—— అనుశాసించినాఁడు. అంతతోఁ దనివోక

> "సాహిత్య దర్పణ మముం సుధియో విలోక్య
> సాహిత్య మఖిలం సుఖ మేవ విత్త"

——అని వివరించి బుద్ధిమంతు లీ గ్రంథము నవలోకించి సాహిత్య తత్త్వ మంతను సులువుగా నెఱుంగఁ దగు నని విశదీకరించినాఁడు. రసవ ద్వ్యాఖ్యాచార్యుఁడు గదా విశ్వనాథ మహాకవి.

ఇతఁ డగస్త్య మహాకవి, నరసింహ కవులతో పాటు ప్రతాపరుద్రు నాస్థానమునకుం జని సంధి విగ్రహి (minister for peace and war) యై యాలంకారిక చక్రవర్తి నాఁ, బరిఢవిల్లిన వాఁ డగుటచే నితఁడును క్రీ. శ. ౧౪ వ శతాబ్దమున నుండిన వాఁ డని తెలియం దగును. ఇతఁడు పెసరవాయి నియోగి బ్రాహ్మణుఁడు. పరాశర గోత్రుఁడు. "కొండవీఁడు" కాఁపురము.

ఇట్టి మహామాత్యులు, కవిరాజ శిఖామణులు, పాండితీ శౌండులు, — ఎందఱో తమ యశోవిశేషములే విభవమును వేనోళ్ళఁ జాటుచు నుద్యోగ రీతు మర్యాదల నెఱపుటకయి యన్య ప్రాంతములకు నేఁగి నల్దెసల యశోలతలఁ బ్రాఁకించి నేటికిని దారాపథంబున దివ్యజ్యోతులం బలె వెలుంగుచున్నారు.

కాకతీయ గణపతి చక్రవర్తి మంత్రి

# మల్లికార్జున శివదేవ మంత్రి

(క్రీ. శ. ౧౩ వ శతాబ్దము.)

---

ఇతడు నైయోగికారాధ్య బ్రాహ్మణుడు. శ్రీవత్స గోత్రుడు. ప్రతాపరుద్ర వసుధాధిపుచేఁ దొమ్మిది యగ్రహారములం బడసిన వాఁడు. నిత్య సచివేశ్వర సంతతి కెల్ల మేటి. అతులిత సంస్కృతాంధ్ర కవితావళి కెల్లఁ బితామహుండు. బుధ సంఘము లోన మహాప్రసిద్ధుఁడు. అట్లని తుళ్యూరు శరభ రాజకవి వ్రాసిన 'శరభరాజీయము' మను వైద్య గ్రంథమునఁ దన వంశమును గురించి తెలుపుచు

"శ్రీమ దష్టాంగయోగ ప్రసిద్ధాభ్యాసి
ధర నోరుగంటి సత్పుర నివాసి
అమల శ్రీవత్స సంయమి గోత్రపావని

... ... ... ... ... ... ... ... ... ...

అనఁగ నుతికెక్కు శివదేవుఁ డనెడి యోగి
నాయకుండు సదా మోక్షదాయకుండు."

"అతఁడు ప్రతాపరుద్ర వసు
ధాధిపు చేత నవాగ్రహారముల్
హితమతి నంది నిత్య సచి
వేశ్వర సంతతి కెల్ల మేటియై

యతులిత సంస్కృతాంధ్ర కవి
తావళి కెల్లఁ బితామహుండు నై
సతతము వన్నె కెక్కు బుధ
సంఘము లోన మహా ప్రసిద్ధుఁడై."

—అని యుల్లేఖించుటను బట్టి తెలియు చున్నది. ఇతఁడు 'పురుషార్థసారము'ను రచించుటయే గాక 'శివదేవ శతకము' ను గూడ రచించెను. లక్షణ గ్రంథములలో శివదేవయ్య పురుషార్థసారము పేర్కొనఁబడుట వలన నితఁడు క్రీ. శ. ౧౩౮౦ వ సంవత్సరమునకుఁ బూర్వుఁడని చెప్పక తప్పదు. కవి బ్రహ్మ తిక్కన "పురుషార్థసారము" నెఱింగి నట్లు భారతము స్త్రీ పర్వమున "పురుషుడు పురుషార్థసార భూషణుడు గదే" (౨-౧౧౧) అను చరణము ధ్వనించు చున్నది.

తిక్కన ప్రభు వగు మన్మసిద్ధి యక్కన—బయ్యనలచే రాజ్యభ్రష్టుడై మరల గాకతీయ గణపతిదేవ చక్రవర్తి సాహాయ్యమున బునః ప్రతిష్ఠితు డగుట శాసనము ప్రమాణీకరించు చున్నది. కాకతీయ గణపతిదేవు నాస్థానమునకుం జని తన పాండితీ గరిమచే నాతని మెప్పించి యతని సాహాయ్యము వలన దన ప్రభు వగు మన్మసిద్ధిని తిక్కనామాత్యుఁడు సింహాసన మెక్కించె నని స్థానిక చరిత్రలు, సిద్ధేశ్వర చరిత్ర, ప్రతాప చరిత్ర, సోమదేవరాజీయములు తెలుపు చున్నవి.

ఈ సందర్భమున గాకతీయ గణపతిదేవ చక్రవర్తిని సందర్శించిన తిక్కన సోమయాజి యాతనితో

"వసుమతీ నాథ! ఈతఁ డీశ్వరుఁడు గాని
మనుజ మాత్రుండు గాఁడు పల్కు లితని
యను మతంబున నీవు రాజ్యంబు నెమ్మి
నేలు... ... ... ... ... ... ... ..."

మని చెప్పఁ బ్రశంసించెను. కావున దీనిం బట్టి తిక్కన సమకాలికుఁడు శివదేవయ్య యని విదితము కాఁ గలదు.

గణపతిదేవ చక్రవర్తి యఱువది రెండేఁడులు అనఁగా క్రీ. శ. ౧౧౯౮ మొదలు ౧౨౬౦ వఱకు రాజ్యమును బరిపాలించినవాఁడు. తిక్కన కవిబ్రహ్మ గణపతిదేవ చక్రవర్తి యొద్దకు బోయినది. క్రీ. శ. ౧౨౫౮-౫౯ ప్రాంతము. గణపతిదేవ చక్రవర్తి కాలమున సాక్షాన్మహేశ్వరావతార మని పేరెన్నిక గన్నవాఁడు విశ్వేశ్వర శివదేశికులు. ఇతఁడు గణపతిదేవ చక్రవర్తికి దీక్షా గురువు—రాజగురువు. ఇతని వాడుక పేరు 'శివదేవయ్య' అని ప్రతాప చరిత్ర, సోమదేవ రాజీయము, — లోనగు గ్రంథములం గలదు.

గణపతిదేవ చక్రవర్తి క్రీ. శ. ౧౨౬౧ లో 'మందడ' (గుంటూరు తాలూకా) మను గ్రామమును, ఇతని కొమార్త రుద్రమాంబ 'వెలగపూఁడి' యను గ్రామమును, — శివదేవయ్యకు దానము సేయఁగా, నితఁడు 'విశ్వేశ్వర గోళకి' యను మఠమును, అగ్రహారమును అచ్చట నెలకొల్పి మఱి కొన్ని యగ్రహారములను దానము సేసినట్లు 'మల్కాపుర శాసనము' వాకొనుచున్నది. ఈ శాసనమునఁ బేర్కొనఁబడిన విశ్వేశ్వర శివదేశికులును, స్థానిక చరిత్రల యందు

పేర్కొనఁబడిన శివదేవయ్యయు, నొక్కరే యని సిద్ధాంత మగుచున్నది గదా! మల్కాపుర శాసనమున విశ్వేశ్వర శివదేశికులు తన స్వగ్రామ మగు పూర్వ గ్రామ నివాసులును, సామవేదులును, శ్రీవత్స గోత్రులు నగు బ్రాహ్మణులకు ముప్పది పుట్ల భూమి నొసంగినట్లు లున్నది. శరభరాజ కవి పొరపడి గణపతిదేవ చక్రవర్తి యనుటకు బదులు ప్రతాపరుద్రు డని వ్రాసె ననుట యథార్థము.

నాగ నారాధ్యు డను కవి శివదేవకవి క్రీ. శ. ౧౨౫౭-౧౩౨౬ లో నున్నయట్లు 'ద్విపద బసవ విజయము' న

"అనుచు నా శివదేవు డా ప్రతాపునకు
వినిపించి బసవయ్య విఖ్యాత మహిమ
విని సంతసిల్లి యా వీర ప్రతాప
జనవరేణ్యుఁడు తన సయ్యన మంత్రి
శివదేవునకు మహాశ్రీ లుల్లసిల్ల
వివిధాంబరంబులు వివిధ వస్తువులు
రూపింపఁగా నిచ్చె రుద్ర నరేంద్రుఁడు
చేపట్టి యుండె సుస్థిర కాలమెల్ల."

—అని యుల్లేఖించి యుండుట వలనను, తుమ్మలపల్లి నాగభూషణకవి తన 'పద్య బసవ విజయమున' "శివదేవుఁడు ప్రతాపరుద్రదేవునకు బసవన్న మాహాత్మ్యంబు వినిపించిన నతండు విని సంతసిల్లి వివిధాంబరంబులు వివిధవస్తువులు ప్రతాపరుద్రుం డొసంగి యతని సంతుష్టిం జేసి సుఖం బుండె."

అని గ్రంథాంత మందలి గద్యలో వివరించినాఁడు. శివదేవకవి ప్రతాపరుద్రుని కాలమున నునఁగాఁ గ్రీస్తుశకము ౧౨౯౫-౧౩౨౬ లో నుండుట యసంభవము కాదుగాని యందులకుం దగు సాధనాంతరములు లేవు.

శివదేవకవి భక్తుఁడు. తన్నుఁ దాను సంబోధించుకొని వ్రాసికొనిన 'శివదేవ ధీమణీ!' యను మకుటము గల 'శివదేవయ్య శతకము' నందలి

"ప్రాణు నపాను గూర్చి యల
పాము గదల్చి త దూర్ధ్వ కీలితో
ద్యాణము నొత్తి మేను దృఢ
మై నిగుడం బిగియించి దృష్టులం
ఘ్రాణము చేర్చి యా ప్రణవ
ఘోషమునే విని యందు మానస
క్షీణము జేసినం బవన
సిద్ధుఁడ నా శివదేవ ధీమణీ!"

"అరయఁగఁ బిన్ననాఁటు సిరి
యాళుఁడనై యెలఁబ్రాయ మందు సుం
దరుఁ డను నంబియై పదను
దప్పిన గుండయ గారి చందమై
ధర చరియింపఁ గల్గిన త
థాస్తు వృథా పరిపాక రూప దు
ష్కర జననం బదేమిటికి?
కాలుపనే శివదేవ ధీమణీ!"

—అను పద్యములు మడికి సింగన సంధానించిన 'సకల నీతి సమ్మతము'నఁ గలవు.

తుళ్లూరు శరభరాజకవి 'శరభరాజీయము' న శివదేవయ్య సంస్కృతాంధ్ర కవితాపితామహుఁడని ప్రసిద్ధి నొందెననియు, ప్రతాపరుద్ర వసుధాధిపుచే నవాగ్రహారములు వొందె ననియు, దాను 'శివదేవసుల సుధాగ్గన హింసాంశసంభ' నని చెప్పికొనుట వలనను, శివదేవయ్య వంశస్థుఁడు శరభరాజ కవి యని విస్పష్ట మగుచున్నది. ప్రతాపరుద్రునిచే నీఁబడిన నవాగ్రహారములలో 'తుళ్లూరు' ఒకటి. అక్కడిన 'శివదేవయ్య' వంశస్థులెల్లరును 'దుళ్లూరు' వారనఁ బఱగుచుండిరి.

ఈ శివదేవయ్య కొమారుఁడు "పరిపూర్ణ శివ మహాముని" శివదేవయ్య వోలె నితఁడును బ్రసిద్ధ పురుషుఁడే! సత్తెనపల్లె తాలూకా వాస్తవ్యుఁడు.

సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు

## సచివోత్తముఁడగు

# వాఐసభీమనభట్టు

(క్రీ. శ. ౧౧ వ శతాబ్దము.)

---

ఇతఁడు సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు అను నన్వర్థ నామము గల విజయాదిత్యు నొద్ద సచివోత్తముఁడు. ఈ విజయాదిత్యుఁడు రాజరాజ నరేంద్రుని సవతి తమ్ముఁడు విమలాదిత్యునకుఁ జోళవంశపు రాణి యగు మేళవ మహాదేవి వలనఁ బుట్టిన వాఁడు. శక ౯౯౪ (క్రీ. శ. ౧౦౭౨) నాఁటి శాసనమున

"శాకాబ్దే యుగనంద రంధ్రగణితే చైత్రం గతే భాస్కరే
శ్రీ మార్కండ మహేశ్వరాయ వసతే గోదావరీ ప్రాన్తకే
ప్రాదాద్దీప మఖండవర్తి మనిశమ్ విప్ర ప్రదీపా స్స్వయమ్,
భీమశ్శ్రీమ దమాత్య కృత్య నిపుణో మాతాపితృ శ్రేయసే"

స్వస్తి సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సర ౧౨ శ్రాహిం విష్ణు సంక్రాంతి నిమిత్యంబున మార్కండేశ్వర మహాదేవరకు భీమన ప్రెగ్గడలు వెట్టిన యఖండవర్తి దివియ... ..."

—అని యున్నది. ఈ శాసనపద్య ముదాహరింపఁ బడిన సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు విజయాదిత్యుఁడే యని యెఱుంగుటకుఁ "పాములవాక" శాసన ముద్ఘోషించు చున్నది.

విజయాదిత్యుఁడు ధర్మసంస్థాపనమునకై రాజ్యమును సంరక్షించు నిమిత్తము తన భుజశక్తిచే భూమినిఁ గాపాడె నని యీ 'పాములవాక' శాసనము వాకొను చున్నది. కాఁబట్టి యీ విజయాదిత్యు నొద్ద మంత్రిగా నున్న భీమనభట్టు వ్రాయించిన శాసనమే క్రీ. శ. ౧౦౭౨ నాఁటి శాసన మని విదితము కాఁగలదు.

ఈ భీమనభట్టు నన్నియ భట్టారక మహోపాధ్యాయుని కొమారుఁడు. నన్నియ తండ్రియు భీమనభట్టే! విమలాదిత్యు నొద్ద సంధివిగ్రహాధికారి (minister for peace and order) యై భీమన భట్టు విలసిల్లెను. విమలాదిత్యుని ముఖ్య మంత్రి (premier) యగు రావుల వజ్జియ ప్రెగ్గడకు విమలాదిత్యుఁ డగ్రహార మొసంగి వ్రాయించిన "రణస్థిపూఁడి" శాసనము సంధివిగ్రహి కావ్యకర్త యగు భీమన భట్టే!

విమలాదిత్యుని కొమారుఁడైన రాజరాజు వ్రాయించిన 'కోరుమిల్లి' 'కలిదిండి' శాసనముల కర్త భీమనభట్టు కొమారుఁడయిన బేతనభట్టు. ఆ రాజరాజ నరేంద్రుఁడే వ్రాయించిన 'నందమపూఁడి' 'మండ' శాసనముల కర్త నన్నియభట్టు. దీనిం బట్టి 'రణస్థిపూఁడి' శాసన కావ్య కర్త యైన భీమన భట్టును, 'కోరుమిల్లి' 'కలిదిండి' శాసనముల కర్త యైన

బేతనభట్టు తండ్రియైన భీమనభట్టును,—నొక్కఁడే యనియు భిన్నులుగా రనియుఁ దెలియనగు చున్నదిగదా !

ఇ ప్పరామర్శముం బట్టి నన్నియ బేతనభట్టు లిర్వు రును భీమనభట్టు కొమాళ్లనియు, నన్నియభట్టు కొమారుఁడే భీమన భట్టనియు,— విదితము కాఁ గలదు గదా !

రాజస్థానములలో సంధి విగ్రహి (Ministe1 f 1 peace and war) యుద్యోగము నం దున్న యతఁడు శాసన గ్రంథముల వ్రాయు చుండు నని స్మృతి గ్రంథము లందుఁ జెప్పఁ బడి యున్నది. విమలాదిత్యు నొద్దను, నాతని యనంతర మతని కొమాళ్ళగు రాజరాజు విజయాదిత్యుల యొద్దను,—సంధి విగ్రహులుగా నుండి ప్రసిద్ధి సెందిన వారు భీమనభట్టును, అతని కొమాళ్లు నన్నియ బేతన భట్టులును, నన్నియ కొమారుఁడు భీమన పెగ్గడయు,—నని యెఱుంగఁ దగును.

దీనిం బట్టి వంశక్రమాగత మైన రాజాశ్రయము తొలుత భీమన భట్టును, ఆవల నన్నియ బేతన భట్టులును, ఆ పిదప నన్నియ కొమారుఁ డగు భీమన పెగ్గడయు,— సంధి విగ్రహులు (Minister for peace and war) గా నుండి సుప్రశస్తి వహించి యుండుటచేఁ గాఁబోలు నన్నియ మహోపాధ్యాయుఁడు తన భారతమునఁ "దన కుల బ్రాహ్మణు ననురక్తు" నను మొదలుగాఁ గల వాక్యముల నుట్టంకించి యంతతోఁ దనివోక సభాపర్వమున మంత్రి లక్షణముల వివరించుచు

"అనఘుల శాస్త్రవిధిజ్ఞుల
ననురక్తులఁ బితృపితామహ క్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులుగా
నొనరించితె కార్యసంప్రయోగము పొంటన్"

—అను పద్యమును వ్రాసి యుండుటను బట్టి మంత్రులకుఁ బ్రధాన లక్షణము రాజునం దనురక్తుండై యుండుటయు, వంశానుక్రమముగ బ్రాహ్మణుఁడై యుండుటయు,—నై యున్నదని యవగత మగుచున్నది.

కావుననే లోకజ్ఞుఁడగు నన్నియ తనకును, రాజునకును గల సంబంధమును మనసులోఁ బదిలపఱచి కొనియె. భారతమునఁ దన కులబ్రాహ్మణు ననురక్తు నను లక్షణముల రెంటిని జెప్పి తాను రాజరాజు నొద్ద మంత్రులలో నొకరుఁడ నని సూచించి యున్నాఁడు. ఇ పద్యముం బరికింపఁగాఁ బురోహిత లక్షణముల కంటె మంత్రి లక్షణములనే హృత్పద్మమున నిక్షిప్త మొనర్చికొని నన్నియ భట్టారక మహోపాధ్యాయుఁడు వ్రాసి యుండె ననుట యందావంతయు సందియము లేదు.

ఇంతియ కాక పిల్లలమఱ్ఱి పినవీరన తన 'శకుంతలా పరిణయము'న

"కవులం బంకజగర్భసన్నిభుల వ
క్త్రాణింతు వల్మీక సం
భవుఁ వ్యాసునిఁ గాళిదాసుఁ బిలహ
ణ్బాణు న్మయూరు న్మకు

నృవభూతిఁ శివభద్ర మల్హాణుని ఘుం
టా మాఘునిం జోరు భా
రవి మా నన్నియభట్టుఁ దిక్కకవి సె
జ్జా ప్రెగ్గడఁ సోమునిన్."

——అనియు, అక్కనపల్లి నృసింహ కవి తన "ఆదిలక్ష్మీ విలాసము" లో

"ఎన్నిక భారతంబు ముద
మేర్పడ నేర్పున నంధ్రభాష సం
పన్నతచే రచించి మహి
వాగనుశాసన సోమయాజి కా
భ్యున్నతిఁ గాంచి లోకముల
భూరి యశోధను లైన యట్టి మా
నన్నియభట్టు తిక్క కవి
నాథుల సాధుమతి నుతించెదన్."

——అనియుఁ——వినుతించి యుండిరి. నన్నియ తమ బంధువగుట చేతనే, తమ శాఖీయుఁ డగుట చేతనే,——పిన వీరన్నయు లక్ష్మీనృసింహ కవియు నట్లు వినుతించిరి. కాని లేకున్న నట్లు వ్రాయఁ జాలుదురా ? వ్రాయ సాహసింతురా?

నన్నియ తమ్ముఁడు బేతనభట్టు క్రీ. శ. ౧౦౮౨ వఱకు జీవించినాఁడు. రాజరాజు రాజ్యారంభ కాలము శా. శ. ౯౪౨ 'నందమపూఁడి' శాసన కాలము రాజరాజు రాజ్యవర్షములు ౩౨-వ సంవత్సరము. దీనిని బట్టి "నందమపూఁడి"

శాసనకాలము శా. శ. ౯౨౮ (క్రీ. శ. ౧౦౭౨) అగును, చేతన భట్టు గతించిన తర్వాత ననఁగాఁ క్రీస్తుశకము ౧౦౮౨–౯౨ నడుమ శాసన రచనాధికారము నన్నియును సంక్రమించి యుండు నని తోఁచెడిని.

సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు నను నన్వర్థ నామము గల విజయాదిత్యుఁడు శా. శ. ౯౭౩ మొదలు స్వతంత్రముగను, శా. శ. ౯౯౧ మొదలు కుళోత్తుంగుని పక్షమునఁ బ్రతినిధి గను,—వేఁగి దేశమును బరిపాలించి శా. శ. ౯౯౭ లోఁ గాలధర్మ మందెను. 'కాలేరు' శాసనమున

"మయా వేంగీ మహారాజ్యం
చోడరాజ్యాభిలాషిణా,
మ త్పితృవ్యే పురాన్యస్తం
విజయాదిత్య భూ భుజి,
సచ పంచ శతాబ్దాని
పంచానన పరాక్రమః,
మహీం రక్ష న్మహీ నాథో
దివం దేవోపమో గతః."

—అని కుళోత్తుంగుఁడు సెప్పినట్టు లుండుటను బట్టి శా. శ. ౯౭౨ లోనో ౯౭౩ లోనో రాజరాజు సనిపోయి యుండు ననియుఁ, దాను చోడ రాజ్యాభిలాషి యై వేంగీ రాజ్యమును దన పినతండ్రి యైన విజయాదిత్యు పైనిఁ దానే యునిచితి ననియుఁ, బదునై దేఁడులు విజయాదిత్యుఁడు వేంగీ రాజ్యమును

సంరక్షించి గతాసు వయ్యో ననియుఁ — కులోత్తుంగుఁడే సెప్పి యున్నట్లు లవగత మగు చున్నది గదా!

కాఁబట్టి యి విజయాదిత్యు నొద్ద సంధివిగ్రహిగా శాసన రచనాధికారిగా వ్యవహరించి కులక్రమాగత మైన మంత్రిత్వమును బ్రతిష్ఠాపన మొనర్చి యా మూలమున వంశ మర్యాదను, దన బుద్ధి విశేషమును, నిలువంబెట్టి యజరామర మగు కీర్తి నద్దెసలఁ బర్వించిన భీమనప్రెగ్గడను నమోవాకముల నర్పించు చున్నాఁడను.



•

## అచ్యుతదేవరాయల మంత్రి

# సంపెట నరసయ్యంగారి తిమ్మరుసు మంత్రి

(క్రీ. శ. ౧౬వ శతాబ్దము)

---

ఇతఁడు క్రీ. శ. ౧౬వ శతాబ్దమునందలి యచ్యుత దేవరాయల మంత్రిశేఖరుఁడు. మూఁడవ విజయనగర రాజావళి యందు వంశక్రమాగతమైన మంత్రి పదవుల నంది యివ్వంశజులు తేజరిల్లు చుండిరి. ఈ మంత్రిశేఖరుని పితామహుఁడు పట్టమరుసను నతఁడు

> "కాశ్యప గోత్ర దుగ్ధ పయోధి చంద్రుఁడై
> భాగ్య లక్షణములఁ బ్రభవ మంది
> రాయబార పరంపరా క్రమాగతమైన
> నిత మంత్రికులకు నర్థి సేయు
> సకల దిగ్దేశ రాజ ప్రధానుల కెల్ల
> నాధార మయ్యె సింహాసనమునఁ
> దనకు, నేలిన మహీధవునకు, సత్కీర్తిఁ
> దనర సామ్రాజ్య తంత్రంబు నడపె
> నుభయ కుల పావనుండును నిజకులోచి
> త క్రియాచార నిరతుఁడు దార గుణుఁడు
> విప్ర బాంధవ వాంఛితార్థ ప్రదుండు
> విత్తలేశ్వర నిభమూర్తి పట్టమరుసు."

—అని యజరామర మగు కీర్తి ప్రతిష్ఠలఁ గాంచెను.

దీనిం బట్టి 'పట్టమరుసు' తన ప్రభువునకు సత్కీర్తి ఘటిల్లు నట్టు రాజ్యభారము నహించి పరిపాలనా చకమవలీలఁ ద్రిప్పి యుభయ కుల పావనుం డగు నిజ కులోచిత క్రియాచార నిరతుండు నుదార గుణుండు విప్ర బాంధవ వాంఛితార్థ ప్రదుండు విఠ్ఠలేశ్వర నిభమూర్తియు నై సకల దిగ్దేశ రాజ ప్రధానుల కెల్ల నాధార మయ్యె నని తెలియ నగు చున్నది.

పట్టమరుసు కొమారుఁడు నంజయు. ఈ నంజయు మహీశూర రాజన్యుని మంత్రిగా విలసిల్లి లింగపురాణము, హాలాస్య మాహాత్మ్యము లోనగు గ్రంథముల రచియించి దక్షిణాంధ్ర సాహిత్యమునకు మహత్తర మైన వెలుఁగొసంగి, తత్రాపి మహీశూర (Mysore State) రాజ్యమున కధిక తేజస్సునుఁ గూర్చి, విఖ్యాతిఁ జెందెను. ఈ నంజయ మంత్రి కొమారుఁడే తిమ్మ సచివాగ్రణి గదా!

ఇతఁడు (తిమ్మయ) రామ మంత్రోపాస్తి నొనర్చి, తత్సిద్ధి నంది, వేదశాస్త్రములలోఁ గూలంకష మైన ప్రజ్ఞ గడించి, సకల దేశ భాషాసులు నెఱిఁగి, స్వామిహిత మైన ప్రయోజన మాచరించి, నద్రైసలఁ బ్రసిద్ధి వడసి, బ్రహ్మ విద్యా పారంగతుం డయి లలిత కళోద్ధారకుం డయి, తద్దక్షుకుం డయి, లిపుల నన్నిఁటిని వ్రాయు నేర్పు సంపాదించి,—తేజ రిల్లెనని చింతలపూఁడి యెల్లన రచియించిన "తారకబ్రహ్మ రాజీయ" మను గ్రంథ మందలి

"తిరుపతి గెల్చి పాండ్య నర
దేవుని పట్టముఁ గట్టి, యుత్కళే

శ్యాయం గరుణించి క్రొక్కిన స
వాయికిం దా నభయంబొసంగి పెం
పరుదుగం గీర్తి చేకొనిన
యచ్యుతరాయల మంత్రి రత్నమై
తిరముగ నున్న నంజవిభు
తిమ్మ గుణుం దగం బ్రస్తుతింపఁగన్"

"వేద పురాణ శాస్త్రములు
విద్యల కెల్ల గురుండు బ్రహ్మ వి
ద్యా దృఢబుద్ధి నేర్పు లిపు
లన్నియు వ్రాయు సమస్త దేశభా
షాదు లెఱుంగు స్వామిహిత
మైన ప్రయోజన మాచరించు నా
నా దిశలం బ్రసిద్ధుం డగు
నంజయ తిమ్మనిం బోల రెవ్వరున్."

—అను పద్యము లవగత మొనర్చుచున్నవి. ఈ తిమ్మయ మంత్రి రాధామాధవకవి విరచిత మ్మగు "తారక బ్రహ్మరాజీయ" మను నీ గ్రంథమును గృతి నందికొనెను. ఇ క్కవి శిరోమణియు నిమ్మంత్రి శేఖరుండును జుట్టము లగుట చేతను గృతిపతిత్వమునకును గృతికర్తృత్వమునకును గూడ బాంధవ్య మేర్పడిన దని యర్థ మగుచున్నది.

ఇతం డాఱువేల నియోగి బ్రాహ్మణుడు. కాశ్యప గోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు. యజుర్వేది. గుంటూరు సీమ వాస్తవ్యుడు,

వెలనాటి మహా మండలేశ్వరుండగు

# రాజేంద్ర చోడని ప్రముఖ మంత్రి

# నందూరు కొమ్మన

(క్రీ. శ. ౧౨ వ శతాబ్దము)

తూర్పు చాళుక్యుల తర్వాత వేఁగి దేశమును వెలనాటి చోడులు స్వతంత్రులై శకవర్షము ౧౦౧౬ నుండి ౧౧౨౦ వఱకు శతాబ్దమునకుఁ బైఁబడిన కాలము పరిపాలన మొనర్చి నట్టు లనేక శాసనము లవగత మొనర్చు చున్నవి. వెలనాటి చోడుల శాసనముల యందన్నిఁటను 'పిఠాపుర' శాసనమే ముఖ్యమైనది. ఈ వెలనాటి చోడులు యుధిష్ఠిరుని భృత్యుఁడగు నింద్రసేనుఁడు మొదలుకొని ప్రభంశమై శూద్రులుగ నెన్నఁబడు చుండిరి. ఇంద్రసేనుఁడును ఆతని వంశ్యులును మధ్య దేశమునందలి 'కీర్తి పురము' నివాసముగాఁ జేసికొని నట్టు లగపడి యెడిని.

మల్లవర్మ తెగ యందైదవ వాఁడగు మొదటి మల్ల నృపాలుఁడు 'పల్నాస్రి దేశము' పయి న్దండెత్తి యా విషయమును జఱనివాసముగా నేర్పఱచికొని 'ధనదుపురము'ను రాజధానిగాఁ జేసికొనియెను. శాసనములఁ బట్టి మల్లవర్మ తెగ యందితఁడగ్రేసరుఁడని విదితము కాఁగలదు. ఇ మల్ల

నృపతి త్రినేత్ర పల్లవుని సాహాయ్యమున దేశము యొక్క హక్కు స్వత్వములం బడసెను. తూర్పు చాళుక్యుల ననుకరించు చున్న యి వంశ్యులలో నితండు కడపటి వాండై యుండ నోపు నని డాక్టరు హుల్ట్జుదొర చెప్పు చున్నాండు. శాసనములు దక్షిణాపథమును దండెత్తి నపుడు త్రినేత్ర పల్లవునితో మల్లవర్మ పోరాడె నని వాకొను చున్నవి. కాని పల్లవుం డొకండు వెలనాండున కధీశుండగు రెండవ [illegible]పునకుం గార్యకర్తగ Minister నుండెనని (H Krishna Sastry Report, P 109) తెలుపు చున్నది. ఇది యసాధ్యకార్యము గాదు. గాన నితని పూర్వులు క్రీ. శ. ౯ దవ శతాబ్దమున వెలనాండును స్వతంత్రించి పరిపాలించు చుండి నట్లగపడు చున్నది. ఇతని యభిమానాదరముల వలన మల్ల భూరమణుండు వెలనాండు లోని కొన్ని గ్రామముల నేనిం బడసి యుండును. మఱియొక తెగ వారు త్రిలోచన పల్లవు నాదరాభిమానములం బురస్కరించుకొని యీ యువేల నాండు పై నధికారము నెఱపి రని (..py Indica, P. 14[illegible]) యందుం జెప్పంబడి యున్నది. ఈ రెండు తెగల వారును వెలనాంటి పల్లవుల యభిమానమును జూఱంగొనుటలో అర్థించుటలో వెనుదివియ లేదు.

ఇంతకుం బూర్వమే 'షట్సహస్ర జగతి' పయి మల్ల భూపాలుని దండయాత్రయు, నతని 'ధనదుపుర' మందలి యధినివేశనమును, — కేయూర బాహు చరిత్ర నిరూపించుచున్నది.

వెలనాటి మహామండలేశ్వరుండగు గొంక మహీపతి క్రీ శ. ౧౧౩౨ వ సంవత్సరము నుండి క్రీ శ. ౧౧౬౧-౬౨ వ సంవత్సరము దాఁక మహా వైభవముతో 'సనదుప్రోలు' రాజధానిగా నేలిన వాఁడు వెలనాఁడు దుర్జయులకుఁ గాణాచి యగుటచే దుర్జయ వంశ్యులు వెలనాటి మహామండలేశ్వరు లని పేర్కొనసిరి. రమారమి ౧౨౬ సంవత్సరము లీ వెలనాటి మహామండలేశ్వరు లేలిరి. 'చందవోలి'కి 'ధనదపుర'మనియు, 'ధనదప్రోలు' లనియుఁ, బర్యాయఁ, పదములు. ఇ ప్పురము క్రీ. శ. ౧౨ వ శతాబ్దమునఁ బ్రాగాంధ్ర దేశమునకు ముఖ్య పట్టనముగా నుండి మహత్తర వైభవము గన్నది. కావుననే యి ప్పురము

"పుష్పక నివహంబు భూమిపై నిలచిన
యట్లందమైన దేవాలయములు
రూప్యాచలము బహు రూపంబుల నటించు
రమణ శోభిల్లు సౌధములు పెల్లు
అలకాధిపతి నిధు లన్నియు వెలివీఁట
విడిసిన క్రియఁ బణ్యవీథికలును
ధాత మేదిని మిన్నుఁ దఱిఁగి వైచిన మాడ్కిఁ
గనుపట్టు బహు తటాకముల సొంపు
నుప వనంబులు సరసులు నొప్పఁ జేయుఁ
జెఱకుఁదోఁటలుఁ బ్రాసంగు చేలు మెఱయు
నఖిల విభవములకు నెల వగుచు వెలయు
ధనదపురమున కెనయగు ధనదపురము."

—అని ప్రశంసింపఁ బడియెను. వెలనాఁటి దుర్జయా స్థానమునఁ గార్యనిష్ఠ ప్రతిష్ఠుఁడై, యనుపమాన తేజోవిరాజితుఁడై ప్రసిద్ధిఁ గాంచిన వాఁడు కొమ్మన మంత్రి. గొంక ధరణీధవుఁడు తన పరిపాలనాంతమునఁ గడపిన దినములలోఁ బాకనాఁటి పయి దండయాత్ర సలిపినట్లు బాపట్ల భావనారాయణ స్వామి యాలయమున శకాబ్దము ౧౦౮౨ (క్రీ. శ. ౧౧౬౦ - ౬౧) నాఁటి దొక శిలాశాసనమున

"రమణీయ ధనదు పురవర
మమరఁగ నిజ రాజధాని మై యుండఁ గనక
రము వెల్నాఁడును లోఁపుఁ
గ్రమ మొనరఁగ నేలె బాహుగర్వము వెలయన్."

—అని (S. I. I. Vol. 6; AS. 164) చెప్పఁబడుట వలన గొంకరాజు 'ధనదుపురము' (Chandolu) రాజధానిగా ముఖలింగ - సింహాపురములకు నడుమ నున్న తీరదేశ మంతను బరి పాలించె నని యవగతము కాఁగలదు. ఇవ్విషయమునే శివలెంక మంచన కవి

"అరుదంద స్వెలనాఁటి చోడ మనుజేం
ద్రాజ్ఞాపనం బూని దు
స్తరశక్తిం జని యేకవింశతి సహ
స్రగ్రామ సంఖ్యాక మై
ధరణి న్పెర్చిన 'పాఁకనాఁడు' నిజదో
ర్దండైక లగ్నంబుఁగా

ధరఁ బాలించె నమాత్య కొమ్మన జగ
త్ప్రఖ్యాత చారిత్రుఁడై."

—అని చెప్పినాడు. ఇవ్విధముగా వెలనాటి మహామండలేశ్వరుఁడు నెల్లూరు వఱకుం గల దేశము నేలె ననియు, నతని కొమారుఁడగు రాజేంద్ర చోడని యాజ్ఞ శిరముపైం దాల్చి కొమ్మన మంత్రి పాకనాఁ డేకవింశతి సహస్ర గ్రామముల గెలుపొందె ననియు,—శక ౧౦౮౨ నాఁటి బాపట్ల భావనారాయణస్వామి యాలయ మందలి శాసనము విదిత మొనర్చు చున్నది.

కుళోత్తుంగ రాజేంద్ర చోడని పరిపాలనా కాలమునఁ గూడ వేంగి పయిం గళ్యాణి, కటక సామంతరాజులు దండెత్తి వచ్చిరి. కాని 'సనదుప్రోలు' 'కటక' సామంత దండనాథుల సాహాయ్యముతో నుత్సాహ ప్రోత్సాహములతో సైన్య నివహంబులఁ గొనిపోయి కొమ్మన మన్నేఱు, క్రొత్తచెఱల, పరిసరముల శాత్రవ యూథంబుల నెదుర్కొని తీవ్రముగఁ బోరాడి తన యేలికకు విజయలక్ష్మినిఁ జేకూఱిచె ననిని "కేయూరబాహు చరిత్రము" న

"చలము మెయిఁ గటక సామం
తులు కరి హయ బహుళ సేనతో నేతేర
న్దలపడియెఁ గొమ్మ సచివుఁడు
బలియుండై క్రొత్తచర్ల పరిసర భూమిన్.

"సెలకట్టె వాటునఁ జెలఁగి రెంటిని మాటఁ
గూడ గుఱ్ఱంబులఁ గుదులుగ్రుచ్చఁ

ప్రతిమొగంబగు నరనరాల కస్త్రశస్త్రమునఁ
గడిమి మై పింపులు నేలఁబోనునఁ
బందంపు గొఱియల పగిది సేనంగల
ధార శుద్ధి నసి ధారఁ దునుముచుఁ
జదియించుచుఁ బిగిలించుఁ జేయుచుఁ దీటుచో
వడిఁ గాండఁ జేసి మానవుల తలలు
తలపుడికి వ్రేసి మానంతు తలలు కొసరి
రాజశిరములు దొర్లించు రాఁగఁ దిరుగ
వాఁగె నుబ్బెడు తన వారువంబు చేత
మహిత శౌర్యుండు కొమ్మనామాత్య వరుఁడు"

—అను పద్యము లవగాహ మొనర్పు చున్నవి. క్రొత్త చెర్ల యుద్ధమునఁ గొమ్మన ప్రెగ్గడ సూపిన ప్రతాపము, యుక్తి సామర్థ్యము ననుపమానములు. యుద్ధవృత్తి వలన బ్రతుకు వారు శస్త్రవిద్యా గర్వితులై సేయు యుద్ధమును, 'విద్యాంక' మగువాడు నని" యభిలషితార్థ చింతామణి" యందు సర్వజ్ఞ సోమేశ్వరుఁడు నాటివాఁడు. కొమ్మన ప్రెగ్గడ విద్యాంకమునకు లక్ష్యభూతుఁడు.

పాకనాటికిఁ బచ్చిమోత్తరము (North West) నుండెడి కడి దుర్గమే క్రొత్తచెర్ల. వెలనాటి మహామండలేశ్వరులకును గర్ణాటకులకును—క్రొత్తచెర్ల యొద్దనే యుద్ధము దటస్థించి యీ యుద్ధమున వెలనాటి చోడని పక్షమునఁ బాకనాటినిఁ బరిపాలించు చుండిన కొమ్మన పాల్గొనుట యను విషయము హృదయమునఁ బదిలపఱచికొనఁ దగి యున్నది. దుర్జ

యుల 'సపదా|పోలు' రాజ్యము కళింగము నుండి పాకనాడు వఱకును వ్యాపించి కళింగ - పాకనాడులు గూడఁ గానుకలఁ జెల్లించినవి. ఇందుఁ బశ్చిమ చాలుక్య సేనాసివహంబులు చాలవఱకు విఱిగి వీరశయన మందఁగా హతశేషములు కకా వికలై పలాయన మంత్రమును జపించినవి.

క్రీ. శ. ౧౧ వ శతాబ్దమునకుఁ బూర్వము తెలుఁగు దేశములోని దేశవిభాగమునకు 'విషయ' మనియు, 'నాఁ' డనియు, రాష్ట్ర మనియు, సమానార్థకములుగా నుండుచుఁ, గ్రీస్తు శకము ౧౪-౧౫ శతాబ్దముల నుండి 'రాష్ట్ర' మనునది 'నాడు- విషయము'ల కంటె నధిక వైశాల్యము గల ప్రదేశ మునకుఁ బ్రయుక్త మగుచు వచ్చినది "తుంగభద్రా తరంగిణ్యాః ప్రాగ్దేశం వెలనాడితి"— అనఁగఁ దుంగభద్రా నదికిఁ బ్రాగ్భాగమున నున్న దేశము 'వెలనాఁ' డని యర్థము దీనినే యాఱువేల దేశ మనియెదరు. ప్రాచీన సంప్రదాయము ననుసరించి దేశవిభాగము లయిన విషయములను, నాఁడులను, నేవో కొంత సంఖ్యను జేర్చి చెప్పుచుండుట గమనార్హము.

నాలవ విష్ణువర్ధనుని కాలమునఁ బండ్రెండువేల గ్రామములు గలదిగా 'వేఁగి'నాఁడు తేజరిల్లి నట్లు "విష్ణువర్ధన పంచ త్రింశ త్క్షోణి ద్వాదశ సహస్ర ప్రమాణ వేఁగీమండల మన్వపాలయేత్" —అను వాక్యము దెలుపుచున్నది. శుక్రనీతి యందు "భవే త్క్రోశాత్మకో గ్రామో రూప్యకర్ష సహస్రకః" —అని గ్రామము నిర్వచింపఁబడి యున్నది ఇది ప్రమాణీకరింప రా దనియు, వేంగి మండలము పండ్రెండు వేల చదరపు

గ్రామములు గల వనియు, మంచన కవి పాకనాడు ౨౧ వేయి గ్రామములు గలదని యభివర్ణించినను 'గ్రామ' మను పది వైశాల్యము క్రిందఁ బరిగణింప వలసినదే యనిగను,—(J. A. H. R. S Vol. V: PP 07—0)

ఒకప్పుడు వెలనాఁడు ఆఱువేల దేశముగా నొప్పె నని (Ep. Coll No. 67i of 1-0) యు, నానల నాఱువేల మూఁడు వందల దేశముగా నొప్పె ననియు, (Ep. Coll No. 274 of 1893) —వట్టే వేంగిదేశము నాలవ విష్ణువర్ధనుని కాలమునఁ బండ్రెండువేల దేశముగా రూపొంది యావలఁ బ్రథమ కుళోత్తుంగ చక్రవర్తి నాఁటికిఁ బదునాఱువేల దేశముగా విలసిల్లె నని పిఠాపుర శాసన మువగలి మెునర్చు చున్నది. (Ep. Indica. Vol. IV. p 32 ff V. 35)

రెండవ గొంక ధరారమణుని శ్రీకాకొల (Srika-kulam Inscription) ము శాసనములో నతఁడు "వేంగీ విషయ షోడశ సహస్రావనీ వల్లభ" యని కీర్తింపఁబడి యుండెను. (S. I. I; Vol Iv No. 674) కళ్యాణి ప్రభువగు పశ్చిమ చాళుక్యుఁడు త్రిభువన మల్లభూపతి కాలములో 'వేంగి' విషయము పదునాల్గు వేల దేశ మని (Ep. Coll. No. 3.9 of 1-22.) తెలుపు చున్నది. శక ౧౧౫౯ నాఁటి మొనమల కుదురు ('వేంగి' ప్రధాని యగు నయ్యప్ప) శాసనము. ఆతని ముత్తాత గొంకప్రభువు "వేంగీ సహస్ర ద్మాధీశః" అని వర్ణింపఁ బడినాఁడు.

తూర్పుచాళుక్య రాజగు రెండవ యమ్మిరాజు కాలమున 'తాండేరు' (Tanderu) గ్రామమును దానము సేయు సందర్భమున రాష్ట్రకూట ప్రముఖుల నుద్దేశించి చెప్పుచు "వేంగీ సహస్ర రాష్ట్రకూట ప్రముఖాన్"— అని యనుటను జూడఁగాఁ, బదియవ శతాబ్దము వచ్చు నప్పటికి 'వేంగి' సహస్ర దేశముగాఁ బరిణమించె నని విదిత మగు చున్నది.

ఇ య్యాధారముల రెండిఁటి ననుసరించి ప్రథమ కులోత్తుంగుని నాఁటికి 'వేంగిపుర విషయ గ్రామసహస్ర మన్యవిద్ధమాధిపత్య' మ్మను నట్లు రెండవ రాజరాజు తన కూరిమి మిత్త్రుండును ముఖ్యోద్యోగియు నగు మమ్మడి భీమునకుఁ బన్డ్రెండు గ్రామములను బహూకరించె నని (వేయి గ్రామములలోఁ జేరినవియె యీ పన్డ్రెండు గ్రామములు) - తెలియుచున్నది. (Ep. Report; of 1922 P. 98 Para .) ఇదిగాక కాల నిర్ణయము లేని ద్రాక్షారమ శాసనము కులోత్తుంగుని నుండి వేయి గ్రామములు గల 'వేంగి' ని కోన పోతఁ డనువాఁడు సంపాదించె నని (S. I. I. Vol. IV. No. 115 ) తెలుపు చున్నది.

మూఁడవ గాంగ విజయాదిత్యుని 'సాతలూరు' తామ్ర శాసనము 'వేంగి' పన్డ్రెండు వేల దేశ మని మొదటిసారి పేర్కొనినది. (J. A. H. R. S., Vol V. P. 112)

(Ep. Col. No. 466 of 1906) రేనాఁ డేఁడువేల దేశమని పేర్కొని అవల 70 దేశముగా నయ్యె ననియు (Ep. Coll. No 350 of 1905) ములికినాఁడు 300 దేశముగా నుండి (Ep. Coll. No 395 of 1904) అవల నాల్గువేల దేశ

ముగా నన్యో ననియుఁ (Telugu Academy, Vol X. P. ([illegible]) దెలుపు చున్నది.

కొండపడమటి దేశము 13 గ్రామములు గల దని (Ep. Indica Vol VI P. [illegible] ff) యవగత మగు చున్నది. 'వడుగవళిమెర్కు' దేశమును "ఆంధ్రా త్వాలః సప్తగ్రామ క్షితిః" అందురు. దీనినే సంస్కృతీకరించి 'యాంధ్రపథ' మని యొద రని (Ep. Ind Vo II. P [illegible] [illegible]. I.) తెలియవచ్చు చున్నది 'వడుగవళి' దేశము పండ్రెండువేల దేశ మని (S. I. I Vol. III. Pt. I. P [illegible]) విదితము సేయు చున్నది. వేయి పెండికర్షము లాదాయము రాఁగల భూభాగమునకు గ్రామ మని శుక్రనీతి వాకొనుచున్నది.

గుండ్లకమ్మకు దక్షిణమున వెలిగొండలు మొదలు సముద్రతీరము వఱకును గల దేశమునకుఁ బూర్వము 'పాకనాఁ' డని యనుచుండిరి. కొంచె మించుమించుఁగ నిప్పటి నెల్లూరు మండలమును, ఒంగోలు తాలూకాయును, కడప మండలములోని ప్రాగ్భాగమును, గలసిన నప్పటి ప్రాఙ్నాఁటికి సరిపోవును.

వెలనాఁటి గోంక మహీధవుఁడు ఆంధ్రదేశాంతర్గత మైన చోళసామ్రాజ్యమున కంతకును దానే యేలిక నని తలఁచి పాకనాఁటిని సైతము ఆక్రమింపఁ దలపెట్టెను. కాని నెల్లూరు తెలుఁగు చోడులు లక్ష్యముసేయక ఈతనిఁ బ్రతిఘటింపఁ జాఁగిరి. బాపట్ల భావనారాయణస్వామి యాలయములో శకాబ్దము ౧౦౮౨ నకు సరియైన క్రీ. శ. ౧౧౬౦-౬౧ నాఁటి యొక శిలా శాసనమున నీ విషయము వ్యక్తీకరింప బడినది.

వెలనాటి దుర్జయులలోఁ గడపటి వాఁడగు పృథ్వీశ్వరుఁడు మూఁడవ గొంక నృపాలుని యనంతరము క్రీ. శ. ౧౧౬౩ లో ధనదపురమ్మున సింహాసన మెక్కినాఁడు. ఇతని యధికారము క్రీ. శ. ౧౧౮౦ దాఁకఁ జాఁగుచుండినట్లును, వెలనాటి మహామండలేశ్వరులను గళింగాదీశు లుగాఁ గావించె యప్పనముల నొసంగుచుండె నట్లును, అగపడుచున్నది. ఈ పృథ్వీశుని గడతేర్చిన వాఁడు తిక్క నృపాలుఁడు. ఇతఁడు రాజేంద్రచోడుని పుత్త్రుఁడే. ఇతని మంత్రియె కేతన.

"... ... ... భూసుర శి
ఖామణి కేతన భూవరుండు పృ
థ్వీశ నరేంద్రు మంత్రి యయి
యెల్లెడఁ జాలఁ బొగడ్త కెక్కె యా
కాశ నదీ పరుచ్చ శివ
కాశ సుహాశన తారకేశ నీ
కాశత రాభిరోచి రవ
కాశ వికాస యశోవిలాసుఁడై"

—అను నిర్వచనోత్తర రామాయణ పద్యముం బట్టి కేతనామాత్యుఁ డఖండ సత్కీర్తిఁ గాంచె నని తెలియ నగుచున్నది. ఇతని తండ్రియె కొమ్మన. 'కేయూర బాహు చరిత్ర' యందలి

"ఆ కొమ్మన ప్రెగడ సుతుఁ
డై కేతన చోడ భూవరాత్మజుఁ డై ధై

ర్యాకరుఁ డగు పృథ్వీశ మ
హాకాంతుని మంత్రి యయ్యె నెంతయుఁ బేర్మిన్."

—అను పద్యము పృథ్వీశ నరేంద్రుని యాత్మమిత్త్రమే కేతని యని స్పష్టపఱచు చున్నది. కొమ్మన పెగ్గడ

"వాగ్దేవీ స్తన హార నిర్మల యశో
వాల్లభ్య సంసిద్ధి తో
దిగ్దంతి శ్రవణానిలో జ్జ్వల రట
త్తీవ్ర ప్రతాపాఢ్యుఁ డై."

"ఆ విభునకుఁ బ్రెగ్గడయై
భూవలయంబున యశోవిభూషణుఁ డయ్యె
న్గోవిం దన ప్రధానుం
డావాసము కౌశికాన్వయమ్మునఁ దనరెన్".

"విహితాస్థానము నందుఁ జూపుఁ దగ గో
విందాభిధాన ప్రభుం
డహితోర్వీధర వజ్రి గొంక విభు రా
జ్యాధిష్ఠుఁడై సంధి వి
గ్రహ ముఖ్యోచిత కార్య సంఘటన తం
త్ర ప్రౌఢియు న్బాధ స
న్నహనోదగ్ర రిపుక్షితీశ బహు సై
న్య ధ్వంసనా టోపముఁన్,"

"ధీరుఁడు తా గోవిందన
కూరిమి నందనుఁడు వెలసెఁ గొమ్మన గొంక,

తుమ్మిరమణున కుదయించిన
వీరుఁడు రాజేంద్ర విభు ప్రెగ్గడయై."

"నవకోటి పరిమిత ద్రవిణ మే భూపతి
భండారమున నెప్డుఁ బాయకుండు
నేకోన శతదంతు లే రాజు ఘన శాల
నీలమేఘంబు లై లీలఁ గ్రాలు
బలవేగ రేఖ నల్వాదివేలు తురంగంబు
లే నరేంద్రుని పాగ నెపుడు నిలుచుఁ,
బ్రతివాసరంబు డెబ్బదియేను పుట్ల నే
యే విభు మందల నెపుడు గలుగు
నట్టి సమధిక విభుఁ డగు కులోత్తుంగ రా
జేంద్ర చోళ విభుని కిష్ట సచివ
తంత్ర ముఖ్యుఁ డగుచు మంత్రి గోవిందనం
దనుఁడు కొమ్మన ప్రధానుఁ డొప్పె,

"ఇల వెలఁనాటి చోడ మను
జేంద్రు నమాత్యత యానవాలుగాఁ
గుల తిలకంబుఁగా మనిన
కొమ్మన ప్రెగ్గడ కీర్తి మాటల
న్దెలుపఁగ నేల తత్క్రియఁ బ్ర
తిష్ఠిత మైన తటాక దేవతా
నిలయ మహాగ్రహారములు
నేఁడును నిల్చెడుఁ దామ చెప్పఁగన్."

—అని ప్రశంసింపఁ బడినాఁడు కాంబ్రూరి కొమ్మన దండనాథాగ్రణి తండ్రి యగు గోవిందప్రెగ్గడ వెలనాటి గొంక మహీపతి యొద్ద మంత్రిగను కొమ్మన దండనాథాగ్రణి కొడుకు కేతన తిక్కనృపాలున కాప్త సచివుఁడుగను, కేతన కొడుకు భీమన రణవీరుఁడు రణరంగఁడు నను బిరుదముల విఖ్యాతిఁ జెందె రనియును, ముమ్మనుమఁడు గుండన మన్మసిద్ధి యొద్దఁ గార్యాచార్యుఁ డనియు,—నెఱుంగ నగు చున్నది మంచన కవి విరచిత మగు 'కేయూరబాహు చరిత్ర' కృతిపతియె గుండన.

మూఁడవ గొంక నృపాలుని యనంతరము క్రీ. శ. ౧౧౮౬వ సంవత్సరమున ధనదుప్రోలు (Chandolu) సింహాసన మెక్కిన యతఁడు వెలనాటి పృథ్వీశ్వరుఁడు. వెలనాటి దుర్జయులలోఁ గడపటి వాఁడు. ఇతని యధికారము కళింగ దేశ మందలి "శ్రీకూర్మము" వఱకు జాఁగుచుండి నట్టును, వెలనాటి మహామండలేశ్వరులకుఁ గళింగాధీశు లరిగాపులై యప్పనములు నిచ్చు చుండినట్టును,—అగపడుచున్నది. ఈ పృథ్వీశ్వరునిఁ జంపిన యతఁడు తిక్క నృపాలుఁడు. రాజేంద్రచోడుని పుత్త్రుఁడే యీ తిక్కరాజు. ఇతని మంత్రియె కేతన. కేతన ముమ్మనుమఁడే గుండన గదా?

ఏఁటేఁటఁ గాకుళేశ్వరుని తిరునాళ్ళు జరగు చున్న యట్టును, అచ్చటికిఁ జనుదెంచు తైర్థికకోటికి గుండనమంత్రి విశుద్ధహృదయముతో నొసంగు రత్నములు, చూడలు, లోనగునవి సువర్ణ వృష్టిపోలె నున్నయట్టును, చాతకముల రీతి నర్థులు వేచి యున్న యట్టును—మంచన కవి

"నలువుఁగఁ గాకు తేఁకు తెకు
నాళుల లోపల గుండమంత్రిని
ర్మలమతిఁ బెట్ట వేఁగమెయి
మాడలు రత్నచయంబుఁ జల్లఁగా
నలవడు హేమవృష్టి క్రియ
నర్థులు చాతక కోటి గాఁగ లోఁ
గలగల రాలు ముత్యములు
గానఁబడు న్వడగండ్ల కైవడిన్"

—అను పద్యమున న మ్మహామాత్యుని యథార్థస్వరూప స్వభావము లభివర్ణించి వెలి కుద్గమింపఁ జేసి పుణ్యము గట్టికొని యెను. మంచనకవి యూ పనియె చేయ కుండిన ని మ్మహాత్ముని రూపురేఖలఁ దీర్చి దిద్దుట కను వయ్యెడిది గాదు గదా!

అనూచానముగఁ గొమ్మన దండనాథాగ్రణి తండ్రి యగు గోవిందన ప్రెగడ నుండి గుండనామాత్యుని వఱకు నెల్ల అను గార్యఖడ్గముల యం దనుపమాన ప్రజ్ఞా ప్రాభవ కీర్తులు సంపాదించి యవక్ర విక్రమోదార ప్రభావులై 'ఇదం బ్రాహ్మ్య మిదఁ క్షాత్త్ర' మ్మను సూక్తికి లక్ష్యభూతులై యజ రామర మగు కీర్తి నార్జించి మించిరి. ఇ త్తేజోనిధులు కౌశిక గోత్ర కలి తాపస్తంబ సూత్రులు. ఆర్వేల నియోగిబ్రాహ్మణులు. బాపట్ల తాలూకా యందలి నందూరు వాస్తవ్యులు. గుంటూరు, కృష్ణా, గోదావరీ మండలములలోని నందూరు వా రందఱును దొల్త నీ 'నందూరు' గ్రామము వారే యని తెలియఁదగును.

---

"కోనసీమ" తెలుఁగు చోడ చక్రవర్తి

ప్రధానామాత్యుఁ డగు

# రాయూరి యెల్లన మంత్రి

(క్రీ. శ. ౧౨ వ శతాబ్దము)

ఇమ్మంత్రి చూడామణి 'కమ్మనాఁటి' యందలి 'రాయూరు' వాస్తవ్యుఁ డనియు, నయ్యూరు శ్రీ కాంతా నిలయంబు శిష్ట జనతా సేవ్యంబు శాలీవనానీక ప్రాంత జలాశయోద్గత లస న్నీరేజ శోభాన్వితంబు ఆకీర్ణ ద్విజనందనంబు నై రమణీయ స్థానం బయి 'కమ్మ'లో నాకాధీశ పురంబు కంటె మేలౌనొప్పి యుండె ననియుఁ,— క్రీస్తు శకము ౧౧౫౮ దవ నాఁటి యమరావతీ శాసన మందలి

"శ్రీ కాంతా నిలయంబు శిష్టజనతా
సేవ్యంబు శాలీవనా
నీక ప్రాంత జలాశయోద్గత లస
న్నీరేజ శోభాన్వితం
బాకీర్ణ ద్విజనందనంబు రమణీ
య స్థానమై 'కమ్మ' లో
నాకాధీశ పురంబు కంటె నది మే
లౌ నొప్పు 'రాయూ' రిలన్.

—అను పద్యముం బట్టి తెలియు చున్నది.

ఇతఁ డప్రతిమ ప్రతిభావంతుం డగుటచేఁ గాఁబోలు పదుమూఁడేఁడుల వయసు నందె యమాత్య పదవిం బ్రాపించి సత్కవి బంధు మిత్త్రి జన సంపత్కారియై, సాధు సమ్మద శుద్ధ ప్రతిభా ప్రపంచిత లసన్మార్గ స్థితిని సంతతా భ్యుదయుం డయి, జగత్పూర్ణాచ్ఛ కీర్తిచ్ఛవిని విలసిల్లె, నని

"పదుమూఁ డేఁడుల నాఁ డమాత్య పదవిం
బ్రాపించి త త్సంపదా
స్పదుఁడై సత్కవి బంధు మిత్త్రి జన సం
పత్కారి యై సాధు స
మ్మద శుద్ధ ప్రతిభా ప్రపంచిత లస
న్మార్గ స్థితి న్సంతతా
భ్యుదయుం డై విలసిల్లె నెల్లఁడు జగ
త్పూర్ణాచ్ఛ కీర్తి చ్ఛవిన్."

—అను నమరావతీ శాసనస్థ పద్యము విద్యోతించు చున్నది. ఇంతియకాక యి మ్మంత్రి శిరోమణి పాలిత ధర్మ మార్గుఁ డనియు, ననుపాలిత సత్యవిలాసుం డనియు, నున్మీలిత సర్వశాస్త్ర మతి యనియు, మిత్త్రి జనాంబుజ మిత్త్రిమూర్తి యనియు, దగ్గాలిత కీర్తి నిశ్చలిత లక్ష్మీ సమన్వితుం డనియు,— నేత చ్ఛాసన మందలి

"పాలిత ధర్మమార్గుఁ డను
పాలిత సత్యవిలాసుఁ డు
త్క్షాళిత పాపకల్మష ని
కాయు విశుద్ధ పవిత్ర గోత్రుఁ డు

ష్మేలిత సర్వశాస్త్రగతి
మిత్త్రి జనాంబుజ మిత్త్రమూర్త్తి ది
గ్లాలిత కీర్త్తి నిశ్చలిత
లక్ష్మి సమన్వితుఁ డెల్లఁ బురిస్ఫగన్."

—అను పద్యము స్పష్టపఱచు చున్నది. ఇ ప్పద్యము లన్నియు రసభావ సమన్వితములు. "రాయుగారు" పురవర్ణనము ప్రబంధపుర వర్ణనముల కంటె మిన్నగా నుండి యతిశయ మొప్పుచున్నది.

తెలుఁగు చోడులకుఁ గొణిదెన రాజధానిగా నుండెను. తెలుఁగు చోళు లనేక దేవాలయములఁ గట్టించి, పెక్కుర కవుల నాదరించి, యనుశ్రుతము చిరంతనము నగు భాషాభిమానము ప్రేరేప,— వా రందఱు పద్య శాసనములనే వ్రాయించి చిర యశస్సు నార్జించిరి.

యెల్లన తండ్రియుఁ దాతయుఁ గొణిదెన చోళుల మంత్రి సత్తములై యెనలేని కీర్త్తి గడించిరి. అట్లని

"త్రిభువన గీతకీర్త్తి నర
దేవ శిఖామణి కామధారుణీ
ప్రభు తనయుండు మాండలిక
భర్గుఁడు భర్గపదాబ్జ షట్పదుం
డభినవరాముఁ డర్యమ కు
లాగ్రణి 'గుండియ పూండి' భక్తితోఁ
ద్రిభువన మల్లదేవుఁడు ప్ర
తీతిగ 'శంభున' కిచ్చెఁ బ్రీతితోన్."

"గడుసరి లోభి యర్థ మది
కన్నపుఁ గానికి బందికానికి
న్బుడమికి నన్యకాంతలకు
భూపతికిం జను మంత్రి యన్నని
న్బడసిన యర్థ మిష్టులకు
బంధు జనాలికి దీనకోటికి
న్గురులకు వారి సత్రముల
కుం జను శుద్ధ చరిత్ర ప్రాంత మై."

—అను నమరావతీ శాసన పద్యములు దెలుపు చున్నవి. నన్నిచోడని మంత్రి శంభుఁడు. అన్నమంత్రియుఁ దెలుఁగు చోడుల సచివుఁడే! పై మూఁడవ పద్య మందలి 'యన్ననిన్' అను నెడం గల ద్వితీయా విభక్తి ప్రత్యయము పంచమ్యర్థ సూచకముగ 'వలన' అను నర్థమునఁ బ్రయోగింపఁబడిన దని యెఱుంగఁ దగును.

ఈ శాసనముం బట్టి శంభుమంత్రి త్రిభువన మల్లదేవు నిచే 'గుండియ పూండి' యగ్రహారముం బడసె ననియు, నితని కొమారుఁ డగు నన్నమంత్రి తా గడించిన యర్థ మిష్టులకును, బంధు జనాలికిని, దీనకోటికిని, .. గురులకు, సత్త్రగువులకును,—శుద్ధచరిత్ర ప్రాంతమై చనుచుండె ననియు, నిట్టి పావన చరిత్రులకు జన్మించిన వాఁడే యగు మన యెల్లన మంత్రి భారద్వాజ గోత్రి కలి తాపస్తంబ సూత్రుం డయి కుల క్రమాగతం బగు ని య్యమాత్య పదవిం దన పదు మూఁడవ యేఁటం బొంది రాజకీయ, వాఙ్మయ, సారస్వత,

మతి విషయంబులఁ బ్రవృత్తిఁ గావించి, యంతంతోఁ దనివోక, సర్వశాస్త్రములఁ గూలంకషముగ నభ్యసించి, సత్యాసక్తి నై, ధర్మపాలితుం డయి విలసిల్లెననియుఁ,— దెలియం దగును.

క్రీ. శ. ౯ వ శతాబ్ది నుండియు శాసనముల లోని పద్య గద్యములలో నొప్పిద మగు కుదిరిక యేర్పడినది. కాఁగా, క్రీస్తు శకము ౧౧౪౦ వ సంవత్సరమునకుఁ బూర్వ ముండిన యాద్యకవిత నిరుపమాన ధారాశుద్ధితో వెలుఁగొందుచుఁ బక్వదశకు వచ్చిన దని తెలిసికోఁ దగి యున్నది. తెలుఁగు శాసనములలో విశిష్టము రసవత్తరము నగు నాంధ్ర కవితను వెలయించిన యా తేజోమూర్తులకు నమోవాకములు.

గోలుకొండ తానీషా

## ప్రధానమంత్రి

# పింగళి మాదన్న పంతులు

(క్రీ. శ. ౧౭ వ శతాబ్దము)

---

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రుఁడు. తండ్రి భానూజీ పంతులు. తల్లి భాగ్యమ్మ. చిన్ననాఁడే విద్యా సముపార్జన మొనర్చి గోల్కొండకు నుద్యోగము కొఱకుఁ బోయి 'మీర్ జుమ్లా' అను దర్బార్ ఉద్యోగియొద్ద మాసమునకుఁ బది 'గిల్డరు'ల వేతనము మీఁద గుమాస్తాగాఁ బ్రవేశించినాఁడు. మాదన్న ఉపాయశాలి. ఇతని సోదరుఁ డగు అక్కన్న కొంచెము తొందరపాటువాఁడు. కాని పండితుఁడు. వీరిద్ద ఱచ్చట గుమాస్తాలుగా నుండఁగనే వీరి తెలివి తేఁటలు తానీషా 'అజ' లోనికి వచ్చి యిద్దఱను దమ దర్బారులో 'వసాఉత్' ఉద్యోగులుగాఁ జేర్చికొని, తన యాంతరంగికుల నుగాఁ జేసికొనినాఁడు.

'తానీషా' అసలుపేరు 'అబుల్ హాసన్', ఇతఁడు కులీన వంశస్థుఁడే! ఇతని బాల్యముననే ఆస్తిపాస్తు లన్నియుఁ బోయి తండ్రియు గతించుట వలన దారిద్ర్య మనుభవింప వలసి వచ్చినది. కాని వైహిక సుఖాలమీఁద నాసక్తి యధికము కాఁగా, మోతూ పేటతో వేదాంత గోష్ఠి ఇతని కధికముగా

నుండెడిది. ఆకాలములో గోలకొండలో 'సయ్యద్ రాజ్ కొత్తాల్' అను పైగంబరు మహాతపస్వి యొకఁ డుండెను. ఆతని నాశ్రయించి యీ 'అబుల్ హాసన్' పదునాలుగేండ్లు యోగాభ్యాసముతోడను, భక్తియోగ పుంభావముతోడను, కాలము గడిపినాఁడు.

ఆ కాలములో గోల్కొండ రాజసింహాసన పరిస్థితులు వ్యస్తవ్యస్తముగా నుండెను. అప్పటి సులతాను (అబ్దుల్లా) కు మగ సంతానములేదు. మూవురు కొమార్తెలు మాత్రము గలరు. పెద్ద కొమార్తను 'సయ్యద్ అహమ్మద్' అను మక్కాకుఁ జెందిన గౌరవ కుటుంబీకున కిచ్చి పెండ్లిచేసెను. కాఁగా, ఇతఁడు తన మామ (సులతాన్ అబ్దుల్లా)ను కీలుబొమ్మనుజేసి గోల్కొండ రాజ్యమును బాలించుచుండెను. రెండవ కొమార్తను ఔరంగజేబు కుమారుఁడు మహమ్మద్ సులతానున కిచ్చి యుద్వాహము సేసెను. మూఁడవ పిల్ల నాఁడపిల్లను 'సయ్యద్ అహమ్మద్' అను మొదటి యల్లుని యాశ్రితుఁడైన 'సయ్యద్ సులతాన్' అను నతనికి కిచ్చెద మని నిశ్చయించుకొనియుండ ఱేపు పెండ్లి యనఁగా నతఁడు దన్ను ధిక్కరించినాఁ డను నీర్ష్యాసూయలతో (సయ్యద్ అహమ్మద్) ఈతని సంబంధమును దప్పించి తన వశవర్తియై తన మాట పలుకులలో నుండఁగల యొక యనామకున కీఁదలఁచి కులీనుఁడయ్యును భాగ్య భోగములు లేక విరాగియై దారిద్ర్య వివశుఁడై యున్న 'అబుల్ హాసన్'కు ఆపిల్ల నిచ్చి వివాహ మొనర్చెను.

సులతాన్ అబ్దుల్లా చనిపోఁగానే సయ్యద్ అహమ్మద్
సులతాన్ అగుటకు బలాటపడినాఁడు కాని యితని అహంకా
రము, వెకిలితనము, మూర్ఖ్యముల, వలన దర్బారులో ననేకు
లితనికి శత్రువు లేర్పడిరి సయ్యద్ ముజఫర్ అను సేనాని,
మూసాఖాన్ అను మహల్దారు, ఇంకఁ గొందఱు యుద్యోగు
లతోఁ గలసి 'సయ్యదు అహమ్మద్'ను జెఱసాలకుఁ ద్రోచి
'అబుల్ హసన్'ను 'తానీషా' అను పేరితో సులతాను నొనర్చి
తాము మంత్రు లయిరి. రాజ్యప్రమేయము లేని వట్టి విగ్రహ
మితఁడని వారిద్దఱు ననుకొని వ్యవహరించుటను 'తానీషా'
గమనించి వారి నిద్దఱఁ దొలఁగించుట కెప్పుడు సమయము దట
స్థించునా? యని ప్రతీక్షించుచు నమాయకుని వలె నుండు
చుండెను.

ఆలో, తానీషా అక్కన్న, మాదన్నల బుద్ధికౌశలత,
వారు తన యందు గనపఱచు భ్రాతృభావము, గౌరవ ప్రపత్తులు,
సామ్రాజ్యరక్షా మర్యాదలు, -గల శక్తియుక్తుల గ్రహిం
చి, మాదన్న యాంత్రిక బలముతో మూసాఖాన్ మహల్దారుల
కిద్దఱకుఁ దగవులఁ బెంచి యెదను గనిపట్టి వారిద్దఱఁ గారాగార
నిబద్ధుల నొనర్చి, మాదన్నకు 'సూర్యప్రకాశరావు' అను
బిరుదు నిచ్చి మహామాత్యునిఁ జేసి రాజ్యభారము నంతను
నొప్పగించి తానీషా తన వేదాంత సాహిత్యాది గోష్ఠీ కలాప
ములో నిమగ్నుఁడై శాంతముగా గాలము గడపుచుండెను.
అక్కన్న మహాసేనాని. మాదన్న తమ్ముఁడు వేంకన్న
'రూస్తుంరావు' అను బిరుదుతో ఫౌజు దారుఁ డయ్యెను.

ఇవ్విధముగా మహామాత్యుఁడగు మాదన్న మహావైభవముతోఁ దన్నెదుర్కొను వారు లేక గోలకొండ సామ్రాజ్యము నంతను సుభిక్షముగా నేలుచుండెడి వాఁడు. ఆ నాఁటి గోలకొండ సామ్రాజ్యము ఉత్తరమునఁ గళింగ దేశము దక్షిణమునఁ బుదుచ్చేరి,— సరిహద్దులుగాఁ దెలుఁగు నాఁ డంతయు విస్తరించి యుండెను.

ఇమ్మహామాత్యుఁడు విదేశాంగనీతిలో దిట్ట. ఒక విధముగా ఢిల్లీ పాదుషా యగు నౌరంగజేబునకు నంకితులై గోలకొండ సులతానులు కప్పము చెల్లించుచు నుండువారు. విజాపుర నవాబులతోడను బాంధవ్యము నుంచికొనుచుండిరి.

ఇఁక దక్షిణమున శివాజీ బలదర్పములతోఁ బ్రబలుఁడై దక్షిణాపథ మంతయుఁ గొల్లఁ గొట్టుచుండెను. ఔరంగజేబు పాదుషాతో నెయ్యము పాముతోఁ జెలిమి వంటిది. ఏ సమయమునఁ గబళించి వైచునో తెలియదు. దగ్గఱ శత్రువు కాఁగలవాఁడు శివాజి. తానీషాను శివాజీకిని, మాదన్న నెయ్యము సేకూర్చినాఁడు. గోలకొండకు శివాజీ అండఁగా నిలుచునట్లును, దక్షిణాపథమునఁ గొల్లఁగొనిన సామ్రాజ్యములో గోలకొండ వారికిని రాజ్యము, ధనము, — భాగము వెట్టునట్లును, — ఇందులకయి శివాజీకిఁ దానీషా కొన్ని లక్షల వరుమాన మిచ్చునట్లును — శివాజీ తానీషాల మధ్య నొడంబడికను మాదన్న కుదిర్చినాఁడు.

ఈ యొడంబడికను ఢిల్లీ పాదుషా యెఱిఁగికొని గోలకొండ సులతానుల పయిం గ్రోధారుణ నేత్రుం డయి

గోల్కొండలోఁ దన ప్రత్యేక రాయబారి (Ambassador) ని నియమించి తానీషాను అదుపులోఁ బెట్టవలసిన దని యుత్తర్వు లొసంగినాఁడు ఇఁక బిజాపుర నవాబు ఎప్పుడు కప్పుడు యుద్ధ సన్నద్ధుఁ డగుచునే యుండు చుండెను.

కాని యిది యంతయు రాజనీతి చతురత, శక్తి యుక్తులు. — గల మాదన్న మహామంత్రి కనిపెట్టుచు, సహా ప్రాప్తుఁడై మెలంగుచు, విదేశ వర్తకులకుఁ దగిన వసతులు, అవకాశములు, — జాగరూకతతోఁ గల్పించుచు నుండెను. కాని స్వార్థపరు లైన కొండఱు దర్బారీయులకు, అంతఃపుర స్త్రీలకు, — మాదన్న రాజనీతి వేతృత్వము కంటగింపుగనే యుండి తానీషా చెవిలో నాతనిఁ గూర్చి యవిశ్వాసమును, తత్సంబంధము లగు పితూరీలు, పడవేయు చుండిరి. కాని యవి నిరుపయోగము లయ్యెను.

శివాజీ పైని మాదన్నకుఁ గల యాశ నిరాశ మైనది. గోల్కొండ వా రిచ్చిన కానుకలు, చేసిన సదుపాయములు,— అన్నియుఁ గిమ్మనక పుచ్చుకొని శివాజీ మాట చెల్లించుకొను నవకాశము లేకయే స్వర్గస్థుఁ డయ్యెను. ఈ లోఁగా విజాపుర ముపై దిల్లీ పాదుషా దాడి వెడలి 'విజాపురము వారికిఁ దోడ్ప డిన గోల్కొండ వారికి శాస్తి జరగు' నని వర్తమాన మంపి నాఁడు. కాని రహస్యముగ విజాపురము వారికిఁ దోడ్పడక తప్ప దయ్యెను.

కాఁగా, గోల్కొండను స్వైవశము సేసికొన వలె నను కాంక్ష ఔరంగజేబు పాదుషాకు అధిక మైనది. గోల్కొండ

తానీషా కాఫరు చేతిలోని కీలుబొమ్మ యనియు నతఁడు దుర్వ్యసనములం బడి దేహమే మఱచి యున్నాఁడనియు — ప్రచారము సాగించినారు. తన రాయబారులతో నీసంగతి దాని షాకుఁ గయ్యమునకుఁ గాలుదూయవలసిన దని హెచ్చరించెను.

ఆసమయముననే యక్కన్న మహాసేనాని దర్బారీయుండైన 'అత్తెమత్తరాయు'ని అగౌరవపఱచి యుండుటను దెలిసికొని మాదన్న మంత్రి వానిని బుజ్జగించి శాంతింపఁజేయ యత్నించినాఁడుగాని యతఁడు మాత్రమా యగౌరవమును ప్రక్కలో నొక వంకఁ బెంచికొనియే యున్నాఁడు. గోలకొండలో సామ్రాజ్యమునకుఁ, బ్రభుత్వమునకుఁ, బరస్పరాభిగతము లగు కుట్రలు సాగ నారంభమైె, మొగలాయీలు గోలకొండపై దండెత్తి వచ్చుటను జూచి "అత్తెమత్తరాయఁడు" మాదన్న తానీషాల పైనను, సేనానుల పైనను,— ద్వేషానలమును ప్రజ్వలింపఁజేసినాఁడు.

ఢిల్లీ పాదుషా కుమారుఁడు 'షా అలం' అనువాఁడు గోలకొండను ముట్టడించినాఁడు. తానీషా కప్పములఁ జెల్లించుచునే రాయబారముల జరపినాఁడు అక్కన్న మాదన్నలఁ దొలఁగించ వలసిన దని యౌరంగజేబు ఫర్మానా పంచినాఁడు. కాఁగా, వా రిద్దఱును దమ యంతటఁ దాము సులతానుకు వీడ్కోలు చెప్పి పదవుల విరమించిరి. ఆవల నొకనాఁడు బంగారు పల్లకీలలో అక్కన్న మాదన్న లిద్దఱు వచ్చుచుండఁగా అత్తెమత్తరాయని సిపాయీలు వారి పల్లకీల

నడ్డగించి తటాలున వారి శిరసుల నఱకి, వారి దేహముల నేలఁబెట్టి యీడ్చుకొనుచు, వారి బంధువు లున్న చోటుల, హిందువు లధికముగాఁ గల ప్రదేశముల,— పఱుగుదాటి ఆ ప్రజల నడఱి వధించిరి. మాదన్న మహామాత్యునకు సంతానమే లేదు. అక్కన్న కొక కొడుకు మల్లన్న యనువాఁ డుండెను. ఒక మస్కర తురుష్కుఁడా మల్లన్నను బొత్తి ళ్ళలోఁ బెనిచి, దాఁచి కాపాడినాఁడు. ఇతనికి మాదన్న మంత్రి యనిన మిక్కుల భక్తి విశ్వాసములు గలవు. అక్కన్న మాద న్నల మృతికిఁ దానీషా చాల విచారపడినాఁడు.

ఆవలఁ దానీషా ఘాదుషాకు లొంగిపోయి యొక లేఖను వ్రాసినాఁడు. అది కారణముగా గోల్కొండను మొగ లాయీలు స్వాధీనము జేసికొని 'దౌలతాబాదు' కోటలోఁ దానీషాను బందీగఁ జేసిరి. బందీగా అతఁడు ౧౪ సంవత్సరము లుండి యుండె క్రీ. శ. ౧౭౦౨ లోఁ జనిపోయినాఁడు.

రాజరాజ నరేంద్రుని సంధి విగ్రహి

యగు

# గోపాలుని నన్నియ భట్టు

(క్రీ. శ. ౧౧ వ శతాబ్దము)

---

రాజేంద్ర చోళుఁడు కన్యాకుమారి వఱకు దక్షిణదేశమును గెలుపొంది నౌకాబలమును చేకూర్చికొని సింహళద్వీపమును బూర్తిగా వశపఱచికొని పశ్చిమ సముద్రమందలి పండ్రెండు వేల దీవుల నాకళించికొని ప్రాగ్భాగము నందున్న 'పెగూ' రాజ్యము 'నికోబారు' 'అండమాను' ద్వీపములతోఁగూడ 'శ్రీ విషయము'ను సామంత మండలముగా నొనర్చెను. అంతతో నూరకొనక విహారోత్కళ వంగదేశముల జయించి 'గంగైకొండ చోళుఁ' డని బిరుదు వహియించెను.

అప్పటికే యుత్తర హిందూస్థానము చైతన్యము కొఱవడి ఛిన్న భిన్నమై గజనీ మహమ్మదు దండయాత్రలకు గుఱియయ్యెను. భారత మతాభిమాను లగు చోళ చక్రవర్తులు హిమవన్నగ పంక్తి నుండి రామేశ్వరము దాఁక ఏకచ్ఛత్రాధిపత్యముగాఁ బరిపాలింపవలె నని మహాప్రయత్న మొనర్చిన కాలమున రాజరాజు రాజేంద్ర చోళునకు జామాత యయ్యెను. రాజరాజు కొమారుఁడును రాజేంద్రచోళుని మనుమరాలి మగఁడే!

ఈ సమయ మందె వేంగి మండలమునఁ జోళరాజ్యము తమ పరము కావలె నను తీవ్రప్రయత్నములు, గాఢాభిలాషము,— ఉండి యుండవలయును. లేకున్న రాజరాజు కుమారుఁడు; క్రీ. శ. ౧౦౭౦ దవ సంవత్సరమునఁ జోళచక్రవర్తియై 'కులోత్తుంగ చోళ చక్రవర్తి' యను బిరుదు వహియించి తన తాతగారితో సమమైన ప్రతిభా వ్యుత్పత్తులతో నలుబది తొమ్మిదేఁడులు సేతువు నుండి కళింగము దాఁకఁ గల రాజ్యమును బరిపాలించి యుండునా?

వైదికకర్మ కలాపము యొక్కయు వర్ణాశ్రమ ధర్మముల యొక్కయుఁ, బునరుద్ధరణము రాజరాజునకుఁ గావలసినది రాజరాజు వైదిక మతము (Vedic - Religion) నకు బట్టుగొమ్మ. నన్నియ భట్టీ మతమును బరిపూర్ణముగ నవస్థానమునకుఁ దెచ్చి వ్యాప్తిఁ గావించిన వాఁడు కావుననే

"జననుత కృష్ణద్వైపా
యన ముని వృషభాభి హిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్."

—అని నన్నియను రాజరాజు కోరినాఁడు. భారతమును దెనుంగుఁ జేయుటయే గాక భంగ్యంతరముగఁ జెప్పుటయును గూడ రాజరాజున కభిలషిత మని

"బహు భాషల బహు విధముల
బహు జనముల వలన వినుచు భారత బద్ధ

స్పృహు లగు వారికి నిష్పృహు
బహు యాగంబుల ఫలంబు బరిపూర్ణ మగున్."

—అను పద్యముం బట్టి విదిత మగు చున్నది. రాజరాజు బహు విధముల భారతమును వినఁ గోరుట చేతనే నన్నియ విశ్వజనీన మైన వ్యాస మహాభారతమును బరిపూర్ణముగా ననిచిరాని 'జగద్ధితంబుగఁ' భారత సంహితా రచన బద్ధుఁడయ్యెను.

ఇట్టి యాంధ్ర దృష్టియు వైదిక మతాభిమానమును గలవాఁడౌట చేతనే కాఁబోలు రాజరాజును 'సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహా మహిమ సమ్మహితోత్సవ సర్వలోకాశ్రయుఁ' డని నన్నయ యభివర్ణించెను.

అగస్త్య మహాకవి

"యద్వేదా దధిగతం శబ్దప్రధానాచ్చిరం,
యచ్చార్థ ప్రవణా త్పురాణ వచనా
దిష్టం సుహృత్సమ్మితాత్ కాన్తా
సమ్మితయా యయా సరసతా
మాపాద్య కావ్యశ్రియా కర్త
వ్యే కుతుకీ బుధో విరచిత స్త
స్యై స్పృహాం కుర్మహే."

—అని చెప్పినట్టు కర్తవ్యాకర్తవ్యముల నిరూపించి కర్తవ్య కరణ మందాసక్తియు,నకర్తవ్యము నందు వైముఖ్యమును,—గలిగించుట గ్రంథము లన్నిటికి సామాన్య ప్రయో

జనము. వేదశాస్త్రము లుభయము మూలమునను, పురాణా దులు యుక్తి మూలమునను,—ఈ ప్రయోజనము సాధింపఁ జూచును.

కావ్యములోఁ గర్తవ్యాచరణము నందు సరసత్వము, నకర్తవ్యాచరణము పట్ల విరసత్వము,—నాపాదించి మూల మునఁ గార్యసిద్ధిఁ బడయఁ గోరును. సరసత్వము కావ్య లక్షణ విశేష మగుట చేతనే యగస్త్య మహాకవి కావ్యమున నుత్కృష్టతను ప్రతిపాదించెను. అల్లసాని పెద్దన ఒప్పు తప్ప రయు రసజ్ఞు లుండినఁ గాని సత్కావ్యములు పుట్టఁ జాల వని చెప్పినాఁడు. ఇట్టి దృక్పథముతోఁ గాక నన్నయ భట్ట సార్వ భౌముఁడు వ్యాసభగవానుని యాశయముల ననుసరించి

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రం బని
యధ్యాత్మ విదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవి వృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షణం బనియును
నైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యం బని మహిఁ గొనియాడు చుండ
వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశ రాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీన మై
పరఁగు చుండఁ జేసె భారతంబు."

— అని భారతమును ధర్మసంహితగా పలికియు, పంచమ వేదంబనియు, — వ్రాసి యున్నాఁడు.

నన్నయ భట్టు 'స్వస్థాన వేషభాషాభిమతాః సన్తో రస ప్రలుబ్ధ ధియః' — అని సూచించుటవలన నితనికిఁ గల స్వస్థాన, వేష, భాషాభిమానములు తెలియుట యే గాక అవి సత్పురుషుల లక్షణమ్మని తెలియుచుం దగి యున్నది.

నన్నయ భట్టారకుఁ డవిరళ జపహోమ తత్పరుఁడు. సంహితాభ్యాసుఁడు. తెలుఁగున మహా భారత సంహితా రచన బంధురుఁడు. బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుఁడు లోకజ్ఞుఁడు. అర్థము మీఁద నంతకంటె శబ్దము మీఁద నిష్ఠ గలవాఁడు. ఇతని నిష్ఠ శబ్దము పయి మాత్రమే గాదు. రమణీయార్థమును బ్రతిపాదించు శబ్దములు, వాని కూర్పు, గురు లఘువుల యానుపూర్వి మాత్రమే గాక ఏత దుచ్చారణ మీఁద నధికము. దీనినే యక్షర రమ్యత యని నన్నయ మహాకవి సార్వభౌముఁడు చెప్పికొని నాఁడు.

ఈ యక్షర రమ్యత శబ్దముల కూర్పులో, అక్షరముల యానుపూర్విలో, నేత దుచ్చారణ వల్ల నభివ్యక్త మగు నాదములో, నున్నది నన్నయ నాదబ్రహ్మోపాసి. మధురములు లలితములు నైన సంస్కృత పదములు, కమ్మని నుడికారపు సొంపుల నీను తెనుఁగు పదములు, — నన్నయ భట్టారకుని పద్యములలో ఆ గురు లఘువుల యానుపూర్విలో నక్షర రమ్యతగా రూపొందినది.

నన్నియ విపుల శబ్ద శాసనుఁడు. వ్యవహారము నందును, శిలా శాసనములలోను — అవ్యవస్థితముగ నున్న విపుల శబ్ద జాలమును దీర్చి దిద్ది, నియతిఁ గల్పించి, — శాసించినాఁడు. నన్నియ తెలుఁగు పదములకు సంస్కృత శబ్దములకుఁ దెలుఁగు ఛందస్సునకు సంస్కృత ఛందస్సునకుఁ — దీరు తీయముల దిద్ది పద్యములఁ జెక్కిన శిల్పి.

ఇ మ్మహాకవి కుల బ్రాహ్మణుఁడు. అనఁగా వీరమంత్రి యని యర్థము. 'కుల బ్రాహ్మణ' శబ్దమునకుఁ బురోహిత పదము పర్యాయ పదముగాఁ జళుక్య శాసనముల నెచటను నుపయోగింపఁ బడక పోఁగాఁ, గర్ణాటక రాజవంశావళీ శాసనముల యందు దైనను వ్రాయఁబడి యుండ లేదు. ఇట్టు లుపయోగించు వాడుక రాజరాజ నరేంద్రు నాస్థాన మర్యాద కాదని

"మంత్రి పురోహిత సేనాపతి దౌవారిక దండనాయక మహాప్రధానాం- సామంత విలాసినీ పరిష్కృతుఁడై ......

సీ. తన కుల బ్రాహ్మణు ననురక్తు... ..."

— అను భారతవర్ణనము వలనఁ దెలియుచున్నది.

ఇంతియ కాక చళుక్య రాజుల శాసనములలోఁ బంచ ప్రధానులఁ బేర్కొను నవసరమున 'పురోహిత' పదమే వినుకలి. కాని 'కుల బ్రాహ్మణ' శబ్దము వినఁ బడదు. నన్నియ వ్రాసిన 'నందమ పూఁడి' శాసనము నందు "తస్మిన్ సంకులే పురోహితే న సార్థ మంతర్వార్తిన"— అని యున్నది గాని 'కుల బ్రాహ్మణేన సార్థ మంతర్వార్తిన్"— అని యున్నట్టు లగపడదు.

దీనిం బట్టి కుల బ్రాహ్మణ, పురోహిత, - శబ్దములు పర్యాయ పదములుగ నన్నిచో గ్రహించి యుండ లేదని విస్పష్ట మగుచున్నది. అయినను పురోహితుఁడును, కుల బ్రాహ్మణుఁడును - బహుశః నొక్కఁడగు నేమో !

శాసనములు వ్రాయు నలవాటును, అధికారమును మహామంత్రులకు మాత్రమే యున్నది. కాని పురోహితునకు మాత్రము లేదని యిప్పటికి కన్పించిన శాసనములలో నా కగపడి నంత వఱకుఁ బురోహితుఁడు వ్రాసిన శాసనము లేదు.

యుధిష్ఠిరునకు నారద మహర్షి కుశల ప్రశ్న పూర్వకముగ రాజనీతి నుపదేశించు తావున "కులీనా శ్చాను రక్తా శ్చ కృతా స్తే వీరమన్త్రిణః"—అని పృచ్ఛించి నట్లు సంస్కృత భారతమునఁ జెప్పఁబడి యున్నది. ఈ సందర్భమునఁ బురోహితుని గుఱించిన వాక్యము "అనసూయ రసంకీర్ణః సత్కృతస్తే పురోహితః"—అని కలదు. ఇ వ్వాక్యముం బట్టి 'కుల బ్రాహ్మణ - పురోహిత"—పదముల కెంత యెడమో యెఱుంగఁ దగును.

కాఁబట్టి నన్నియ భట్టును గుఱించిన 'కుల బ్రాహ్మణ' పద ప్రయోగ వైచిత్రి 'వీర మంత్రి'కిఁ దగి యున్నదని బుద్ధిమంతులకుఁ దోఁపక పోదు.

రోమపాదుని రాజ్యమున ననావృష్టిఁ దటస్థించి ధర్మలోపము గలిగినప్పు డా రోమపాదుఁడు ఋశ్యశృంగునిఁ గొని తెచ్చు నుపాయము నాలోచించు నవసరమున ధర్మలోపమును

బాపుట దన ధర్మము గావున మంత్రులతో యోజించి పురోహితుండు గార్య విని శ్చయ మొనర్చె నని

"రోమపాద మువా చేదం
సహామాత్యః పురోహితః,
ఉపాయో నిరపాయో య
మస్మాభి రభి చింతితః"—(బా, ౧౦ సర్గ)

దశరథ మహారాజు శ్రీరామచంద్రమూర్తికిఁ బట్టాభిషేకము సేయఁదలఁచి మంత్రులతోడ మున్ముందుఁగ యోజించి కాల నిర్ణయము సైతము గావించిన తర్వాత దశరథు నెదుటఁ గృతాంజలులై యున్న మంత్రులతోడఁ బ్రభు వచనానుసారముగా వసిష్ఠ మహర్షి పట్టాభిషేకమునకు వలయు సంబారములఁ గూర్ప వలయునని చెప్పినట్టు లయోధ్యాకాండ ౩వ సర్గ మందలి

"త చ్ఛ్రుత్వా భూపాలస్య
వసిష్ఠో ద్విజ సత్తమః
ఆది దేశాగ్రతో రాజ్ఞ స్థితాన్
యుక్తాన్ కృతాంజలీన్"

—అను శ్లోకము విస్పష్ట మొనర్చుచున్నది. ఇందలి 'యుక్తాన్' అను పదమునకు 'రాజకార్య నియుక్తాః సుమంత్రాదీ నధికారిణ ఇతి యావ' త్తని వ్యాఖ్య వ్రాయఁబడి యున్నది. కనుక రాజకార్య నియుక్తు లగు మంత్రులతో వైదిక కార్య నియుక్తుం డగు వసిష్ఠ మహర్షి యభిషేక

సంభారముల జాగ్రత్త సేయవలె నని చెప్పినట్లు గనఁబడు చున్నది. ఇట్లు దశరథుఁడు కార్య విమర్శయు నొనర్చియు మరల పట్టాభిషేకముం గూర్చి మంత్రులతో యోజించె నని “ఏవం పూర్వ విచారితే మపి రామాభిషేకం పున స్సమంత్రిభిః, కాల విశేష నిర్ణయ పూర్వకం రామ మాగామాయ సవిశేష ముప దిశతి చతుర్థే గతే ష్విత్యాదినా”— అని తెలుపు చున్నది. రాజ్యకార్యములకు సంబంధించి సంతతులకు మంత్రులును, వైదిక కార్యములకు సంబంధించి సంతతులకుఁ బురోహితుఁ డును,— దమ తమ కార్యముల నిర్వర్తించు చుండువా రని యువగత మయ్యెడిని. కనుకనే యశ్వమేధమునకు వలయు విధులను వసిష్ఠుఁడును, జనక రాజర్షులో నగు వారి నాహ్వా నించుటకు సుమంత్రాదులును,— జరపిరి. శతానందుఁడు వైవాహిక విధిని నెరవేర్చెను. దశరథు నాహ్వానించు పని జనకరాజర్షి మంత్రులే యొనర్చిరి. పెండ్లికిఁ దరలి వచ్చు దశరథుని రాజలాంఛనములఁ జూపి తేవలసిన విధి యై నందున మంత్రులే పనుపఁ బడిరి.

ఇ ప్పరామర్శము వలన అలౌకిక కార్యసాధకుఁడు పురోహితుం డనియు, లౌకిక కార్య నిర్వాహకుఁడు మంత్రి యనియు,— తెలియంగఁ దగి యున్నది.

తూర్పు చాళుక్యులలో వైదవవాఁ డగు సర్వలోకా శ్రయుని ‘మంగి యువరా’ జని యందురు. ఇతని తండ్రి రెండవ విష్ణు వర్ధనుఁడు. తాత ఇంద్ర భట్టారకుఁడు. ముత్తాత కుబ్జ విష్ణు వర్ధనుఁడు. ఈ సర్వలోకాశ్రయుఁడు క్రీ. శ. ౬౭౨వ

సంవత్సరము నుండి క్రీ. శ. ౬౯౬ వ సంవత్సరము దాఁక నిఱువది యై దేఁడులు రాజ్యము సేసినవాఁడు. ఇతని క్రీ. శ. ౬.౭౩ వ సంవత్సరము నాఁటి "చెన్దలూఱు" శాసనమున

"పరమ బ్రహ్మాణ్యః మహారాజానుభావ శ్రీ సర్వలోకాశ్రయ మహారాజః కమ్మ రాష్ట్రే చెన్దలూఱ గ్రామే గ్రామేయకాన్ అత్ర గత సర్వనైయోగిక వల్లభాం శ్చాజ్ఞాపయతి"—

అని కలదు. (Epy. Indica; Vol. VIII, IV, సంచిక) ఇందలి 'సర్వ నైయోగిక వల్లభాన్' అను పదము రత్నాల మూఁట యని సుప్రసిద్ధ చరిత్ర కారులు, ఆంధ్ర సారస్వత పరిష త్ప్రతిష్ఠాపకులు,—నగు శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులు ఎం. ఏ., గారు వ్రాసినారు.

క్రీ. శ. ౭౩౮ దవ సంవత్సర ప్రాంతమున జాయిక దేవ మహారాజు నాస్థానమున 'భట్ట నారాయణుఁ' డను మహామాత్యుఁడు ముద్గల గోత్ర సంజాతుఁ డగు నీశ్వర భట్టున కగ్రహార మొక దాని నిప్పించెను. రాజరాజు తండ్రి విమలాదిత్యుని ప్రధానమంత్రి రావుల వజ్జియప్రెగడ. ఇమ్మహామాత్యుఁడు కౌండిన్య గోత్రుఁడు, 'కారమచేడు' వాస్తవ్యుఁడు, బుద్ధి మదగ్ర గణ్యుఁడు, అరివీర భయంకరుఁడు,—నని 'రణస్థిపూండి' శాసనము దెలుపు చున్నది.

దీన, నన్నియకుఁ బూర్వ మెంతకాలము నుండియో శాఖా వినిర్ణయ మేర్పడి యుండఁగాఁ గా దనువారు కలరా? కలచో దేవానాం ప్రియు లనియే వారి ననవలసి యుండును.

'లోకజ్ఞుఁడ' నని చెప్పికొనిన నన్నయ 'సత్ప్రతిభాభి యోగ్యుఁడును, నిత్యసత్య వచనుఁడు, నగుటచే మరలఁ దన రాజునకు రాజ్యము జేకూఱు నను నమ్మికఁ బూనికొని యుండెను. నాఁటి కింకను నన్నయ 'భారత సంహితా రచన బంధురుఁడు' గా లేదు, రాజరాజే నిలుకడ లేక దేశమును త్యజించి పర్యటించుచుండ నన్నయకు, నందున, — ననురక్తునకు, గ్రంథము వ్రాయు నంతటి యోపికయు, వ్యవధియు, — నెక్కడుండును ?

నన్నయ సుకృతమో లేక రాజరాజు తపోబలమో 'వాణస' ధరామర వంశ రత్నాకరుం డయిన నారాయణ భట్టు నన్నయకు సహాధ్యాయి యగుట నాతని సాహాయ్యముచే త్రైలోక్య మల్లదేవని ప్రధాని యైన మధుసూదనయ్యను సందర్శించి మరల రాజరాజునకుఁ గ్రీ. శ. ౧౦౬౧ లో వేంగీ సామ్రాజ్య మిప్పించి యుండునని తోఁచెడిని. ఏలయన గ్రీ. శ. ౧౦౬౦ దవ సంవత్సరమునఁ 'దిరువయ్యూరు' లో నుండిన రాజరాజ నరేంద్రుఁడు క్రీ. శ. ౧౦౬౧ వ సంవత్సరమున నారాయణ భట్టునకు రెండేఱుల నడిమి విషయమున 'నందమపూఁడి' యను గ్రామమును దానముగా నొసంగుచు నాతనిఁ బ్రాకృత, పైశాచీ కర్ణాటాంధ్ర సంస్కృతాది భాషలలో నిష్ణాతునిగా నభివర్ణించినాఁడు. ఈ శాసన రచయిత నన్నయ (E. I. IV, P. ౩౦౦.)

తన 'కుల బ్రాహ్మణుఁడు' అగపఱచిన యీ రాజనీతి వలన రాజరాజ నరేంద్రుఁడు మరలఁ దన రాజ్యమును సముపార్జించుకొనుటయే గాక విజయాదిత్యుని వలని కష్టపరంపరలఁ

దప్పించికొనియెను. కర్ణాటకు లీ విజయాదిత్యుని నొడంబఱచి, శాంతిపఱచి, 'నొలంబ వాడి' దేశమునకు సామాంత ప్రభువునిగా నేర్పాటొనర్చిరి. ఇట్లు నిరువురకు యుద్ధప్రసక్తియే లేక పోయెగా రాజరాజ నరేంద్రునకుఁ దుది పదేండులు క్రీ. శ. ౧౦౫౧వ సంవత్సరము నుండి క్రీ. శ. ౧౦౬౧వ సంవత్సరము వఱకును శాంతి చేకూఱినది.

రాజ్యమునఁ గుదురుకొనిన వెంటనే రాజరాజు తన రాజధాని 'వేంగి' నుండి 'రాజమహేంద్రవరము'నకు మార్చుకొనినాఁడు. అంతవఱకు 'వేంగి' యే 'వేంగి సామ్రాజ్యము'నకు రాజధాని యని కర్ణాటకుల బిరుదపరంపర చేతను, మఱి యితర ప్రస్తావనల చేతను,-దెలియ నగుచున్నది. ఇయ్యభిప్రాయమును 'కావ్యాలంకార చూడామణి' యందలి "రాజమహేంద్ర పుర స్థాతి రాజ నరేంద్రుఁ డెక్కువ తాత యే విభునకు"—అను వాక్యము బలపఱచు చున్నది. భారతము (ఆది పర్వము ౩;)న గల 'రాజకులైక భూషణుఁడు... రాజమహేంద్రు డున్నతిన్,-అను పద్య చరణము సైతము దీనిఁ బలపఱచు చున్నది.

ఇవ్విధముగ శాంతి యేర్పడిన తర్వాతఁ దనతోపాటు కష్టముల ననుభవించిన యనురక్తునకుఁ, దనకు సాహాయ్య మొనర్చిన యుపకారికి—నతని యందుఁ గృతజ్ఞత నగపఱచు వాఁడయి భారతాంధ్రీకరణమునకు ననుజ్ఞ నొసంగి యుండు నని చెప్పఁ బనిలేదు. నన్నియ, నారాయణ, రాజరాజ నరేంద్రులు మువ్వురును సుఖిం బుండిన క్రీ. శ. ౧౦౫౧-౫౫ సంవత్సరముల నడిమి కాలమున 'విద్యా విలాసగోష్ఠి సుఖోప

వెలనాటి మహామండలేశ్వరుం డగు, రాజేంద్ర చోడుని

సచివోత్తముండైన

# నందూరు గుండ మంత్రి

(క్రీ. శ. ౧౩ వ శతాబ్దము.)

ఇతండు ఆఱువేల నియోగి బ్రాహ్మణుండు, కౌశిక గోత్రుండు. వెలనాటి రాజచంద్రుం డగు రాజేంద్ర చోడుని సచివోత్తముండు. బాపట్ల తాలూకా యందలి 'నందూరు' వాస్తవ్యుండు. కృష్ణా గోదావరీ మండలములం గల నందూరు వారెల్లఱును నీ యూరి నుండియె వెడలినట్లు లగపడు చున్నది.

ఇమ్మంత్రి శిఖామణికి 'శివలెంక మంచన కవి' తన 'కేయూర బాహు చరిత్రము' ను గృతి యొసంగెను. ఓరుగంటి ప్రతాపరుద్ర చక్రవర్తికి మంత్రి శేఖరుండుగా నున్న యుగంధ రామాత్యునిం బ్రస్తుతించుటచేం గ్రీస్తుశకము ౧౨౯౬-౧౩౨౩ సంవత్సరములకు నడుమ నున్న ప్రతాపరుద్ర మహారాజునకుం దరువాతి వాం డని యాంధ్ర సారస్వత పరిషత్ప్రతిష్ఠాపకులు, 'సరస్వతీ' పత్త్రికాధిపులు, నగు శ్రీశ్రీ రాజా కొచ్చర్లకోట రామచంద్ర వేంకట కృష్ణరావు బహద్దరు బి. ఏ., వారు (పోలవరము సంస్థానాధీశులు) నిర్ధరించి యున్నారు.

గుండన మంత్రి తాతయుం దాత స్థానీయ గోవిందన వెల
నాటి గొంక మహీపతికి సచివోత్తముండు. గొంక ధారుణీశ్వ
రుడు క్రీ. శ. ౧౧౩౨ సంవత్సరము నుండి క్రీ. శ.
౧౧౬౧-౬౨ వ సంవత్సరము వఱకు మహా వైభవముతో
రాజ్యము నేలెను. ఇతని సచివోత్తముండగు గోవిందన ప్రెగ్గ
డయు, నీతని కొమారుండగు కొమ్మన ప్రెగ్గడయు - వెలనాటి
దుర్జయాన్వయమునఁ గార్య ఖడ్గపటిమలై ప్రసిద్ధి నొందిన
వారు. గొంక ధారుణీశుని పుత్త్రుండే రాజేంద్ర చోడుండు.
ఇమ్మడి రాజేంద్ర చోడుం డనియు నీతని నందురు. ఇతండు
తండ్రికిం దగిన కొడుకు. శౌర్య స్థైర్య గాంభీర్యాదుల గొంక
మహీపతి కే మాత్రము దీసిపోవండు.

కడపటి దినములలో రెండవ గొంకరాజు పాకనాటి
పయి దండెత్తి దాని నాక్రమించి కొనినట్లు బాపట్ల భావ
నారాయణస్వామి యాలయములో శకాబ్దము ౧౦౮౨ నకు
సరియైన క్రీ. శ. ౧౧౬౦-౬౧ నాంటి యొక శిలాశాసనమున
గొంకరాజు ధనదుపురము రాజధానిగా ముఖలింగము సింహా
పురికి నడుమ నున్న తీరదేశమును బాలించె నని

"రమణీయ ధనద పురవర
మమరంగ నిజరాజధాని యై యుండం గనక
రము నెల్లూరును లోవుగం
గ్రమ మొనరంగ నేలె బాహుగర్వము వెలయన్."

అని చెప్పంబడి యున్నది. ఇవ్విషయమునే మంచనకవి

"అరుదండ వెలనాంటి చోడ మనుజేం
ద్రాజ్ఞాపనం బూని దు
ర్గరశక్తి న్జని యేకవింశతి సహ
స్ర గ్రామ సంఖ్యాకమై
ధరణి నొప్పిన 'పాకనాఁడు' నిజదో
ర్దండైక లగ్నంబుగా
ధరఁ బాలించె సమాత్య కొమ్మన జగ
త్ప్రఖ్యాత చారిత్రుండై."

అని చెప్పినాఁడు. ఇవ్విధముగ వెలనాంటి గొంక ధరణీధవుఁడు పల్లూరు ? అనుఁ గల దేశము నేలె ననియు, వెలనాఁటి చోడని యాజ్ఞ ననుసరించి యాతని సచివుఁడగు కొమ్మన పాకనాఁ డేకవింశతి సహస్ర గ్రామములను గెలుపొందె ననియుఁ, బై శాసనాద్యాధారము లుట్టంకించుచున్నవి. పాకనాఁ డెంతకాలము వెలనాఁటి మహామండలేశ్వరుల కంకితమై యుండెనో నిశ్చయింప వలనుపడ కున్నయది.

కుళోత్తుంగ రాజేంద్రచోడని పరిపాలనా కాలమునం గూడ వేంగిపైఁ గళ్యాణి కటక సామంత ప్రభువులు దండెత్తి వచ్చిరి కాని ననదుప్రోలు కటక సామంత దండనాయకాదుల సాహాయ్యముతో నుత్సాహ ప్రోత్సాహములతో సేనాని వహాంబులఁ గొనిపోయి కొమ్మన సచివాగ్రణి మన్నెఱు క్రొత్తచెర్ల పరిసరముల శాత్రవ యూథంబుల నెదుర్కొని తీవ్రముగఁ బోరాడి తన యేలికకు జయము సేకూర్చెనని కేయూర బాహు చరిత్రమున

"చలమున మెఱయఁ గిరిని సోమన
మూలు గని హయ భటాళి సేనల సకోప
న్వలఁపడియెఁ గొమ్మ సచివుఁడు
బలియుండై క్రొత్తపల్లి పగసర భూమిన్.

"సెలకట్ల వాఁగునఁ జెలఁగి రేఁగిన మూఁకలఁ
గూడి గుఱ్ఱంబుల గుములు గ్రుచ్చి
ప్రతి మొగంబగు నరపతుల కొత్తళమునఁ
గడిమి మైమిఁ బ్రేఁపులు వెసలఁ బాఁదుచుఁ
బందంపు గొఱియల పగిది సేనాంగుల
ఘోర శస్త్ర నసిఘాతఁ దునుముఁ
జడియించుఁ బిగిలించుఁ జేతుల పోటు వో
వడిఁ గాండ మేసి మావంతుల తలలు
తల పుడికి వ్రేసి మావంతు తలలు శత్రు
రాజ శిరములు ద్రొక్కించు రాఁగెఁ దిరుగ
వాగె నుబ్బెడు తన వారువంబుచేత
మహిత శౌర్యుఁడు కొమ్మనామాత్య వరుఁడు"

—(౧; ౨౭-౮) అను పద్యములు తెలుపుచున్నవి. క్రొత్తచర్ల యుద్ధమునఁ గొమ్మన ప్రెగ్గడ చూపిన ప్రతాపము వర్ణనాతీతము. క్రొత్తచెర్ల పాఁకనాఁటి పశ్చిమోత్తరమున నుండెడి గడిదుర్గము. ఇచ్చట వెలనాఁటి వారికిని, గర్ణాటకులకును,— యుద్ధము దటస్థించి యీ యుద్ధమున వెలనాఁటి చోడని పక్షమునఁ బాఁకనాఁటిని బరిపాలించు చుండిన కొమ్మన పాల్గొనుట యను విషయము గమనించ వలసిన చారిత్రి

కాంశము. దుర్జయుల 'సనప్రోలు' రాజ్యము కళింగ మునుండి పాకనాటి వఱకును వ్యాపించి, కళింగ పాకనాడు దేశములు సైతము కాన్కలఁ జెల్లించినవి.

మూఁడవ గొంక నృపాలు ననంతరము క్రీ. శ. ౧౧౮౬ లో ధనదుప్రోలు సింహాసన మెక్కిన యతఁడు వెలనాఁటి పృథ్వీశ్వరుఁడు. వెలనాఁటి దుర్జయ నృపాలురలో నితఁడు చిగుఱువాఁడు. ఇతని యధికారము కళింగ దేశములోని శ్రీ కూర్మమును వఱకుఁ జాఁగుచుండినట్టును, వెలనాఁటి మహా మండలేశ్వరులకుఁ గళింగ దేశాధీశు లరిగాపులై యుప్పనముల నొసంగు చుండి నట్టును,—. అగపడు చున్నది. ఈ పృథ్వీ శునిఁ జంపిన వాఁడు తిక్కరాజు. తిక్కరాజు రాజేంద్రచోడని పుత్త్రుఁడు. తిక్కనృపాలుని మంత్రిసత్తముఁడు కేతన. ఈ కేత నామాత్యుని మనుమఁడైన గుండన తిక్కరాజు కొడుకగు మనుమసిద్ధి యొద్ద మంత్రి.

తిక్కకవిబ్రహ్మ రచించిన నిర్వచనోత్తర రామాయణమునఁ బృథ్వీశునే మనుమసిద్ధి తండ్రి తిక్క భూరమణుఁడు చంపినట్టు లున్నది. తిక్కనృపాలుఁడు చిఱుతఁదనంబుననే పృథ్వీశ పతిని జంపుటచేఁ గ్రీస్తు శకము పదుమూఁడవ శతాబ్దారంభమున ఈ హత్య జరగి తిక్కరాజు క్రీ. శ. ౧౨౧౦ దవ సంవత్సర ప్రాంతము వఱకు రాజ్యము సేసినట్టు లూహింపఁ దగు నని యాంధ్ర సారస్వత పరిష త్ప్రతిష్ఠాపకులలో నొకరగు రా. బ. కందుకూరి వీరేశలింగము పంతుల వారు వ్రాసినారు. కాఁబట్టి చోడ రాజేంద్రుఁ డగు మనుమ గొంక

భూపాలుని కొమరుఁడు పృథ్వీశరాజనియు, నితని మంత్రియు దండనాథుఁడు కేతన యనియు, నీ కేతనామాత్యుని కొమా ళ్లలోఁ గజపతి వాఁడు భీమన యనియు, నీ భీమన గణవీరుఁడు రణగండఁడు ననియు, నితని కొమరుఁడే 'కేయూర బాహు చరిత్ర' కృతిపతి యగు గుండన యనియు,— తెలియం దగి యుండుటయె గాక మన్మసిద్ధి క్రీ. శ. పదుమూఁడవ శతాబ్ది మధ్య భాగమున 'విక్రమ సింహపురి' మను చెప్పంబడు నెల్లూ రును రాజధానిగాఁ జేసికొని పాలనాధిపుఁడై పాలించె ననియు నితఁడు కాకతీయాంధ్ర చక్రవర్తి యగు గణపతి దేవునకు మాండలికుఁడుగాఁ గూడఁ గొన్నాళ్లుండె ననియుఁ— తెలియ వచ్చుచున్నది.

ఈ విషయ పరిశీలనమునఁ బృథ్వీశరాజు మంత్రి యైన కేతనకు మనుమఁడగు గుండనన్నకుఁ "కేయూర బాహు చరిత్ర" కృతి యీయఁబడుటచే నీ గుండనామాత్యుఁడును క్రీస్తు శకము పదుమూఁడవ శతాబ్దియం దున్నవాఁడని తెలియుచున్నది.

చాటు పద్య మణి మంజరి (౯౦వ పుట) లోని

"నెట్టన గజపతి దేవుని
పట్టనమునఁ గల్గు వీరభట సామంతుల్
చుట్టములు దాతవే భళి!
గట్టిగ 'గుండన్న' కరుణఁ గల్గిన కతనన్."

—అను పద్యమును, చాటు పద్య రత్నావళి యందలి

"ధరణిం దాన గుణంబునం బొగడ నీ వని కవీం
ద్ర శ్రేణి వర్ణింపఁగా
బిరుదు ల్నిండిన గుండయోగ్రమునకుం గం
భీర ప్రభావోన్నతిం
దొరయంగా కతిపయులైన గణక
స్తోమంబులుం గల్గిన
న్గిరికిం బెట్టిన చందమా నితరుల
న్గీర్తింపఁగా నేటికిన్."

—అను పద్యమును,—పరికించిన యెడల నీతఁడు దాతల కెల్ల గురుప్రాయుం డనియుఁ, గవీంద్రులచేఁ బొగడ్తఁ గాంచిన వాఁ డనియు, ననేక బిరుదములచే విరాజిల్లు చుండు ప్రతిభావంతుఁ డనియు, నితరులఁ గీర్తించుట కంటె గుండయామాత్యునిఁ గీర్తించుటయే మేలనియు, నెవ్వరో యొక యాశ్రితుఁ డభివర్ణించినను స్వాభావిక వర్ణనమే యని తోఁచెడిని.

సాలంకాయన గోత్రుఁడు, శైవ నియోగి బ్రాహ్మణుఁడు, 'సనదవోలు' (Chandole) కాఁపురస్థుఁడు, నగు శివలెంక మంచనకవి తన "కేయూర బాహుచరిత్ర" మను నాలు గాశ్వాసముల గ్రంథమున నన్నయభట్టును, దిక్క కవి బ్రహ్మను, - దక్క నితరుల నినుతించి యుండలేదు.

కృతిభర్త యగు నందూరు గుండన మంత్రి తనన్ను నుద్దేశించి పలికిన పల్కులను, అందులకుఁ బ్రస్తావ వశమున

మంచన కవి [illegible], — నాపలక్షించిన గుండన మంత్రి [illegible] దగిన వాఁడని [illegible].

"కావున నాకు నీ కృతికిఁ
  [illegible] నిష్టము నీవు ప్రసన్న సం
భావిత కావ్యదక్షుఁడవు
  భవ్యమతి స్సల్లలిత నిర్మితం
బై విలసిల్లు తంత్రిపను ప్రి
  యంబునఁ జూచిన నంమాఁ [illegible] నా
ఖ్యానమా మై ప్రబంధ రచ
  నాశ్రేయ మయ్యేడు మార్గ మూఁతఁగాన్."

"స్థాయి రసము శృంగారం
బై యలవడఁ గథలు నీకు బై యెడనెడ రాఁ
'కేయూర బాహు' చరితము
చేయుము నీ వంధ్రభాష శిల్పము మెఱయన్."

"అని పలికి బహుమాన పూర్వకంబుగా నంబరాభర ణాది వివిధ పదార్థ సహితంబుగాఁ దాంబూలం బిచ్చినఁ బుచ్చుకొని... ... ..."

"బాల రసాల సాల నవ
  పల్లవ కోమల కావ్య కన్యక
న్గూళల కిచ్చి యప్పడుపుఁ
  గూడు భుజించుట కంటె సత్కవుల్

హాలికు లైన నేమి ? మఱి
యంతకు నా యతి లేని వాఁడు గా
ద్దాలికుఁ డైన నేమి ? నిజ
దార సుతోదర పోషణార్థమై."

"అని తగని వాని దెస నా
మన సెప్పుడు రోయుఁ గాన మతినజ్జన వ
ర్ణనలకు మిగిలిన సుగుణుని
నినుఁ బొంది మదీయ కవిత నెగడుం బుడమిన్."

"కావున నీకుఁ గృతి యిచ్చెద... ... ..."

—అను 'కేయూర బాహుచరిత్ర' పద్యములు గుండన మంత్రి తన కృతి కన్యకకుం దగిన వరుండని మంచన యన్వేషించి యన్వేషించి నిర్ధరించి నట్టు దెలుపకయ తెలుపు చున్నవి.

కేయూర బాహు చరిత్రమున

"పాటించి కాకుళేశ్వరు తిరునాళ్ళలో
నర్థుల నేఁటేట నర్థమిచ్చు"

"నలువురఁ గాకుళేశు తిరు
నాళుల లోపల గుండమంత్రి ని
ర్మల మతిఁ బెట్ట వేగమొయి
మాడలు రత్నచయంబుఁ జల్లఁగా
నలవడు హేమ వృష్టిక్రియ
నర్థులు చాతక కోటిగాఁగ లో

గలగల రాలు ముత్యములు
గానఁబడు స్వాతిగర్భశుక్తిపటికా."

—అని మంచన కవి యభివర్ణించెను. ప్రతి సంవత్సరము గాకుళేశ్వరున కుత్సవములు జరగుచున్నట్లును, అచటికి వచ్చు తైర్థిక కోటికి విత్త మొసగుచున్నట్లును,—గుండన్న మంత్రి వినిర్మల హృదయమునకు నోసంగు ముత్యాలు రత్నములు లోనగు నవి సువర్ణవృష్టి వోలె నున్నయట్లును, చాతకముల భంగి నగుచు లున్నట్లును,— నున్నది యున్నట్లు లభివర్ణించి యమ్మహామాత్యుని నిజస్వరూపము వెలి కుద్గమింపఁ జేసినందుల కెంతయు శిష్టలోక మంచన కవికిఁ గృతజ్ఞులము. ఇట్టి దాతలు, సచివోత్తములు, కవి హృదయ మెఱింగి వర్తించు వా రిప్పు డేరీ!

ప్రతులు దొరకు నా స్థలము (ప్రాప్తిస్థానము :

# లలితా నివాసము

## నాగేశ్వరపురము,

## బాపట్ల.